విశ్వసాహిత్యమాల 43.

# టాల్‌స్టాయ్ కథలు

లియో టాల్‌స్టాయ్.

అనువాదం :

జగన్మోహన్



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

2

# TOLSTOY KATHALU

TRANSLATED BY

*M. Jaganmohan Rao.*

Avanti Press - Rajahmundry,

Q. H. No. E-G. 91, Copies 1000,

M. Jaganmohan Rao, Q. H. No. E-G. 75,

March 1947.

Rs. 1/8

# ముందు మాట.

టాల్‌స్టాయ్ మహాశయుడు ప్రపంచ విఖ్యాతుడైన మహాకవి; ఉత్తమ శ్రేణికి చెందిన కళావేత్త. వివిధ సాహిత్య విమర్శకులు యీయనను కారుణ్య వాదిగా, నైతిక వాదిగా, నవ్యతా వాదిగా పరిగణిస్తున్నారు.

19వ శతాబ్దపు ఆఖరిభాగంలోనూ, 20వ శతాబ్ద ప్రారంభంలోను రష్యా చక్రవర్తుల నిరంకుశత్వాన్నీ, ఆ నాటి జమీందారీ సమాజంలోని అన్యాయాల్నీ బహు తీవ్రంగా ఖండిస్తూ, ప్రజా చైతన్యాన్ని ఉత్తమ మార్గాల్లో నడుపుటకు తన రచనల ద్వారా, జీవితంద్వారా యత్నించిన వాడు టాల్‌స్టాయ్. ఇతని గ్రంధాలు నేడు సోవియట్ రష్యాలోని అన్ని భాషలలోను కోట్లకొలది ప్రతులు ముద్రితమై వ్యాప్తి నందినాయి.

కథానికా రచనలోనూ, నవలా రచనలోనూ, టాల్‌స్టాయ్ అందె వేసిన చేయి. ప్రపంచ భాషలెన్నిటిలోనో యీయన రచన లనువదించ బడినాయి.

తెలుగులో టాల్‌స్టాయ్ కథలుకొన్ని భారతి మొదలైన పత్రికల్లో చాలకాలం క్రిందట వెలువడినాయి. ఆయన కథల ప్లాటులనే తీసుకొని, మన సమాజపు వాతావరణాన్నీ, పాత్రల్నీ చొప్పించి శ్రీ తల్లాప్రగడ ప్రకాశ రాయుడు గారు, శ్రీముద్దా విశ్వనాధం గారు, కొన్ని కథలను వ్రాసి ప్రకటించేరు.

టాల్‌స్టాయ్ రచనలను సక్రమంగా, సమగ్రంగా అనువదించి, ప్రకటించుటకు విశ్వసాహిత్యమాల ప్రయత్నిస్తూంది. ఆంధ్ర మహాజనుల ఆదరాభిమానాలుంటే మా కృషి శీఘ్రంగా సఫలం కాగలదు.

అనువాదం మూలానుసరణంగానే నడిచింది.

రాజమండ్రి.
30-3-1947

ఇట్లు,
మహీధర జగన్మోహన్.
సంపాదకుడు.

4

# విషయ సూచిక.



లియో నికోలేవిచ్ టాల్‌స్టాయ్.

1828 సెప్టెంబరు 9 న 'యాస్నయాపోల్యానా'లో జన్మించేడు.

మహాకవి, కళావేత్త, కారుణ్యవాది, మానవోత్తముడు.

1910 నవంబరు 22 న చనిపోయేడు.

# నిజము నిలకడమీద తెలుస్తుంది

ఒకానొకప్పుడు వ్లాడిమిర్ పట్టణంలో డిమిత్రిచ్ అక్సినోవ్ అనే వర్తకుడుండేవాడు. అతనికి పిత్రార్జితం ఒకయిల్లూ, రెండు దుకాణాలూ ఉన్నాయి. భుక్తికేమీ లోపంలేకండా జరుగుతూంది.

అక్సినోవ్ యువకుడు; అందగాడు; తేజోవంతమైన ముఖం, నొక్కులజుట్టు; యెల్లప్పుడూ సంతోషంగా వుంటాడు. సంగీతమంటే అతనికెంతో ప్రీతి. చిన్నతనంలోనే మద్యపానానికలవాటుపడి, చెడు సహవాసాలుచేసి, చాలా అల్లరిచిల్లరగా వుండేవాడు. కాని, వివాహం చేసుకున్నాక త్రాగడంమానేసి, బుద్ధిమంతుడయ్యేడు. వ్యాపారం జాగ్రతగా చేసుకుంటూ, మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు. అదివేసవికాలం. నిఝనీ పట్టణంలో తిరునాళ్లు గొప్పగా జరుగుతూంటుంది. ఏటా అక్కడ దుకాణం వేస్తూంటాడు, అక్సినోవ్. ఆయేడుకూడా మామూలుగానే అక్కడి ఉత్సవానికి వెళ్లాలని అక్సినోవ్ అనుకుని, భార్యతో చెప్పాడు. ఆమె అతన్ని వెళ్ళవద్దని వారించింది.

"రాత్రి నాకుచాలా చెడ్డకలవచ్చింది. మీరు యీ వేళమాత్రం ప్రయాణమై వెళ్ళవద్దు." అంటూ ఎంతో బ్రతిమాలింది.

అక్సినోవ్‌కి ఆమెఅల్లా భయపడ్డం నవ్వులాటగా తోచింది.

"నీభయమేమిటో నాకుతెలుసులే. ఉత్సవానికి పోయేటప్పుడు బాగా డోసువేసుకొనివెళ్లి యేదో చిక్కు తెస్తాననేనా?" అన్నాడు, నవ్వుతూ.

"భయమెందుకో నాకు తెలియదు. కలమాత్రం వచ్చింది. చాలా భయంకరమైన స్వప్నం. నీవు తిరిగివచ్చేపుట. కాని టోపీ తీసేటప్పటికి నీజుట్టుఅంతా తెల్లగా నెరిసిపోయివుందిట!" కాతరస్వరంతో అంది.

అక్సినోవ్‌కి ఆమె మాటలుచూస్తే మరీ నవ్వువచ్చింది. "అది మంచి శకునం. చూద్దుగానిగా, తీర్థంలో బాగా బేరంచేస్తా; నీకు మంచి బహుమతీ పట్టుకురాకపోతే అడుగు."

ఈరీతిగా భార్యను పరిహాసంచేస్తూ, గుర్రంయెక్కి పట్నానికి బైలుదేరేడు. దారిలో మరోవర్తకుడు జతకలిసేడు. అతడూ అక్సినోవ్‌కి పరిచితుడే. ఆరాత్రికి యిద్దరూ ఒక హోటలులోనే బసచేసేరు. రాత్రి టీ త్రాగేక యిద్దరూ చెరోగదిలోనూ పడుకుని నిద్రబోయారు.

తెల్లవారగట్లే లేవడం అక్సినోవ్‌కి అలవాటు. చల్లగా వుండగానే ప్రయాణంచేయడం సులభంగదాఅని చీకటివుండగానే నౌకరుని లేపి, గుర్రానికి జీనువేయమని తొందరచేసేడు.

హోటలుయజమాని ఆవెనుకే చిన్నయింట్లో కాపురముంటు న్నాడు. అతన్నిపిలిచి, తానీయవలసిన పైకంచెల్లించి, బిల్లుతీసికొని, సేవకునితోకూడా ప్రయాణమైపోయేడు. ఇరవైమైళ్లు సుమారు పోయాక గుర్రాన్నిఆపి, దిగేరు. రోడ్డుప్రక్కనే సత్రంవుంది. అప్పుడే పొద్దుమెక్కుతూంది. చల్లని చెట్లనీడని గుర్రాల్నిఆపి, లోపలికివెళ్ళి, సత్రంయజమానిని సామొవార్ వెచ్చచేయమని హెచ్చరించాడు. హాల్లోనేకూర్చుని గైటర్ (ఫిడేలువంటి వాద్యవిశేషం) తీసి, ఆలాపనచేసి, కులాసాగా పాడుతున్నాడు.

ఇంతలోనే గణగణగంట శబ్దంచేస్తూ, బండి ఒకటివచ్చి సత్రం దగ్గరే ఆగింది, దాంట్లోంచి ఒకఆఫీసరూ, యిద్దరు పోలీసులూ దిగేరు. ఆఫీసరు సరాసరిగా అక్సినోవ్ దగ్గిరికేవచ్చి, ఎవరవనీ, ఎక్కడనుంచి వచ్చేవనీ ప్రశ్నించేడు. అక్సినోవ్ సూటిగాజవాబులిచ్చి, అమాయకంగా "ఏమిటండీ, ఊరికే అట్లాతొందరపడతారు. కూర్చోండి, నాతోబాటు కాస్త టీ పుచ్చుకుందురుగాని." అన్నాడు. కాని ఆఫీసరు యిదేం పట్టించుకోకుండా ప్రశ్నలు వేస్తూనేవున్నాడు.

"పోయిన రాత్రి నువ్వెక్కడున్నావు?"

"నువొక్కడవేనా? నీతో మరోవర్తకుడు కూడా వున్నాడా?"

"అతన్ని నువ్వు యీఉదయం చూసేవా? లేదా?"

"ఆహోటల్ నుంచి యింత తెల్లారగట్లే బైలుదేరేవేమి?"

ఇన్ని ప్రశ్న లడుగుతూంటే అక్సినోవ్‌కి ఆశ్చర్యం వేసింది. అయినా ఓపిగ్గా ఆప్రశ్నలన్నిటికీ సమాధానంగా, జరిగినదంతా చెప్పేడు.

"నేనెవర్నో దొంగనో, ముచ్చునో అయినట్లు ఊరికే యీప్రశ్న లేమిటి? నాస్వంతవ్యాపారం మీద వచ్చేను. నన్ను యిల్లాంటి ప్రశ్నలు వేయడానికి అవసరమేముంది?"

దానిమీద ఆఫీసరు, పోలీసుల్ని పిలిచేడు.

"ఈజిల్లాకి పోలీసుకమీషనర్‌ని నేను. నీతోకూడా వచ్చిన వర్త కుడు పీకతెగి, చచ్చిపడివున్నాడు. నిన్ను సెర్చిచేయాలి."

అంటూ లోపలికి ప్రవేశించి, అక్సినోవ్ యెదుటే అతని సామా నంతా దించి, వెతికేరు. హఠాత్తుగా ఒక సంచిలోంచి కత్తి దొరికింది. ఆఫీసరు దాన్ని బైటికి తీసి "ఇది నీదేనా?" అని అరిచేడు.

అక్సినోవ్ అదిరిపడ్డాడు. తన సామానులోంచే రక్తం మరకల తోవున్న కత్తి బైటికి వచ్చింది!

"ఈకత్తిమీద రక్తం యెందుకుంది?"

అక్సినోవ్ మాట్లాడ్డానికి ప్రయత్నించేడు. కాని, నోట మాటే రాలేదు. డగ్గుత్తికతో, నత్తిగా, గొణుగుతూన్నాడు.

"నె—నె—నే-నెరగను. అ—అ—అది న-నన-నా-ది కాదు."

ఆఫీసరుకి చాలా కోపంవచ్చింది. గద్దిస్తూఅడిగేడు.

"ఈరోజు ఉదయానికి ఆ రెండోవర్తకుడు పీకతెగి చచ్చిపడు న్నాడు. ఆ పనిచెయ్యగలవాడెవడు, నువ్వుతప్ప? గదిలోపల గడియపెట్టి వుంది! దారి నీగదిలోంచితప్పలేదు. నీ సంచిలో రక్తపుడాగులున్న కత్తి

యిదిగో, దొరకనేదొరికింది. నీవైఖరీ, నసుగుడూచూస్తే, నువ్వేఆ పని చేసివుంటావనటానికి సందేహమేమిటి? చెప్పు. వాణ్ణి ఎందుకుచంపేవు? ఎంతడబ్బు దొంగిలించేవు?"

అక్సినోవ్ తాను ఏమీఎరగనని ఒట్లుపెట్టుకున్నాడు. ఏడ్చాడు మొత్తుకున్నాడు. తాను రాత్రి టీ త్రాగేటప్పుడుతప్ప మళ్లీ అతన్ని చూడ నైనాలేదని వాపోయాడు. స్వంతడబ్బు ఎనిమిదివేల రూబుల్సుతప్ప తన దగ్గర యెవరిసొమ్మూలేదనీ, కత్తితనదికాదనీ పదేపదేచెప్పి, ఏడ్చేడు. కాని, అతనిముఖం భయంతో వికృతంగావుంది; వణకిపోతున్నాడు. నిజంగా అపరాధంచేసేడే అనుకొనేలా వుందాతనివైఖరి

అక్సినోవ్‌ని బంధించమని ఆఫీసరు ఆజ్ఞాపించాడు. కాళ్ళుకట్టి బండిలో పడేస్తూంటే, అతడు క్రాసుచేసుకుని, యేడ్చేడు. అతనిడబ్బూ, సామానులు అన్నీ పోలీసులు స్వాధీనంచేసుకుని, దగ్గరలోనున్న పట్నానికి పంపించేరు. వ్లాడిమిర్‌లోని అధికారులకి ఈతని ప్రవర్తననిగూర్చి రిపోర్టుచేయమని వ్రాసేరు. పడుచుతనంలో తాగుతూ, స్వేచ్ఛావిహారిగా వుండేవాడుగాని దరిమిలాను దుర్గుణాలన్నీ వదిలి, గౌరవప్రదమైన జీవితాన్నే గడుపుతూన్నాడని రిపోర్టువచ్చింది. కేసువిచారణకి వచ్చింది. ర్యాజాన్ పట్టణవర్తకుణ్ణి హత్యగావించి, యిరవైవేల రూబుల్సు అపహరించిననేరం అక్సినోవ్‌మీద మోపబడింది.

పాపమాతని యిల్లాలు దుర్భరదుఃఖంలో మునిగిపోయింది. ఏమని నమ్మాలోకూడా ఆమెకుతోచలేదు. బిడ్డలా కసుగందులు. పాలుత్రాగే నెలలపిల్లవాడొకడు. పిల్లలందర్నీ తీసుకొని, భర్తనువుంచిన జైలుకి వెళ్లింది. మొదట్లో భర్తనుచూడ్డానికి అనుమతినీయ నిరాకరించారు. ఎంతో బ్రతిమాలి, వేడ్చి, మొరపెట్టుకున్నాక పోలీసులధికారులు ఆమెకు భర్తను చూడ్డానికనుమతినిచ్చారు. భర్తను జైలుదుస్తుల్లోచూడగానే ఆమెకి స్మృతి

తప్పిపోయింది. చాలాసేపటికి తేరుకుని, పిల్లల్ని దగ్గరికితీసుకుని, భర్త సమీపానికివచ్చి కూర్చుంది. ఇంటివగ్గరి పరిస్థితుల్నిగూర్చి చెప్పి, యేం జరిగిందో నిజంచెప్పమని అడిగింది. అతడు చెప్పినదంతావిని, "ఇప్పు దేంచేయాలి ?" అనడిగింది.

"ఒక నిరపరాధిని చంపనీయవద్దని జార్‌చక్రవర్తికి పిటిషన్ పెట్టాలి."

తానావరకే అట్లాంటి పిటిషన్ పంపించినట్లూ, కాని దానిఫలితం ఏమీకలగలేదనీ భార్య చెప్పినప్పుడు, అక్సినోవ్ మౌనంగా అట్లే కూర్చుండిపోయాడు. మరింత క్రుంగి దీనంగా కనిపించాడు.

ఆమె కళ్ళుతుడుచుకుని, నిట్టూరుస్తూ, "చూసేరా, మీజుట్టు నెరిసి పోయివుందని నాకు కలవచ్చిందంటే విన్నారుగాదు. ఆరోజున బైలు దేరవద్దని యెంత బ్రతిమలాడినా మీరు విన్నారేగాదు. అయ్యయ్యో !" అంటూ చేతివ్రేళ్ళు అక్సినోవ్ జుట్టులోంచి పోనిచ్చి, తలనిమిరింది. "ఏమండీ, నాతోనైనా నిజంచెప్పరూ ? అదిచేసింది మీదుగామా ?"

"అయితే నువ్వూ నన్ననుమానిస్తూన్నావన్నమాట !" ఉలిక్కి-పడి, వెర్రిగా అరిచేడు, అక్సినోవ్. ముఖంచేతులతో కప్పుకుని, నిరాశతో హృదయం బ్రద్దలవుతుందా ? అన్నట్లు వెక్కి-వెక్కి-యేడ్చేడు. ఇంతలో టైం అయిపోయిందని కాపలావున్న పోలీసువాడువచ్చి చెప్పేడు. అక్సినోవ్, కుటుంబందగ్గర ఆఖరిసారి సెలవు పుచ్చుకున్నాడు. అదే ఆఖరిచూపు !

వాళ్లు వెళ్లిపోయేక భార్యమాటలన్నీ తలచుకుని, తలకుని కుమిలి పోయాడు. చివరకి ఆమెకూడా తానాపనిచేసినట్లే భావిస్తూందన్నమాట ! "నిజానిజాలు ఈశ్వరుడొక్కడికే తెలుసు. ఆయన ఒక్కడే నామీద దయ చూపగలవాడు. ఆకరుణామయుడొక్కనికే నేను మొరపెట్టుకోగలను. అని నిశ్చయానికి వచ్చేడు. ఇంక ఆరోజునుంచీ తన నిర్దోషిత్వాన్ని

మన్నించుమని ఎవరికీ మళ్లీ పెటీషన్ పెట్టనేలేదు. అక్సినోవ్, నిరాశతో గుండె రాయిచేసికొని, ఈశ్వరప్రార్థనచేస్తూ రోజులు గడుపుతున్నాడు.

దెబ్బలశిక్ష, సైబీరియాకు ప్రవాసం,— యిదీ కోర్టుతీర్పు. బహిరంగంగానే గుడ్డలుకూడా తీసేసి, లావైనబెత్తంతో తుంటలమీద రక్తంకారి, చర్మం ఊడేలాకొట్టేరు. కొన్నిరోజులుదాకా హాస్పిటల్లోఉంచి, పుండ్లు మానేక, సైబీరియాకు యితర నేరస్తులతోబాటు ప్రవాసంపంపేరు.

అక్సినోవ్ ఇరవైఆరు సంవత్సరాలు ప్రవాసంలో, గనుల్లో పని చేస్తూ ఖైదీగా గడిపేడు. జుట్టుఅంతా తెల్లబడిపోయింది. గడ్డం పొడుగ్గా యెదిగి, పల్చగా, తెల్లగా మంచులా అయిపోయింది. అతనిముఖంలో సంతోషచ్ఛాయలుకూడా లేవిప్పుడు. నడ్డివంగింది. చాలమితభాషిఅయేడు. అతడు నవ్వడం ఎవరూచూడనేలేదు. అతని నడకచాలా నెమ్మదిగా, భారంగా వుండేది. తరుచుగా దైవప్రార్థన చేస్తూండేవాడు.

జైలులోనే బూట్లు కుట్టడం నేర్చుకుని, అక్సినోవ్ కొద్దిగా సంపాదించేవాడు. ఆపైకంతో "మహర్షుల జీవితాలు" కొని, సాయంత్రాల్లో కొట్లు తాళాలువేసేక, వెలుతురున్నంతసేపూ చదువుకుంటూండేవాడు. జైలులోనే ఒక చెర్చివుంది. ఆదివారాలు అందులో దైవప్రార్థనకు ఖైదీలందరూ వెడతారు. ప్రతిఆదివారం ప్రార్థనలోనూ అక్సినోవ్ "మహర్షుల లేఖలు" చదివి, భజనకీర్తనలు పాడేవాడు. అతని స్వరంలోని స్పష్టత, మార్దవత్వం మాత్రం పోలేదు.

అతని సాధుస్వభావానికి జైలుఅధికారులు మెచ్చుకునేవారు. తోడి ఖైదీలు గౌరవించేవాళ్లు. అందరూ అతన్ని "తాతా" అనీ, "ఋషి" అనీ పిలిచేవారు. ఖైదీలకేదేనా యిబ్బందివున్నా, ఏదైన అధికారులనడగాల్సి వచ్చినా అక్సినోవ్‌నే రాయబారిగా పంపేవారు. ఖైదీలలో తగువులు వచ్చినా తీర్పరిగా యితన్నే యెంచుకొనేవారందరూ.

దేశాన్నుంచి వచ్చేక మళ్లీ యింటిదగ్గరనుంచి ఉత్తరాలు రానే

లేదు. చివరికి కబురేనా తెలియలేదు. భార్యా, పిల్లలూ బ్రతికేవు లేనో కూడా తెలియదు.

ఒకరోజున ఖైదీలగుంపు ఒకటి కొత్తగా జైలుకివచ్చేరు. సాయంకాలం పనులనుంచి వచ్చేక పాతఖైదీలంతా కొత్తవాళ్లచుట్టూ గుమిగూడి ఎక్కడనుంచి వచ్చేరో, ఎందుకు శిక్షించేరో, మొదలైన విశేషాలన్నీ అడుగుతూన్నారు.

ఆగుంపులోనే ఒకచోట అక్సినోవ్ కూడా తలవొంచుకుని, చిన్నబోయినముఖంతో, వాళ్లు చెప్పిందివింటూ కూర్చునివున్నాడు.

కొత్తఖైదీల్లో పొడుగాటి, బలమైనవాడొకడున్నాడు. అతనికి అరవై దాటివుంటుంది. పొట్టిగా కత్తిరించిన తెల్లటిగడ్డంతో మంచి దార్ఢ్యంగా కనిపిస్తున్నాడు. అతడూ తనకథ చెప్పుతూన్నాడు.

"ఆఁ! ఏముంది, నేరానికి? రోడ్డుమీద స్లెడ్జికి కట్టివుందిగుర్రం. దాన్ని తీసుకువెళ్లేను. ఆపళంగా నేను గుర్రాన్ని దొంగిలించేనని అరెస్టు చేసి, కేసుపెట్టేరు. అంతే; నేనేమన్నానో తెలుసా? ఇంటికి త్వరిగా పోవచ్చునని గుర్రాన్ని యెక్కేననీ, తర్వాతదాన్ని వదిలేసేననీ! అంతే గాకుండా అసలాగుర్రాన్ని తోలేవాడు నాస్నేహితుడుకూడాను. అదీ చెప్పాను. "నేచెప్పింది, తెలిసిందా. నేను దొంగిలించలేదని యిప్పుడేనా ఒప్పుకుంటారా?" ఆహాఁ..! వాళ్లని తగలెయ్యా వాళ్లువింటారా? "అవ్వే, నువ్వుదొంగిలిచావు." కాని, ఎక్కడ దొంగిలించానో, ఎల్లాదొంగిలించానో మాత్ర ఋజువు చెయ్యలేకపోయేరు. నేనసలు ఎప్పుడో యిక్కడికి వచ్చివుండాల్సినవాణ్ణి. నిజంగా నేరంచేసినప్పుడు నన్ను పట్టుకోలేకనే పోయేరు. ఈసారినేను ఏమీనేరం చేయనప్పుడు ప్రవాసశిక్ష చెప్పేరు! నేచెప్పేదంతా అబద్ధమే. ఇదివరకే ఒకసారి సైబీరియాకు రావడం అయింది. కాని, నేనెంతోకాలం. యిక్కడ వుండలేను!" ఈవరసని వాగుతున్నాడా, ముసలాడు.

"నీదేవూరు? ఏప్రాంతం?" అన్నారెవరో.

"వ్లాడిమిర్ పట్టణం. నాకుటుంబం ఆపట్టణంలోనేవుంది. నాపేరు మకర్. కుటుంబంపేరు సెమెనిచ్ అంటారందరూ."

ఆమాటలు వినడంతోనే అక్సినోవ్ తలయెత్తి అడిగేడు." సెమెనిచ్! వ్లాడిమిర్‌లోని అక్సినోవ్ కుటుంబాన్ని యెరుగుదువా? వాళ్ళిప్పుడు బాగావున్నారా?"

"ఎరుగుదువా అనడుగుతావా? వాళ్ళనే యెరక్కపోవాలి! వాళ్ల బాగా వున్నవాళ్లే. కాని వాళ్ళనాన్న సైబీరియాలో శిక్షనుభవిస్తున్నాడు. మనకి మల్లేనే పాపిష్ఠిజీవి, అయితే తాతా! నువ్వెందుకు వచ్చేవిక్కడికి" అన్నాడు మకర్.

అక్సినోవ్‌కి తన దురదృష్టపు జీవితాన్ని మాట్లాడాలని లేదు. నిట్టూరుస్తూ జవాబిచ్చేడు. "నాపాప ఫలితంగా యిప్పటికి యిరవై ఆరేళ్ళనుంచి జైల్లో మగ్గుతున్నాను."

"ఏమిటో ఆపాపాలు?" అన్నాడు మళ్ళీ, మకర్.

కాని సంభాషణని తుంచేసెయ్యాలని "ఆ! ఏదో! ఎంతచేసుకున్న వాళ్ళకంత!" అన్నాడు. అతడింకేమీ చెప్పేవాడుగాదు. కాని మిగిలిన ఖైదీలు అక్సినోవ్ కేసు వివరాలన్నీ చెప్పేసేరు. ఎవడో ఒకవర్తకుణ్ణి చంపి, అక్సినోవ్ సంచిలో కత్తిపెట్టి పారిపోవడం. అతడు అన్యాయంగా శిక్షించబడటం,—అంతా చెప్పేసేరు.

మకర్ సెమెనిచ్ యీకథంతా విని అక్సినోవ్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ, తొడమీద చేత్తో తట్టుకుంటూ బిగ్గరగా,—"అరె! ఇది చాల ఆశ్చర్యంగా వుందే! నిజంగా! కాని, నువ్వెంత ముసలివాడ వైపోయేవు తాతా!" అన్నాడు, తాతవైపు తిరిగి.

అందరూ ఆశ్చర్యపడ్డారు. అక్సినోవ్ నెట్లా యెరుగుననీ, ఎక్కడ చూసేవనీ అడిగితే అతడు సరిగ్గా సమాధానం చెప్పలేదు.

"మనం అందరం యిక్కడ కలుసుకోడం చాలా చిత్రంగా వుంది!" అని తప్పించుకున్నాడు.

మకర్ మాటల్నిబట్టి అతనికి వర్తకుణ్ణి చంపినవాడు తెలిసి వుంటాడని తోచి, అక్సినోవ్,—"మకర్! నువ్వు నాకేసుసంగతంతా వినే వుంటావు. లేకపోతే నన్నెక్కడేనా చూసేవా?" అన్నాడు.

"తెలియకుండా ఎల్లావుంటుంది? ఎన్నోరకాల ప్రకార్లు. అప్పుడే చాలకాలం అయిపోయింది కదూ! నేనువిన్న దప్పుడే మరిచిపోయేను."

"ఆవర్తకుణ్ణి చంపినవా ణ్ణెరిగివుంటావు." అని పట్టుకున్నాడు. అక్సినోవ్.

మకర్ నవ్వేడు. "ఎవడి సంచిలో కత్తిదొరికిందో వాడే చంపి వుండాలి! మరొకరు అతని సంచిలో దాచకూడదా? అనడగొచ్చు— కాని, దొరికేవరకూ దొంగకాదు!" అనే సామెత వుందిగాదూ? నీతల క్రింద వున్న సంచిలో మరొకరు కత్తిదాచడం యెట్లా సాధ్యమవు తుందో, చెప్పు? అట్లా పెట్టడానికి ప్రయత్నిస్తే మేలుకోవూ?"

ఈమాటలు వినగానే యితడే వర్తకుని చంపినవాడై వుంటాడని అక్సినోవ్‌కి స్ఫురించింది. లేచినిల్చుని మెల్లిగా అక్కడి నుంచి వెళ్ళి పోయేడు. ఆరాత్రంతా అక్సినోవ్‌కి నిద్రరాలేదు. అతని మనస్సు చాలా ఆరాటపడి పోతూంది. గతజీవితమంతా అతని కళ్ళముందర సినీమా చిత్రంలా కనిపించసాగింది. నిఝనీ తిరునాళ్ళకి పోయేటప్పుడు భార్యను వీడ్కొన్న ఘట్టం గుర్తుకువచ్చింది. ఆమె ముఖం, కళ్లు, అన్నీ స్పష్టంగా కనిపించాయి. ఆమె మాటలు, నవ్వులూకూడా వినిపించాయి. అప్పటికి చిన్నవాళ్ళుగావున్న తనబిడ్డలు కనిపించారు. పెద్దవాడు చొక్కా తొడుక్కుని తల్లిచెయ్యిపట్టుకుని నిల్చుని వున్నాడు. రెండోవాడు తల్లి పాలుత్రాగుతూన్నాడు. పడుచుతనంలో తనెంత సంతోషంగా వుండే

వాడో జ్ఞాపకం వచ్చింది. ఆసత్రం వసారాలో కూర్చుని గైటర్ వాయిస్తూండగా పోలీసు ఆఫీసరువచ్చి అరెస్టుచేసిన దృశ్యమంతా స్ఫురణకి వచ్చింది. తనను కొరడాదెబ్బలు కొట్టడం, జనం గుంపులుగా చూడ్డం, సంకెళ్లూ, ఖైదీలూ, యిరవై ఆరుసంవత్సరాల జైలుజీవితం, అకాలంలోనే ముసలితనం రావడం; అన్నీ కళ్ళకి కట్టినట్లున్నాయి. ఈ ఆలోచనలతో అక్సినోవ్ యెంతో బాధపడిపోయేడు. జీవితాన్ని ఆఖరు చేసుకొందామా? అన్నంత విరక్తుడైపోయి అనుకున్నాడు:

"ఇదంతా యీదుర్మార్గుని మూలాన్నే!"

మకర్‌మీద అంతులేని కోపం వచ్చేసింది. తానేమైపోయినాసరే వాడిమీద కసి తీర్చుకోవాలి. రాత్రంతా దైవప్రార్థన చేస్తూనే వున్నాడు. కాని అక్సినోవ్ మనస్సు శాంతించలేదు. మరునాడు రోజంతా మకర్ వైపు చూడలేదు; అతనివైపు వెళ్ళలేదు. రోజులు గడుస్తూన్నాయి. రెండు వారాలు గడిచినాయి. రాత్రిళ్ళు నిద్దరే దూరమైంది, అక్సినోవ్‌కి. ఒక్కొక్కసారి ప్రాణాలమీద విరక్తి కలుగుతూంది. ఏంచేయడానికీ తోచడంలేదు.

ఒక రోజున జైలులో తిరుగుతూన్నాడు, అక్సినోవ్. ఖైదీలు పండుకొనే కొయ్యబోషాణం క్రిందినుంచి మట్టిపెళ్లలు పైకి పడుతున్నాయి. అదేమిటో చూద్దామని అక్సినోవ్ అక్కడే నిలుచుని పోయేడు. కొంచెం సేపట్లో బోషాణం క్రిందినుంచి మకర్ పాకుతూ పైకి వచ్చి, అక్సినోవ్‌ను చూసి హడిలిపోయి, వెర్రిచూపులు చూస్తూ వుండిపోయేడు. అక్సినోవ్ వెళ్ళిపోదామని నడుస్తూంటే, మకర్ తటాలున అతని చేయి పట్టుకుని అంతా చెప్పనారంభించేడు. గోడక్రింద కన్నం త్రవ్వి, ఆమట్టినంతనూ రోజూ బూట్లలో కొంచెకొంచెంగా తీసుకునిపోయి, బైటిపనికి పోయినపుడు రోడ్డుమీద పారపోసి వస్తున్నానని చెప్పేశాడు.

"తాతా! ఈసంగతి రహస్యంగా వుంచుసుమీ! నువ్వు తప్పించుకోవచ్చులే. నువ్వు చెప్పేశావంటే నన్ను చావకొడతారు. కాని నేను. నీప్రాణాలు తీయకుండా వదిలిపెట్టను!"

అక్సినోవ్ కోపంతో వణికిపోయేడు. శత్రువువంక తీవ్రంగా చూస్తూ. చేతిని వెనక్కి తీసుకుని, "నాకు తప్పించుకోవాలనిలేదు. నీకు నన్ను చంపవలసిన అగత్యమేమీలేదు. నన్ను చాలాకాలంక్రిందటే చంపేసేవు! నీవు చేసినదాన్ని బైటపెట్టడం సంగతన్నావా అది దేవుని ముఖం చూసి, నాకా ఈశ్వరుడెట్లాతోపిస్తే అట్లా చేస్తానంతే." అని వెళ్లిపోయేడు.

మర్నాడు ఖైదీలని పనికి తీసుకుపోయేటప్పుడు రోడ్డుమీద ఎవరో మట్టిపోసినట్లు చూసేడో, వార్డరు. కొట్లన్నీ తనిఖీచేసేరు కన్నం వారికి పోయింది. గవర్నరువచ్చి ఖైదీలందర్నీ ఫైల్లో నిలబెట్టి చాలాసేపు ప్రశ్నచేడు. అందరూ తమకు తెలియదనేచెప్పేరు. తెలిసినవాళ్లుకూడా బైటపెట్టలేదు. చెపితే మకర్ వంటిమీద చర్మంగాని, లోపలి దుమ్ముగాని వుండనీయడని అందరికీ తెలుసు. చివరికి అక్సినోవ్ దగ్గరికి వచ్చేరు, గవర్నరు. ఈవృద్ధుడు చాలా పెద్దమనిషని అతనికి తెలుసు. గవర్నరు అతనితో,—

"నీవు ఎప్పుడూ అబద్ధమాడవని తెలుసు. తాతా! దేవుడిమీదుట ఈకన్నం తవ్వినదెవరో చెప్పు?"

మకర్ తన్నుగానట్లుగా. నిశ్చలంగా గవర్నరువంకచూస్తూ నిలుచున్నాడు. అక్సినోవ్‌వైపు చూస్తూన్నట్లేలేదు. అక్సినోవ్ చేతులూ, పెదవులూ వణికిపోయినాయి. చాలా సేపటివరకూ ఏమీ నోటమాటేరాలేదు. అతనిభావాలు పరిపరివిధాల పోతూన్నాయి. "నేను వీణ్ణి. నాజీవితాన్ని నాశనంచేసిన వీణ్ణి ఎందుకు కాపాడాలి? నేను అనుభవించిన కష్టాలకీ మూల్యాన్ని చెల్లించనీ. వాడని నేనేగనుక చెప్పేనంటే, మకర్ ప్రాణాలతో బ్రతికి బైటపడ్డంకష్టం. కాని, పాపం నేనేపొరపాటుగా వాడను

కుంటున్నానేమో? పోనీ, అంతా జరిగిపోయింతర్వాత, వాడు బాధపడితే నాకు కలిసివచ్చేదేమైనావుందా?"

గవర్నరు తొందర పడిపోతూన్నాడు. మళ్లీమళ్లీ అడుగుతున్నాడు.

"ఏఁ.! తాతా! చెప్పు. ఎందుకు ఊరిఖే ఆలస్యంచేస్తావు. గోడ క్రింద కన్నం తవ్వినదెవరు?"

అక్సినోవ్ ఒక్కమాటు మకర్‌వైపుచూసి, అన్నాడు.

"చిత్తం. బాబయ్యా! ఏలినవారిదగ్గర నేనేం మాట్లాడలేను. దైవాజ్ఞలేదు నేనేం మాట్లాడడానికీ, దేవర ఏంచేసినాసరే నానోటమ్మట యింతంటె ఒక్కమాటారాదు. నేనుమీచేతుల్లో వున్నాను. మీచిత్తంవచ్చినట్లు చేసుకోవచ్చు."

గవర్నరు ఎంతో ప్రయత్నించేడు. కాని, అక్సినోవ్ నోటమ్మట మాటమాత్రం చెప్పించలేకపోయేడు. ఆకన్నాన్నిగూర్చిన విచారణ అంతటితో వదిలిపెట్టుకోవాల్సి వచ్చింది.

ఆరాత్రి అక్సినోవ్ పక్కమీద పడుకునివున్నాడు. అప్పుడే కునుకుపడుతూంది. ఎవరో మెల్లగావచ్చి, అతని పక్కమీద కూర్చున్నాడు. అక్సినోవ్‌కి మెలుకువవచ్చి, కళ్లుతెరచిచూసి, చీకట్లో మకర్‌ను గుర్తుపట్టేడు.

"నీకింకా నావల్ల ఏం కావాల్సివుంది? ఇక్కడికెందుకు వచ్చేవు?" అనడిగేడు, అక్సినోవ్.

మకర్ ఏమీమాటాడలేదు. అక్సినోవ్ లేచి కూర్చున్నాడు. "నీకేం కావాలి? వెళ్ళిపో! లేకపోతే వార్డరును పిలుస్తా."

మకర్ వంగి అక్సినోవ్ చెవులో మెల్లిగా అన్నాడు:

"ఇవాన్! డిమిట్రిచ్ అక్సినోవ్! నన్ను క్షమించు. పాపిని, నన్ను క్షమించవూ?"

"దేనికి?" అన్నాడు, అక్సినోవ్.

"ఆవర్తకుణ్ణి చంపుతనేనే. ఆకత్తిని నీసంచిలో వుంచిందికూడా నేనే. అసలు నిన్నుకూడా చంపాలనుకున్నా. అంతలో బైట ఏదో అలికిడి అయింది. అంచేత కత్తిని చటుక్కున నీసంచిలో వుంచి, కిటికీలోంచి తప్పించుకుని వచ్చేసేను."

అక్సినోవ్ యేమీ మాటాడలేదు. ఏం మాట్లాడాలో అతనికి తోచనేలేదు. పక్కమీదినుంచి దిగి, నేలమీద మోకరించి వేడుకుంటున్నాడు, మకర్.

"ఇవాన్ డిమిట్రిచ్! నన్ను క్షమించు. దేవునిమీద ఒట్టు. నన్ను క్షమించు. వర్తకుని చంపింది నేనే అని ఒప్పుకుంటా. నీకష్టాలు తొలిగి, యింటికి వెళ్ళిపోవచ్చు, సుఖంగా వుంటావు."

"నీకు యిప్పుడీమాటలు చెప్పడం తేలికే. నేను యిరవైఆరు సంవత్సరాలు నీమూలంగా బాధపడ్డాను. ఇప్పుడింక ఎక్కడికి వెళ్ళను. నాభార్య చనిపోయింది. నాపిల్లలే నన్ను మరిచిపోయేరు. నాకు పోయేటందుకు ఛోటేలేదు........"

మకర్ లేవలేదు. తల నేలనుపెట్టి బాదుకుంటూ యేడుస్తూన్నాడు:

"ఇవాన్ డిమిట్రిచ్! నన్ను క్షమించవూ? నన్ను వాళ్లు కొరడాలతో బాదేటప్పుడుకూడా యింతబాధ కలగలేదు..............నీకు నామీద దయకలిగింది. అందుకనే నువ్వేమి చెప్పలేదు........క్రీస్తు ప్రభువుకోసమేనా నన్ను క్షమించవూ? ఈపాపిష్టివాణ్ణి క్షమించవూ?" వెక్కివెక్కి యేడుస్తూ, చాలసేపుదాకా ఊరుకోలేదు!

మకర్ యేడుపుచూసి, అక్సినోవ్‌కి దుఃఖం ఆగలేదు. చివరికి, కళ్ళు తుడుచుకుంటూ, గొంతు సవరించుకుని, శాంతంగా,—

"దేవుడే నిన్ను క్షమిస్తాడు! బహుశా నీకంటేకూడా వెన్నో రెట్లు యెక్కువ పాపిష్ఠినే అయివుంటానేమో: అంతా ఈశ్వరేచ్ఛ!"

ఈమాట లంటూంటే అక్సినోవ్ హృదయం తేలికైంది. గుండెలమీదినుంచి ఏదో బరువు తీసేసినట్లైంది. ఇంటికి పోవాలనే కోరిక అతనిని వీడిపోయింది. చిరకాలంగా తానున్న యీ ఖైదును వీడి పోవాలని కోరడానికి అతనికి శక్తిలేదింక. మృత్యుదేవత కెంతశీఘ్రంగా దయకలిగి తన్ను ఒడిలోనికి తీసుకుపోతుందోనని మాత్రమే అతని నిరీక్షణ.

అక్సినోవ్ యెంతవారించినా వినక మకర్ తన నేరాలన్నీ ఒప్పేసుకున్నాడు. కాని, విడుదల ఆర్డరు వచ్చేటప్పటికి అక్సినోవ్ యీలోకాన్నివీడి చాలకాలమైపోయింది.

(రచన 1872)

# తీర్థయాత్రలు

'ఆ స్త్రీ ఆయనతో అంది: అయ్యా! నీవొక ప్రవక్తవని గ్రహించేను. మన పూర్వీకులంతా యీపర్వతాల్లోనే ఈశ్వరారాధన చేస్తూ వచ్చేరు. కాని మీరు చెప్పినదేమంటే మానవులు ఈశ్వరారాధన చేయతగ్గ పవిత్రస్థలం యెరూషలేమేనని—జీసస్, ఆమె కిట్లని జవాబిచ్చేరు: అమ్మా! నామాటలు విశ్వసించు. ఈపర్వతాలుగాని, యెరూషలేంగాని మాత్రమే ఆపరమపితను ఆరాధించుటకు తగిన ప్రదేశాలని చెప్పేరోజు గతించి పోయింది........ నూతనయుగం వచ్చింది. ఈశ్వరుని నిర్గుణునిగా, సత్యాన్వేషనద్వారానే నిజమైన భక్తులు ఆరాధించవలసిన సమయం ఆసన్నమైందని తెలుసుకో. తన భక్తులు అట్టివారుగనే వుండాలని పరమపితయైన ఈశ్వరుని సంకల్పము.'

—జాన్ 4. పే. 19-21, 23.

## 1

అనగనగా ఒకకుగ్రామంలో యెఫిమ్ షెవిలేవ్ అనే ధనికరైతూ, ఎలీషా బొద్రోవ్ అనే సాధారణరైతూ వుండేవాళ్లు. యెఫిమ్ చాలకచ్చితమైనవాడు; మర్యాదస్థుడు; ముక్కుకి సూటిగాబోయే స్వభావంగలవాడు; శాంతము, ఆలోచనా గలవాడు. ఎల్లాటి దుర్వ్యసనాలూ అతనిదరికి చేరలేకపోయేయి. మర్యాదస్థులుకూడా సర్వసాధారణంగా సేవించే సారాయం వగైరాలు కాదుసరిగదా చుట్టకాల్చడంగాని, పొడుంపీల్చడంగాని అతని కలవాటుకాలేదు. రెండుసార్లు "స్థరోస్థా" (గ్రామపంచాయితీకి పెద్ద)గా యెన్నుకోబడ్డాడు. ఆ రెండుపర్యాయములూ ఉమ్మడికాతాకు ఒక్కపైసా కూడ అప్పుచూపించి యెరుగడు. అతనికుటుంబం పెద్దది: యిద్దరు కొడుకులు; వివాహితుడైన మనుమడూ; అంతా సమిష్టిగానేవున్నారు. యెఫిమ్‌కి డెబ్భైయేళ్లునిండినా యిప్పటికీ నడుంవంగలేదు. చాల దార్ఢ్య

మైన శరీరం. పొడుగాటి అతనిగడ్డంలో యిప్పుడిప్పుడే కొద్దిగా తెల్లని వెంట్రుకలు కనిపిస్తున్నాయి.

ఎలీషాకూడ వయోవృద్ధుడే. అతడంత స్థితిమంతుడూ కాడు: నిరుపేదాకాదు. వెనుకటిరోజుల్లో యితడు వడ్రంగిమేస్త్రీగా పనిచేసే వాడు; ముసలితనంవల్ల ఆపని మానేసి, యింటివద్దనేవుంటూ, యేవో కొద్దిగా తేనెటీగలను పెంచుతూన్నాడు ఇతనికి యిద్దరే కుమారులు; ఒకడు దూరదేశానికి పనికిపోయేడు; రెండోవాడు యింట్లోనేవుండి వ్యవసాయం చూసుకుంటున్నాడు. ఎలీషా చాలమెత్తని మనస్సుగలవాడు; హుషారుగానూ, సరదాగాను వుంటాడు. కులాసా పుట్టినపుడు కాస్త సారాయం పుచ్చుకోడంకద్దు; మరి ముక్కుపొడుం లేకపోతే అతనికి మతేపోతుంది. కీర్తనలూ, పాటలూ చక్కగా పాడగలడు. ఒకరిజోలికీ శొంఠికీపోడు అందరితోనూ కలిసికట్టుగా వుంటాడు. కుటుంబీకులతో గాని, యిరుగుపొరుగుతోగాని యెప్పుడూ పొల్లుమాట ఆడికూడ యెరుగడు. విగ్రహం పొట్టిది; జుట్టు నలుపు; ఉంగరాలుచుట్టుకున్న గడ్డం; అతని యిష్టఋషి 'ఎలీషా'కి వలెనే అతనిదీ పూర్తిగా బట్టతల:

ఈ మిత్రులిద్దరూ యెన్నోరోజులుగా తీర్థయాత్రలు సేవించివద్దామని సంకల్పించుకున్నా, యింతవరకూ యేవోకారణాంతరాలు రాడం, ప్రయాణం వాయిదాపడుతూండడం జరుగుతూంది. యెరూషలేమ్ వెళ్ళి, ఆ క్రీస్తుప్రభుని అర్చనచేసి రావాలనే వాళ్ళసంకల్పం యెన్నోసార్లు వికల్పం అవుతూవచ్చింది. యెఫిమ్‌కి యేదోపని యెప్పుడూ పీకలమీదికి వస్తూనేవుండేది. ఒకపని తలపెట్టి పూర్తికాగానే మరోపని అర్జంటుగా చేయాల్సింది ముంచుకుంటూ రానేవచ్చేది. ఓ యేడాది మనుమనివివాహం చేయాల్సివచ్చింది; మరుసటియేడు కొడుకు సైన్యంలోంచి యింటికి వచ్చేడు; ఆతర్వాతి సంవత్సరం కొత్తయిల్లు కట్టడం, గృహప్రవేశం వగైరా.

అదొక పండుగరోజు. వృద్ధమిత్రులిద్దరూ కలుసుకుని, వీధిలోనే పెద్ద దూలంమీద కూర్చుని ఆషామాషీ కబుర్లు చెప్పుకుంటున్నారు. ప్రయాణంసంగతి ఎలీషాయే కదిపేడు, ముందుగా.

"ఏమిటోయ్, కబుర్లు? మనయాత్ర పూర్తిచేయడాని కెప్పుడు బైలుదేరుదామో, చెప్పు?"

యెఫిమ్ ముఖం చిట్లించేడు. "మిత్రమా! నాకింకాతీరదోయ్. ఈయేడునాకు మహగడ్డుది! మొదట్లో యిల్లు కడదామని అంచనావేసి నప్పుడు యేదో అన్నీ దగ్గరేవున్నాయిగదా ఒక వందతో సరిపెట్టవచ్చు ననుకుంటే యిప్పటికే మూడువందలైంది. పనియింకా పూర్తికానేలేదు. మళ్లీ గ్రీష్మంవరకూ వుండాలి. ఈశ్వరాజ్ఞవుంటే అప్పుడింక తప్పకుండా వెడదం."

"ఇంక వాయిదావేస్తూండడం మంచిదికాదు. నాఉద్దేశ్యంయిదే యాత్రకి వీలైనకాలమని. వసంతఋతువైతే యేమీయిబ్బంది వుండదని." అన్నాడు ఎలీషా.

"వీలు? వీలుకేమి? వసంతంలో ఐతేమంచిదే. కాని మొదలెట్టే నాయె యిల్లు. సగంపైగాపని అయింది. ఇప్పుడు దాన్నివదిలి యెట్లా రానోచెప్పు?"

"ఇంటిదగ్గరెవరూలేనట్లు చెపుతావేమిటోయ్! నీకొడుకుని చూసు కోమంటే, చూసుకోడూ?"

"మంచివాణ్ణేచెప్పేవు. వాడిసంగతెరగవుటోయ్. వాడిమీద ఆధార పడివుంటే అయిందన్నమాటే. వాడు శుద్ధ త్రాగుబోతని తెలియదూ?"

"బాగానేవుంది. ఉంతా మనతోనే వుందంటావయితే. మన తనువులు శాశ్వతంటోయ్. మన ప్రాణంకాస్తా గుటుక్కుమంటే, యిక

ఆతర్వాతవాళ్లు బ్రతకలేరంటావు! నువ్వు బ్రతికివుండగా యిప్పుడే నాలుగుపనులూ నేర్చుకోనియ్యి, కొడుకుని."

"నిజమే! నిజమే! నువ్వనేది యథార్థమే కాని, ఏమిటో ప్రతీదీ నేనే చూసుకుంటూండడం అలవాటైపోయిందయ్యా."

"అన్నీ నువ్వే చూసుకోవాలనుకోడం సరికాదు. అన్నీ మనం చేయనూలేము! మొన్నను మాఆడవాళ్లు యిల్లంతా కడుగుతూ, తోముతూ, తుడుస్తూ, ఉక్కిరిబిక్కిరైపోతున్నారు. ఇదిచెయ్యాలి! అదిచెయ్యాలి! ఇంకా యెన్నోచేయాల్సి వున్నాయి! మాపెద్దకోడలుందే, అదిమాంచి తెలివైనదిలే. అది అంది! ఏమనోతెలుసా! 'పండుగరోజు మనకోసం కనిపెట్టుకొని వుండకండానే వచ్చేస్తుంది. అదీనయమే. లేకపోతే మనం యెన్నిరోజులకీ తెములకనేపోదుము!' అంది. నిజంకాదా?"

యెఫిమ్ ఆలోచనలో పడ్డాడు.

"ఇంటిమీద యిప్పటికే చాల సొమ్ముపెట్టేశాను. చేతులో పైసా లేకుండా బైలుదేరడమెల్లాగోయ్? అందులోనూ యాత్రాయెను! ఓవంద యినా దగ్గరుండాలా! అంత మొత్తం ఒక్కసారెట్లావస్తుంది?"

ఎలీషా నవ్వేడు.

"అన్నా! నీఆలోచన పాపమార్గానికీడుస్తుందని హెచ్చరిస్తున్నా. నాకున్నదానికి పదిరెట్లైనావుంది, నీకు. పైగా డబ్బువిషయమే ఆలోచిస్తు న్నానంటావు? చెప్పు, ఎప్పుడు బైలుదేరుతావో? ఇహ అడ్డేమీచెప్పకు. నువ్వు 'ఊఁ!' అన్నావంటే నాదగ్గర యేమీలేకపోయినాసరే, ఆక్షణం లోనే బైలుదేరి రాడానికి సిద్ధం."

ఎఫిమ్ నవ్వి, అన్నాడు.

"నువ్వంత ధనకుడవని అనుకోలేదునేను. ఎల్లావస్తుందో చెబుదూ, నీకంతడబ్బు. హఠాత్తుగా?"

"అఁ! ఏదో యింట్లోవాళ్ళదగ్గిర వున్నది కాస్త కాస్త ఊఁచ్చేస్తాను. నాతేనెటీగల పెట్టెలు పది, మాయింటిప్రక్కవాదే కావాలంటున్నాడు. యిచ్చేసి, డబ్బుతీసుకుంటా. వాడప్పుడే చాల రోజులనుంచీ యిమ్మని వేపేస్తున్నాడు."

"వచ్చేఋతువులో ఈఁగలుబాగా తేనెపెట్టేటట్లయితే, యిచ్చేసేనని తర్వాత విచారిస్తావు."

"విచారిస్తానూ! అన్నా! నేనెప్పుడూ విచారించను. ఇంతవరకూ నాజీవితంలో దేన్నిగురించీ పశ్చాత్తాపపడిందిలేదు. నాపాపాన్ని గూర్చి తప్ప. ఎవరికైనా ఆత్మశాంతే కాదుటోయ్ ముఖ్యం?"

"నిజమేఅనుకో. ఆత్మోద్ధరణమే అవశ్యకర్తవ్యమని అంగీకరిస్తా. కాని, యింటిదగ్గర పరిస్థితులు యిరుకులోపడితే ఎంతబాధపడాలో ఆలోచించద్దూ?"

"ఆత్మ యిరుకులో పడిపోతే? అంతకంటె విచారకరం కాదూ? మనమేమో ఈఁశ్వరదర్శనం చేసివస్తామని మ్రొక్కుకున్నాం; వెళ్ళేతీరాలి. ఇంక ఆలస్యం చేయద్దు. విధిగా బయలుదేరి తీరాలిసుమా!"

## 2

ఎలీషా స్నేహితుణ్ణి మెల్లాగైతేనేం చిట్టచివరకి ఒప్పించేడు. ఆరాత్రంతా ఆలోచిస్తూనే వున్నాడు ఎఫిమ్. మరుసటినాడుదయమేవచ్చి ఎలీషాను కలుసుకున్నాడు.

"అన్నా నువ్వుచెప్పిందే బాగుందోయ్. ఇక వెడదాం. ప్రయాణం కట్టు. సృష్టిస్థితిలయాలకి ఆఈఁశ్వరుడే కర్త; సర్వాధికారీను! దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలన్నట్లు. దేవుడిచ్చిన యీకాలు,

రన్నూ సరిగా వుండి, దార్ఢ్యం వున్నప్పుడే యీయాత్ర పూర్తి చేసు కుందాం."

అనుకున్న వారంనాటికి యిద్దరూ సన్నాహాలు పూర్తిచేసేరు.

ఎఫిమ్‌కి యింట్లో డబ్బుకి కొదువలేదు. చేతులో ఓవంద పట్టు కున్నాడు. రెండువందలు పెట్లోపెట్టి, భార్యకి సందుగుపెట్టితాళం వప్ప జెప్పేడు.

ఎలీషాకూడా తయారయేడు. ప్రక్కింటివాడికి పదితేనెపెట్టెలూ, ఈగలతోసహా అమ్మేశాడు. ఈరకంగా డెబ్భై రూబుల్సు చేతికొచ్చింది, మిగతా ముప్ఫై, యింట్లో వాళ్ళదగ్గిర్నుంచి పుచ్చుకున్నాడు. ముసలమ్మ తన ఉత్తరక్రియలకోసం వుంచుకున్న డబ్బంతా యిచ్చేసింది; కోడలు కూడా తాను అప్పుడూ అప్పుడూ దాచుకున్నది కాస్తా ఊడ్చిపెట్టి, యిచ్చేసింది!

ఎఫిమ్ యింటి వ్యవహారాలన్నిటినీ గూర్చి కొడుకుతో మళ్ళీమళ్ళీ చెప్పి, బందోబస్తు చేసేడు. ఏపొలం కవులు కియ్యాలో, ఏపొలంలో యే యెరువెయ్యాలో, దేంట్లో గోధుమలు పైరుచెయ్యాలో, క్రొత్తయిల్లు యెల్లా పూర్తిచెయ్యాలో,—అన్నీ సవివరంగా ఆలోచించి, కొడుకుతో బందోబస్తుగా చెప్పేడు.

ఎలీషా తన భార్యతో తేనెపట్టుల్నిగూర్చి మాత్రం మాట్లాడేడు. క్రొత్తపట్లు పట్టంగానే చెరిసగం తీసేసి, న్యాయంగా పొరుగువానికి యివ్వాలిసుమీ అని చెప్పేడంతే. ఇంటి వ్యవహారాల్నిగూర్చి యేమీ పట్టించుకోనేలేదు. నాయనా! ఏంచెయ్యాలో నీకు తెలియదా యేమిట్రా? మీరే యజమానులైరి. ఏదెప్పుడు యెట్లా చేస్తే మంచిదని తోస్తుందో అట్లాగే చేయండిరా!" అని మాత్రం అన్నాడు.

అంతా సిద్ధమైంది. ప్రయాణపురోజు వచ్చింది. రొట్టెలు, యితర తినుబండారాలూ తయారుచేసి, చిన్నసంచులు కుట్టి, వాటిల్లో భద్రంగా పదిలపరచేరు. కొత్తబూట్లు కుట్టించేరు. రెండోజత మెత్తని బెరడు జోడుకూడ కుట్టి, జాగ్రత పెట్టుకున్నారు. ఉన్ని కాలిపట్టీలు అదనంగా మరోజత మూటలో కట్టడం మరిచిపోలేదు. ఇద్దరి కుటుంబాలూ వాళ్లని ఊరి పొలిమేరదాకా సాగనంపడానికి వచ్చేరు. అక్కడికి వచ్చేక యింక వుండండని వాళ్ళని వెనక్కి పంపి వృద్ధయాత్రీకులు ముందుకు సాగి పోయేరు.

గ్రామాన్ని వదిలిపెట్టిందే తడువుగా 'ఎలీషా' ఆవిచారమే వదిలి పెట్టేడు. అతని మనస్సు ఉల్లాసంగానూ, తేలిగ్గానూ వుంటూంది. తన స్నేహితుణ్ణి యేవిధంగా సంతోషపరచాలీ; ఎవరితోనూ ఒక్క పరుష వాక్యంగాని మాట్లాడకండా యెట్లావుండాలీ; మనోవాక్కాయకర్మల్లో శాంతి, సంతృప్తి, శ్రద్ధ, ప్రేమ, సర్వేజనులపట్లా యెట్లాచూపించాలీ; అనే అలోచిస్తున్నాడు. నడుస్తూన్నప్పుడు కూడా ప్రార్థనలో, మహర్షుల జీవితగాధలో జపించుకుంటూనే వుండేవాడు. మార్గంలోగాని మజిలీచేసిన గ్రామాల్లోగాని అగదగిలిన వాళ్లందరికీ ఒక మంచిమాటో, చేయగల సాయమో చేయడానికే ప్రయత్నించేవాడు. అతని మనస్సు పద్విషయాల తోనూ, ముఖం సంతోషంతోనూ పొంగులువారుతూండేది. ఎంత ప్రయ త్నించినా ఒక్కదాన్నిమాత్రం వదలలేకపోయాడు. మానేద్దామనే నిశ్చ యించుకుని, పొడుంకాయ యింటిదగ్గర ఒదిలి వచ్చేశాడు. కాని, అది మానేస్తే యేదో అంతా బాధగావున్నట్లయింది. దారిలో యెవడో పాం ధుడు కాస్త నశ్యదానం చేసేదాకా అతని మనస్సు పరితపించిపోయింది. అక్కడినించీ దారిలోఆగి అప్పుడప్పుడు ఓపట్టు పీలుస్తూండేవాడు. అదైనా ఎఫిమ్‌కి తెలియనీకుండా. తెలిస్తే అతనూ యీదుర్వ్యసనాని కీడ్వబడతాడని అతని భయం!

ఎఫిమ్ కూడా సుఖంగానే కాలక్షేపం చేస్తున్నాడు. అతడూ మాట్లాడడం తగ్గించేడు; ఎట్టి దుష్కార్యమూ చేయలేదు. కాని, అతని హృదయంలోమాత్రం సంతృప్తిలేదు. ఇంటిదగ్గర ఏమౌతుందో? అనే ఆలోచన మాత్రం అతడు పారద్రోలలేకపోతున్నాడు. ఇంటిపద్ద అదేమవుతూందో? ఇదేమవుతూందో? ఇదిచెప్పడం మరిచేననో. కొడుకు పరాకున అపని చేయడం మానేస్తాడేమోననో, ఇవే అస్తమానూ అతని మనస్సును ఆక్రమించుకుంటూచునేవి. ఎవరైనా రోడ్డుమీద యెరువు తోలుకెడుతూన్నా, పక్కపొలాల్లో బంగాళాదుంపలు నాటుతూన్నా, యేపనిచేస్తున్నా, "నాకొడుకు నేచెప్పినట్లు చేస్తున్నాడో? లేదో?" అనే ఆదుర్దాతో గడిపేవాడు. ఎన్నోసార్లు తిరిగి వెనక్కివెళ్ళిపోయి, ఆపనులు సరిగ్గాచెప్పి చేయించాలనో, లేదా తానే చేయాలనో నిశ్చయానికి కూడా వచ్చేవాడు. అయినా మళ్లీ సంబాళించుకుని బరువైన మనసుతో, ముందుకు సాగేవాడు.

## 3

అయిదువారాలు గడిచినై తొడుక్కొచ్చిన కొత్తచెప్పులు అరిగిపోవడంవల్ల మళ్ళీ చెప్పులు కొనాల్సివచ్చింది. కాని, తెల్లరష్యాలోకి వచ్చినప్పటినుంచీ అన్నీ ఉచితంగానే దొరుకుతున్నాయి. ప్రతీవాళ్లూ మాయింటికి రండంటే మాయింటికిరండని మీదమీదపడి ఆహ్వానించి తీసికొనిపోతున్నారు. బసయిచ్చి, భోజనంపెట్టి, పైగా దారిలో కంటూ రొట్టెలు, చపాతీలుచేసి, సంచినిండా కుక్కి పెట్టేవాళ్లు. ఎంత బతిమలాడినా ఒక్కరు ఒక్కపైసా తీసుకొనేవాళ్లేకాదు. ఈవిధంగా మరో అయిదువందలమైళ్ళు నడిచేరు. ఇంత దూరమూ ప్రయాణం చేసినందుకు వాళ్ళకొక్క పైస ఖర్చుకాలేదు. సరిహద్దుదాటి మరో దేశంలోకి యిక్కడే ప్రవేశించారు. ఆప్రాంతం అంతా కరువుగా వుంది. ఇక్కడి

ప్రజలు బసమాత్రం ఉచితంగానే యిచ్చేవాళ్ళు. తిండే దొరికేదిగాదు. కొన్ని గ్రామాల్లో చిన్న రొట్టెముక్కకూడా దొరికేదిగాదు. డబ్బిచ్చినా దుర్లభమైపోయింది. పాపం గత సంవత్సరం పంటలు శుభ్రంగా పాడై పోయేయిట. రైతులు నాశనమైపోయేరు ; వాళ్లకున్నదంతా అమ్ముకుని బికారీలైపోయేరు. ఇదివరలో యేదో అటూయిటూగా వుండేవాళ్ళు యిప్పుడు తినీతినకా బహుదురవస్థల్లోవున్నారు. బీదవాళ్ళు పూరాగా మచ్చుమాసిపోయేరు ; లేదా బిచ్చగాళ్లయి అడుక్కుంటున్నారు ; వీళ్ళలో యేకొద్దిమందో మాత్రం మిగిలేరు. వాళ్ళు చెట్లుబెరడు, ఆకులు, వగైరాలు తింటూ కాలంబుచ్చుతున్నారు.

ఒకనాడుదయమే లేచి మనయాత్రీకులిద్దరూ అంగడికిబోయి చాల వ్యయప్రయాసలమీద ఓ పదిహేసుపౌన్ల రొట్టెను కొనగలిగేరు. ఆక్రితం రాత్రి ఆగ్రామంలో విశ్రమించినపుడే విషయాలన్నీ సంగ్రహించి, సూర్యోదయాత్పూర్వమే మూటాముల్లే కట్టుకుని బైలుదేరేరు. పొద్దెక్కి ఎండ తీవ్రమయేవేళకి చాలదూరం పోవచ్చునని వాళ్ళఅంచనా. అట్లా నడిచి ఏడుమైళ్లుసుమారు వెళ్ళి ఆగి, లోటాలతో మంచినీళ్ళు తీసికొని, చేతులు శుభ్రంగా కడుక్కున్నారు. మూటవిప్పి, రొట్టెతీసి, నీళ్ళలో నాన బెట్టేరు, తినడానికి వీలుగావుంటుందని. భోజనంఅయేక కొంచెంసేపు విశ్రాంతితీసికొని, కాళ్ళపట్టీవిప్పి మార్చుకున్నారు. ఏలీషా, పొడుంకాయ తీసి, టొకాయించి, ఓ పట్టు తీయబోతూంటే, యెఫిమ్ అతనివైపు తల పంకిస్తూ : "మిత్రమా ! ఆ దురలవాటు ఎందుకు ఒదలవూ ?"

"వదల్లేకుండా వున్నానోయ్,వెధవది." నిరాశాసూచకంగా చేతు లాడిస్తూ అన్నాడు, ఎలీషా. "ఈపాపం నన్ను చుట్టుముట్టి పూర్తిగా లోబరచుకుందోయ్." అంటూ పట్టుపీల్చి, చేతులు దులుపుకున్నాడు. మాట్లాడుకుంటూ, మళ్లీ బైలుదేరేరు. మరో యేడెనిమిది మైళ్ళు నడిచి బాగా యెండ ముదిరేవేళకి ఓపెద్దగ్రామంచేరి, వీధమ్మటబడి పోతున్నారు.

అప్పటికి ఎలీషా అలిసిపోయాడు. ఇంక విశ్రాంతితీసికొని, కొంచెం దాహంపుచ్చుకుంటే బాగుండుననుకొని యెఫిమ్‌తో అన్నాడు. యెఫిమ్ మాంచిపోషక్కమీద వున్నాడేమో, ఎలీషాకంటె దార్ఢ్యంగా వున్నాడు. యెఫిమ్ మాంచి నడకగాడుకూడా. అతనితో నడవడమే కష్టంగావుంది ఎలీషాకి.

"దాహం వేస్తూంది. కాస్సేపు ఆగుదామా ?"

"నాకు దాహంవేయడంలేదు. నువ్వెళ్లి త్వరగా తాగిరా." ఎలీషా ఆగేడు.

"నాకోసం ఆగవద్దు ఒక్క క్షణంలోవచ్చి నిన్ను కలుసుకుంటా. ఇదిగో, యీయింటికెళ్లి, కొంచెం మంచితీర్థం పుచ్చుకుని వస్తున్నా, నడుస్తూండు."

"అల్లాగేలే." అంటూ యెఫిమ్ మెల్లిగా నడకసాగించేడు. ఎలీషా ఆదగ్గరనేవున్న యింటివైపు వెళ్లేడు.

అదొక చిన్న పూరిల్లు. గోడలు మట్టివి. క్రింది భాగంలో నల్లటి రంగూ, పైన సున్నంకొట్టిన గోడలు చాలచోట్ల బెల్లులూడిపోతున్నాయి. ఇంటికప్పు ఓవైపు లోపలికి పడిపోతూంది. చాలరోజులనుంచీ యిల్లు బేమరామతులో పడిపోయినట్లు చూడగానే తెలుస్తుంది. ఇంటి చుట్టూ ప్రహారీ, ముందు వాకిలీ వుంది. ముందరవాకిట్లోకి ఎలీషా ప్రవేశించి చూచేడు. ఒక బెంచీప్రక్కనే నేలమీద ఓశుష్కకాయుడైన వృద్ధుడు పడివున్నాడు. అతనికి గడ్డంలేదు. తెల్లరష్యన్‌ల పద్ధతిలో చొక్కాను పంట్లాం లోపలికి పెట్టి కట్టుకుని వున్నాడు. (రష్యన్‌లు పంట్లాంపైనే చొక్కా తొడుక్కుంటారు.) ఆతడు బహుశా నీడగా వుందని అక్కడ పండుకుని వుండివుంటాడు. ప్రొద్దెక్కినకొద్దీ అక్కడికే యెండవచ్చి వుంటుంది. యిప్పుడాతడు మండుటెండలోనే పడి వున్నాడు. మేలుకొనేవున్నా అతనిలో చలనమన్న మాటేలేదు. ఎలీషా

ఆతణ్ణి కేకవేసి, కొంచెం దాహమిప్పించమని అడిగేడు. సమాధానం రాలేదు.

"బహుశా జబ్బుగా వుండివుంటాడు. లేకపోతే చిరాకుమనిషా?" అని సందేహిస్తూ, ద్వారం సమీపించేడు, ఎలీషా. లోపలనుంచి శిశు రోదనం వినిపిస్తూంది. తలుపు గొళ్లెంతో కొట్టి చప్పుడుచేస్తూ, "అయ్యా! ఏమండీ!" అని పిలిచేడు. జవాబులేదు. తలుపులు చేతికర్రతో తట్టుతూ "క్రైస్తవులారా!" అన్నాడు. చడీచప్పుడూలేదు. "ఈశ్వరసేవకులారా," కాని, జవాబేలేదు. ఎలీషా వెనుదిరిగి పోదామనుకుంటూంటే లోపలనుంచి యెవరిదో మూలుగు నీరసంగా వినిపించిది. ఆలోచనలో పడ్డాడు.

"ఏదో జరిగి వుంటుంది. చూస్తే మంచిది." అనుకుంటూ, తలుపు త్రోసేడు.

## 4

తలుపు గడియవేసిలేదు. తోసుకుని లోపలికి అడుగు పెట్టేడు. గది తలుపులూ తెరిచే వున్నాయి. సావట్లో ఎడమప్రక్క నెగడి; ఓమూల దేవుడిగూట్లో విగ్రహాలు; ఆదగ్గరలోనే టేబిల్, బెంచీ— ఓవృద్ధురాలు బెంచిమీద కూర్చుని, టేబిల్‌మీద తలవాల్చుకుని, కదలకుండావుంది. ఆమె శరీరంమీద ఒక చొక్కా తప్ప మరేమీలేదు. ఆమె చొక్కా పట్టుకు లాగుతూ వెక్కివెక్కి ఏడుస్తూ, తినడాని కేదేనా పెట్టమని అడుగుతూన్నాడొక పిల్లవాడు. వాడి పొట్ట బానలా ఉబ్బిపోయి వుంది. చేతులూ కాళ్లూ సన్నగా ఊచల్లా వున్నాయి. ఒంట్లో రక్తమేలేదు. తెల్లగా కాగితంలావుంది, ముఖం. గదంతా దుర్వాసనగా వుంది. నెగడి దగ్గరే మంచంమీద యింకో స్త్రీ పడుకుని వుంది. ఆమె కాళ్ళు మెలికలు తిరుగుతూన్నాయి. వెల్లకిలా పడుకుని ఊరిఖే అటూయిటూ

కొట్టుకుంటూంది, ఆమె. చాల జబ్బుస్థితిలో వుందనీ, ఎవరూ ఆమెకు సహాయం చేసే స్థితిలో లేరనీ గ్రహించేడు, ఎలీషా. అలికిడికి తల యెత్తి చూసి, వృద్ధ స్త్రీ క్షీణస్వరంతో అంది ;

"ఏం కావాలి ? నీకిచ్చేందుకు మాయింట్లో యేమీలేదు."

ఆమె బైలో రష్యన్ భాషలో మాట్లాడింది. ఎలీషా గ్రహించి, ఆమెను సమీపించి, "కొద్దిగా మంచినీళ్లు కావాలి, అంతేనమ్మా !" అన్నాడు.

"ఇంట్లో ఒక్క చుక్కకూడా లేదు. తేడానికీ యెవరూలేరు. నీదారిని నువుపో, నాయనా !" అంది, వృద్ధురాలు నీరసంగానే.

"ఆమె చాల బాధపడుతూంది. చూసేవాళ్లెవరూలేరా ?" అన్నాడు, ఎలీషా ఆరెండో స్త్రీని చూపుతూ.

"ఎవరూలేరు. మగాడు చావుకు సిద్ధంగా వాకిట్లో పడున్నాడు. మృత్యుదేవతకి యెప్పుడు దయవస్తుందా అని మేము యిక్కడ కాచుకుని వున్నాము, నాయనా !"

కొత్తమనిషిని చూసి, పిల్లవాడు యేడుపుమాని, వృద్ధురాలి కొంగు పట్టుకొని లాగుతూ "అవ్వా ! రొట్టిముక్క ! కొంచెం పెట్టవే !" అని మారాంచేస్తూ, ఆమె తనమాట వినిపించుకోకండా మాట్లాడ్డంచూసి, మళ్లీ యేడుపు అందుకున్నాడు.

ఆమెను ఏదో అడుగుదామనుకుంటూండగానే, బైట వాకిట్లో పడివున్న మగాడు తూలుతూ గుమ్మం పట్టుకుని లోపలికి వచ్చేడు. గోడ పట్టుకుని బెంచీదగ్గరికి వెళ్లబోయి, తూలి క్రింద పడిపోయేడు, తలుపు మూల్లోనే. లేద్దామని ప్రయత్నించి కూడా లేవలేక ఆయాసపడుతూ, క్షీణ స్వరంతో ఆగి ఆగి ఏవో గొణగనారంభించేడు.

"అందరం జబ్బుగానే....తిండిలేక మాడుతూన్నాం....చూడండి ....పిల్లవాడు....ఆకలి....చచ్చిపోకండా—కాపాడు, నాయనా!" అంటూ పిల్లవానివైపు చూపి, కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

వీపుమీద మూట బెంచీమీదికిదించి, త్వరత్వరగా విప్పేడు. అందులోంచి ఓపెద్ద రొట్టితీసి, చాకుతోకోసి అతనికిచ్చేడు. రైతు తీసుకోలేదు. "వాళ్లకియివ్వండి" అంటూ పిల్లవానివైపుచూసేడు. ఎలీషా గ్రహించేడు. పిల్లవానికి రొట్టిముక్క అందించేడు. వాడు రెండు చేతుల్తోటీ రొట్టిని పట్టుకుని గబగబా నోట్లో కుక్కుకుని, బాబాకరంగా మింగేస్తున్నాడు. నెగడి వెనకనుంచి మరో చిన్నపిల్ల మెల్లిగా యీవలికివచ్చి, కళ్లు పెద్దవి చేసి ఆశగా రొట్టెవైపు చూడనారంభించింది. ఆమెకి ఓముక్క, వృద్ధురాలికి మరోముక్క యిచ్చేడు, ఎలీషా. వృద్ధురాలు రొట్టి నోట్లో పెట్టుకుంది. కాని నమలలేకపోయింది. నోటతడి ఆరిపోయింది, పాపం.

"కొంచెం నీళ్లు తెస్తారా? కంఠాలు యెండిపోయి వున్నాయి. మంచినీళ్ళు తేడానికి ప్రయత్నించేను—యెప్పుడో గుర్తులేదు,—నిన్ననో, యీవేళో మరి....కాని దారిలో పడిపోయేను—అక్కడికి వెళ్ళనేలేకపోయేను—బాల్చీ వాకిట్లోవుండాలి—ఎవరూ యెత్తుకెళ్ళకపోతే-" అని అతికష్టంమీద అన గలిగింది.

నుయ్యి యెక్కడుందో అడిగి తెలుసుకుని, బాల్చీ వెతికి తీసుకుని, ఎలీషా మంచినీళ్లు తెచ్చియిచ్చేడు, వాళ్ళందరికీ. ముసలిది, పిల్లలూ కొంచెం రొట్టితిని, మంచినీళ్లు త్రాగేరు. రైతు మాత్రం "నేను తినలేను" అని, ఎంతచెప్పినా తిననేలేదు.

మంచంమీది స్త్రీ యింకా అల్లాగే యిటుఅటు కొట్టుకుంటూంది. ఆమెకి స్మారకం రానేలేదు.

ఎలీషా ఊళ్లోకివెళ్లి పిండి, వెన్న, ఉప్పు, పప్పు తెచ్చి, పొయ్యి వెలిగించేడు. ఇంట్లో వెతికి చేగొడ్డలి సంపాదించి, ఓ దుంగ నరికి,

పేళ్లుకొట్టేడు. చిన్నపిల్ల కూడా ఎలీషాకి సాయంచేసింది. కొంచెంసేపట్లో గంజీ, పులుసూ కాచి, వాళ్ళందరికీ పెట్టేడు.

## 5

ముసలమ్మ తింది. పిల్లలు కంచాలు నాకేవరుకూ వదల్లేదు. రైతు కాస్త గంజిమాత్రం తాగేడు. తినడంతోనే పిల్లలిద్దరూ పడుకున్నారు. కొంచెంసేపట్లో ఒకరినొకరు పెనవేసుకుని, ఒళ్ళు మరిచి నిద్రపోయేరు. ఎలీషా తాను కాస్తతిని, అన్నీ సవరించి, బెంచీమీదకి వచ్చి కూర్చున్నాడు. ఇదంతా యెట్లాజరిగిందో వాళ్లు చెప్పనారంభించేరు.

"మేం ఎప్పుడూ ధనికులంగాము. నిరుడు పంటలుపోయేయి. ఆకురాలు కాలంలోనే యింట్లో గింజలు నిండుకున్నాయి. అంతా అయిపోయేక యిరుగుపొరుగువాళ్లి సాయం అడిగేము. మొదట్లో కొన్ని రోజులు యిచ్చేరు కాని తర్వాత వాళ్లూ యివ్వడం మానేశారు. ఎంత కాలమని యిస్తారు. వాళ్ళు మాత్రం? వాళ్ళదగ్గిర యెక్కడివి, యిద్దామనుకుంటే మాత్రం? ఊళ్లో అందరికీ బాకీలే. కొందరికి డబ్బు. మరి కొందరికి పిండి, యింకా కొందరికి రొట్టె.— అన్నీ అప్పులే. ఏదేనా పనిచేద్దామన్నా, పనులు యెక్కడివి? ఈకరువు రోజుల్లో యెందరో పనులుకోసం వెతుక్కుంటున్నారాయెను. తిండికి కూడా కరువైపోయింది. ఎప్పుడేనా పని దొరికినా చేయలేనిస్థితికి వచ్చేసేను. ఏదైనా తిండి దొరుకుతుందా? అని నీరసంగాకాళ్లీడ్చుకుంటూ, తిరిగేవాణ్ణి. ముసిలిదీ, పిల్లలూ బిచ్చం అడుక్కుంటూ యెంతో దూరం తిరిగేరు. పిడికెడు బిచ్చంకూడా దొరకని రోజులు వచ్చేయి. పెట్టడానికి యెవరిదగ్గిర మాత్రం ఏముంది? అల్లాగే రోజులు భారంగా నెట్టుకొస్తూన్నాము. కొత్తపంటలు వచ్చేదాకా యెట్లాగైనా ప్రాణాలునిలబెట్టుకోవాలని,మాప్రయత్నం. వసంతంవచ్చింది.

బతుకు దుర్భరం అయిపోయింది. గంజినీళ్లుకూడా లేకుండా రోజులు గడుపుతూన్నాం. పాడుజబ్బు వచ్చిపడింది. పులిమీదిపుట్రలా. చాలా దుస్థితికి వచ్చేం. ఓరోజు గంజి దొరికింది. మళ్లీ పస్తు. రెండోరోజున ఆగలేక ఏదో రొట్టా, గడ్డీతెచ్చి, ఉడికించి తిన్నాం. నాభార్యకి చాల జబ్బుచేసింది. ఆకులు తినడంవల్లనో, మరెందువల్లనో చెప్పలేను. ఆమె కదలలేక మంచం పట్టింది. నేనూ అదేస్థితిలోకి వచ్చేను. మళ్లీ యీజబ్బులు యెట్లా నయమవుతాయో తెలియదు."

రైతు యింకేమీ మాట్లాడే స్థితిలోలేడు. ఊరుకున్నాడు. ముసలమ్మ అందుకుంది. "అందరిలోకీ నేనే చివరదాకా నిలదొక్కుకో గలిగింది. కాని, తిండిలేక చివరకి నేనూ అశక్తురాలనయేను. చిన్నపిల్ల చాల చిక్కిపోయింది. భయపడిపోయి, నెగడిమూల్లో దూరింది. అక్కడి నుంచి దాన్ని యీవలికి రప్పించలేకపోయేను. ఎవరింటికేనా పంపుదామన్నా అది వెడితేనా? ఓరోజున పొరుగావిడ యింట్లోకి తొంగిచూసింది. మేమందరం జబ్బుగావుండడం చూసి, మాట్లాడకుండా గిరుక్కున తిరిగిపోయింది. ఆమె మొగుడూ వాళ్ళని పోషించలేక యిల్లు విడిచి పారిపోయేడు. ఆమె దగ్గరా యేమీలేదు. మరి........చావుకోసం యెదురు చూస్తూ అల్లాగే పడివున్నాం, బాబూ! అంతట్లోకి దేవుడిలావచ్చేవు, నువ్వు!"

మాట్లాడకుండా వాళ్ళుచెప్పినదంతా విన్నాడు, ఎలీషా. వెంటనే జైలుదేరి ఎఫిమును దారిలో కలుసుకోవాలనే నిశ్చయాన్ని మార్చుకుని ఆ రాత్రికి అక్కడే వుండిపోయేడు. ఉదయాన్నేలేచి, తానే ఆయింటికి యజమాని అయినట్లు బాధ్యత మీదేసుకుని పరిస్థితులు చక్కచేయ నారంభించేడు. నెగడి వెలిగించేడు. రొట్టెలపిండి కలపడంలో అవ్వకి సాయం చేసేడు. చిన్నపిల్లనితీసుకొని, ఊళ్ళోకివెళ్ళి అత్యవసరమైనవన్నీ తెచ్చేడు. అయ్యవార్లంగారి నట్టిల్లులావుంది, యిల్లు. గుడ్డలుదగ్గిర్నుంచి

అమ్మేసి, తినేశారు. దొరికినవి కొన్నాడు; తానే చేయగలిగినవి చేసేడు. మొత్తంమీద యిల్లు మళ్ళీ దారిలోపడింది.

మూడురోజులు గడిచింది. పిల్లవాడు అన్నరసం వంటబట్టి లేచి గంతులేస్తున్నాడు. ఎలీషాతో స్నేహం కలిపేశాడప్పుడే. చిన్నపిల్ల మళ్ళీ మామూలుగాఅయి, ఆపనీయీపనీచేస్తూ, తాతా ! తాతా : అంటూ అతన్ని వదలిపెట్టడమేలేదు. రైతు గోడలుపట్టుకుని విద్దేలుచేస్తూ, మెల్లిగా నడవగలుగుతున్నాడు. ముసలమ్మలేచి, యిరుగింటికీ పొరుగింటికీ వెళ్ళివస్తూంది. రైతుభార్యమాత్రం ఆ మూడురోజులూ అల్లాగే పడుంది. నాలుగోరోజు ఆమెకి కొంచెం నయంఅయింది. కళ్ళుతెరిచి, నీరసంగా, అన్నంపెట్టమని అడిగింది.

"సరే, యీ ఘడియకి అంతా క్షేమంగావున్నారు. అంతే కావలసింది. నేనింక వెడతా. ఇప్పటికే చాలాఆలస్యంచేసేను." అనుకున్నాడు, ఆరోజున ఎలీషా.

## 6

సనాతనక్రైస్తవులు వేసవిలో మాంసాహారాన్ని వర్జిస్తారు, కొన్ని రోజులవరకూ. ఆ నాలుగోరోజున పారాయణచేసేరోజు అయింది. ఎలీషా అనుకొన్నాడు. "నేను ఈరోజుకాగి, వాళ్లతోపాటు పారాయణ చేస్తా. రాబోయీ ఋషిజయంతికి కావాల్సిన సరుకులు కొన్ని బజారునుంచి తెచ్చి యిచ్చి, సాయంత్రానికే విధిగా బైలుదేరుతా."

ఎలీషా ఊళ్లో అంగడికివెళ్లి పాలు, పిండి, మాంసం కొని తెచ్చేడు. సాయంత్రం వంటలో ముసలమ్మకి సాయంచేసేడు. మర్నాడు పారాయణ చేసేరోజు. ఉదయమే చెర్చికివెళ్ళి, ప్రార్థనచేసికొని వచ్చేడు. పండుగ భోజనం అందరితోబాటు తృప్తిగాచేసి, కూర్చున్నాడు. రైతు భార్య

ఆరోజు భోజనంచేసి. బలహీనంగానే కాస్తలేచి తిరుగుతూంది. రైతు క్షవరం చేయించుకుని, ఉతికి ఆరేసిన చొక్కా తొడుక్కుని, ఊళ్లోకి పనిమీదవెళ్లేడు. గ్రామంలోని మోతుబరురైతుకి తన భూములు కుదువ పెట్టేడు. అవసరంకొద్దీ. ఈపంటకి ఎల్లాగైనా ఆభూమి సాగుచేసుకోనిస్తే, పంటరాగానే బాకీ తీరుస్తానన్నాడు. కాని, మోతుబరురైతు భూమి యివ్వడానికి అంగీకరించలేదు. "బాకీ డబ్బు తే, నీపొలం దున్నుకుందువుగాని." అన్నాడు, అతడు. నిరాశతో, ఏడుస్తూ యింటికి వచ్చేడు రైతు. అంతా విన్నాడు, ఎలీషా.

"పాపం, వీళ్లు యెల్లా జీవించగలరు? అంతా గడ్డికోసి, యెండబెడుతూంటే, పొలం కుదువబెట్టుకున్న యితడు చేతులు నలుపుకుంటూ కూర్చోవాలి. "రై"చేలు యీయేడు చాలా బాగా రాలుతాయి అంతా 'రై' చేలు నూర్చుకుంటూంటే, తన మూడెకరాలూ ఆభూస్వామి చేతుల్లోపెట్టి వీళ్లు కళ్ళప్పగించి చూస్తూ కూర్చోవాలి. నేను వెళ్లేక మళ్లీ యథాప్రకారంగా పస్తుపడి చావాల్సిందే, పాపం!" అనుకున్నాడు.

ఆలోచనలతో ఆరోజు ప్రయాణం మాని, మర్నాటికి వాయిదా వేసేడు. ఆరాత్రి ముంగిట్లో పడుకునేందుకు వెళ్లేడు. ప్రార్థన చేసికొని, పడుకున్నాడేగాని, నిద్రరాలేదు. పరిపరి విధాలుగా ఆలోచనలు పరుగెత్తేయి. అప్పటికి తనువచ్చి చాల రోజులైంది. "పాపం, యీపేద సంసారానికి సాయంచేయాల్సిందే. కాని అందరికీ యెక్కడ సాయం చేయగలం? ఏదో దయకలిగి కాస్త రొట్టిముక్కా, మంచినీళ్లూ యిచ్చి పోదామనుకుంటే,యిల్లా పరిణమించింది! సరే, కానీ. నేవెళ్ళి వాళ్ళ పొలాలు తాకట్టు విడిపించుకుని వస్తా. ఆతర్వాత పిల్లల పాలకి ఆవు ఒకటి కొనాలి. గుర్రం లేకపోతే వ్యవసాయం యెల్లాచేస్తారు? అదీ కొనాల్సిందే. మంచి యిరుకునే పడ్డానురా, దేవుడా! లంగరు ఓమూలు దించే

మంటే యింక ముందుకి సాగడమెట్లాగా అనేది ఆ ఈశ్వరునికే తెలియాలి!"

ఎలీషా లేచి, పక్కమీద కూర్చుని తలగడక్రింది పెద్దకోటు పైకి తీసేడు. కోటుజేబులోని పొడుండబ్బీతీసి, ఒక్కపట్టు పీల్చేడు. ఆఘాటుకి బుర్రలోని యీ ఆలోచనలన్నీ పరిష్కారమై, నిద్రపోవచ్చునని ఆశపడ్డాడు. కాని, నిద్రపట్టనూలేదు, యీ ఆలోచనలు బుర్రలోంచి పోనూలేదు. తాను వెళ్లిపోవాలి, నిజమే. అయితే, పాపం, వీళ్ళగతేమిటి? ఏమీ పాలుపోలేదు. కోటుచుట్టి, తలక్రింద పెట్టుకుని, వాసాలు లెక్కపెడుతూ అట్లాగే పడుకున్నాడు. తెల్లవారగట్ల మాత్రం ఒక్క కునుకు పట్టింది. ఆ కలత నిద్రలోనే కల! వెడదామని అంతాసిద్ధంచేసుకున్నాడు. మూట భుజానవేసుకుని, చేతిలో కర్రపట్టుకుని గుమ్మంలోకి వచ్చేడు. తలుపు ఓరెక్కమాత్రం తెరిచివుందిట. అడ్డంతిరిగి బైటికివెడుతూంటే మూట వెనక్కాల దేనికోతగులుకుంది దాన్ని విడిపించుకుంటూంటే, నడుంకికట్టిన అంగవస్త్రం కొనపట్టుకుని యెవరో క్రిందలాగుతూన్నట్లయింది. అది విడిపించుకుందామని వంగుంటే, చిన్నపిల్లవాడు! కొంగుపట్టుకుని, యేడుస్తూ, "తాతా! చిన్నతాతయ్యా! రొట్టె పెట్టవు?" అంటున్నట్లయింది. మూట పట్టుకున్నది ఏ మేకూకాదు. చిన్నపిల్ల "తాతయ్యా!" అని జాలిగా చూస్తూంది! ముసలిదీ, రైతూ కిటికీలోంచి చూస్తూన్నారుట!

ఎలీషాకి మెలుకువవచ్చింది. కోడి అప్పుడే కూస్తూంది. కళ్ళు నులుముకుంటూ అనుకున్నాడు: "పొద్దున్నేవెళ్ళి పొలం తాకట్టు విడిపించుకొస్తా. ఆవు, గుర్రంకూడా కొనుక్కురావాలి. కొత్తపంట వచ్చేదాకా సరిపడే గోధుమలు కావాలికదా? లేకపోతే సముద్రాలుదాటి క్రీస్తుప్రభువును వెతుకుతూపోతూన్న నేను, నా మనస్సులోంచే ఆ ప్రభువును పోగొట్టుకుంటానేమో! నేను యీ దీనులకి యేమైనాసరే సాయం

చేస్తాను." తెల్లారడానికి యింకొంచెం వ్యవధివుంది. యీ నిశ్చయానికి వచ్చేక ఎలీషాకి గాఢంగా నిద్రపట్టింది.

ఉదయం లేచేసరికి ఆతనిమనస్సు యెంతో తేలికగావుంది. కాల కృత్యాలు తీర్చుకుని ఊళ్ళోకివెళ్ళేడు. పెద్దరైతుతో మాట్లాడి, బాకీ లెక్కచూసి చెల్లించి రశీదుపుచ్చుకున్నాడు. పొలాలు విడుదలయేయి. దారిలో కమ్మరిదగ్గర కొడవలికూడా కొన్నాడు. అదికూడా కరువులో అమ్మేశారు, పాపం! ఇంటికొచ్చి, రైతును గడ్డికోతకి పంపేడు. మళ్ళీ ఊళ్ళోకి బైలుదేరేడు. సత్రం దగ్గిర ఎవరో పదిమంది గుంపుగావుంటే ఏమిటోనని వెళ్ళేడు. అక్కడ ఒక గుర్రం, పాతబండీ అమ్మచూపు తూన్నారెవరో. బేరమాడి ఆరెంటినీ కొన్నాడు. దుకాణంలో ఒకబస్తా పిండికొని, బండిమీదవేసుకుని, మెల్లిగా నడిపించుకుంటూ, "ఆవుకూడా దొరుకుతే బాగుండిపోను," అనుకుంటూ వస్తున్నాడు. దారిలో యెవరో యిద్దరు స్త్రీలు మాట్లాడుకుంటూ పోతూన్నారు. అతనికి ఆభాష బాగా రాకపోయినా, వాళ్ల మాటాదేదాని అర్థంమాత్రం తెలుసుకో గలిగేడు. తననుగురించే వాళ్ళుమాట్లాడుకుంటున్నారని గ్రహించేడు

"మొదట్లో అతదెవరో మామూలు మనిషనుకున్నారుటమ్మా! మంచితీర్థం యిప్పిస్తారా, అమ్మా! అంటూ లోపలికివచ్చేట్ట. అంతే. ఆ రావడం రావడం మళ్లీవెళ్ళందే: వాళ్ళకి ఎంతసాయంచేసేడనుకున్నావు? ఇప్పుడే సత్రందగ్గిర చూసేను. గుర్రాన్నీ, బండినీ కొంటున్నాడు, వాళ్ళ కోసమే. వుంటారమ్మా, మహానుభావులు, నూటికీ కోటికీ. అల్లాంటివాళ్లు లేకపోతే యీభూమి యెప్పుడో బ్రద్దలైపోయేదే!"

ఆ స్త్రీలు తనను పొగడుతూన్నారని తెలునుకోడంతోనే ఎలీషాకి సిగ్గుతోచింది. అవ్వునుకొనేప్రయత్నంమానుకొని బండితోలుకుని యింటికి వచ్చేసేడు. ఇంటివాళ్లు గుర్రాన్నీ, బండినీచూసి సంగతంతా గ్రహించేరు.

కాని, తమకోసమే పీటనికొన్నాడనేమాట పైకి అనడానికి యెవరూ సాహసించలేకపోయేరు. ఎవరో ఆగంతుకుడు, ఒక అపరిచిత కుటుంబానికి యింత ఉపకారం చేస్తాడనేవిషయం నమ్మతగిందిగా తోచదుగా, ఎవరికీ! రైతు వాకిలిదగ్గిరికివచ్చి, గేటు తెరిచేడు.

"బాబాయ్! గుర్రాన్ని యెక్కడసంపాదించేవు?"

"ఎవరో అమ్మకానికితెచ్చేరు. చవకగావోతూంటే ఎందుకేనా అక్కరికొస్తుందని కొన్నానయ్యా. తీసుకుపోయి పాకలో కట్టేసి రా. ఓ సందెడు గడ్డికోసి గాట్లోవెయ్యి, తింటూంటుంది. సామాను తీసి మిద్దె మీద పెట్టు." అన్నాడు, ఎలీషా.

రైతు గుర్రాన్నివిప్పి, సామాను మిద్దెమీదపెట్టి, గడ్డికి సంచిపట్టుకుని వెళ్ళిపోయేడు. కాస్సేపట్లో సంచినిండా గడ్డి కోసుకునివచ్చి, గుర్రందగ్గర కాస్తవేసి, మిగిలింది పాకలో అటకమీద పడేసేడు. భోజనాలు పెందలకడే పూర్తిచేసి, అందరూ పక్క వేసేరు. ఎలీషా వలాసం, కోటూ తీసుకుని ముందరి అరుగుమీద పడుకున్నాడు. అందరూ నిద్ర పోయేక మెల్లిగాలేచి, కోటుతొడుక్కుని, వలాసం భుజానవేసుకుని గేటుతెరిచి వీధిలోకి వచ్చేడు. అక్కడ కారిజోడుతొడుక్కుని చప్పుడు గాకుండా నడిచి రోడ్డు చేరుకున్నాడు.

## 7

ఎలీషా మూడుమైళ్ళు పోయేసరికి తూర్పు తెల్లవారుతూంది. రోడ్డు ప్రక్కనే ఓచెట్టుక్రింద కూర్చుని, మొలనున్న సంచీ విప్పి, ఎంత డబ్బు మిగిలిందా అని చూసుకున్నాడు. అందులో వున్నదంతా పదిహేడు రూబుళ్లూ, యిరవై కోపెక్కులూను!

"ఈడబ్బుతో సముద్రం దాటలేను. దారిలో యాచనప్రారంభించి, యిదివరకి చేసిన పాపాలకి తోడుగా మరికొన్నికూడా మూట కట్టుకోను. నా నేస్తుడు యీపాటికి ఈశ్వరసన్నిధికి చేరేవుంటాడు. నాపేరుచెప్పికూడా దేవాలయంలో ఓదీపం వెలిగించి పెట్తాడులే. తీర్థయాత్ర చేస్తానన్న మొక్కు చెల్లించుకోలేకపోయేనుగదా అనేది ఒక్కటే మనస్సును పీకుతూంది. ఈప్రభువు నన్ను క్షమించకపోడు. ఆఈశ్వరుడు పరమ దయానిధి. నాయీపాపాన్ని తప్పక క్షమిస్తాడు." అనుకుంటూ లేచి, వలాసం భుజాన వేసుకుని, ఇంటికి పోడానికి వెనకతిరిగేడు.

రోడ్డే పోతేమళ్లీ ఆగ్రామం తగులుతుందని, రోడ్డుదిగి పొలాలమ్మట అడ్డపడి నడుస్తూన్నాడు. కొద్దిరోజుల్లోనే యింటికి చేరుకున్నాడు. వచ్చేటప్పుడు నడక చాలా కష్టమనిపించింది. ఎఫిమ్‌తో సమంగా నడవలేక పోయీవాడు. కాని, తిరిగి యింటికి పోయేటప్పుడు అడుగు వేగంగా సాగింది. తేలిక హృదయంతో యేమీ యిబ్బంది పడకుండానే; చేతికర్ర ఊచుకుంటూ, రోజుకి యాభైమైళ్ళు నడిచి, స్వగ్రామం చేరేడు.

అతడు యింటికి చేరేసరికి అప్పుడే కోతలూ, కొట్టివేతలూ అయిపోయినాయి. ఇంటికైన వృద్ధుడు అంతత్వరగా తిరిగి వచ్చినందుకు అందరూ సంతోషించేరు. ప్రయాణంలో విశేషాలేమిటనీ, స్నేహితుడెట్లా తప్పిపోయేడనీ, యాత్ర పూర్తిచేయకుండా యెందుకు తిరిగి వచ్చేవనీ ఎన్నో ప్రశ్నలడిగేరు. ఎవరెన్ని ప్రశ్నలడిగినా ఎలీషా పూర్తికథంతా చెప్పనేలేదు.

"ఏదో, అంతా ఈశ్వరేచ్ఛ! దారిలో డబ్బు ఖర్చైపోయింది; స్నేహితుడు జట్టువిడిపోయేడు. గత్యంతరంలేక యాత్ర మానుకున్నాను క్రీస్తుప్రభువు నన్ను క్షమించకపోడు. మీరూ క్షమించండి!" అనేవాడంతే.

మిగిలిన కొంచెండబ్బూ భార్యకిచ్చేశాడు. ఇంటిదగ్గర పరిస్థితు లెట్లావున్నాయని అడిగి తెలుసుకున్నాడు. అంతా బాగానే జరుగుతూంది. పనులన్నీ లోటుపాట్లు లేకుండా సజావుగానే అయినాయి. పంట బాగానే వుంది; దూడాదుడికీ, పిల్లామేకా అంతా కులాసాగానే వున్నారు.

ఎలీషా గ్రామంలోకి వచ్చినట్లు ఎఫిమ్ కుటుంబానికి తెలిసింది. వాళ్లొవచ్చి, ఎఫిమ్ సంగతి అడిగేరు.

"అతనికేం, బాగానేవున్నాడు. సెయింట్‌పీటర్ జయంతికి మూడురోజులు ముందుగానే మేము విడిపోయేం. మళ్ళీ వెంటనే దారి లోనే కలుసుకుందామనుకున్నాం. కాని, మన యిష్టమేముంది? నాదగ్గర డబ్బు ఖర్చుఅయిపోయింది. ముందుకి పోడానికి సరిపడదు. అంచేత తిరిగి వెనక్కి వచ్చేశాను." అన్నాడు, ముక్తసరిగా ఎలీషా.

ఇంత అనుభవమున్న ఎలీషా అట్లాంటి తెలివితక్కువపని యెట్లా చేసేడా? అనుకున్నారంతా. తీర్థయాత్రకు బైలుదేరడం, కొసకంటా వెళ్ళకండానే తిరిగిరావడం, మధ్యదారిలో డబ్బంతా ఖర్చుచేసుకురావడం! కొత్తలో కొన్నిరోజులుదాకా గ్రామంలో అంతా యీమాటలే పదేపదే అనుకుని, మరిచిపోయేరు. ఎలీషాకూడ యీసంగతి మరిచి, నిత్య కృత్యాల్లో మునిగిపోయేడు. శీతాకాలానికి కావాల్సిన కట్టెలన్నీ కొట్టి, అటకమీద పెట్టడం; గోధుమలు మిల్లుకి వేయించుకురావడం; యిల్లూ, పశులకొట్టాములూ నేయించడం; తేనెటీగల పెట్టెలు విడదీయడం,— వీటన్నిటిలోనూ సాయంచేస్తూ, యాత్రావిషయాన్నే మరిచేడు.

పది తేనెపట్లు పొరుగువాడికి బేరం యిచ్చేడుగాదూ. కొత్తగా చేరిన యీగల్ని యివ్వకండా వుంచుకొందామని ముసిల్ది ప్రయత్నించింది. ఎలీషాకు యేపట్టులో యెన్నివున్నదీ సొంతంగా తెలుసును. ఆమె ప్రయ

ల్నాలేమీ సాగలేదు. పదిపెట్టెలతో, పదిహేడు తుట్టెల్ని పొరుగువాడికి యిచ్చేశాడు, ఎలీషా. వేసవిపనులన్నీ అయేక కొడుకును బైటిపనికిపంపి తాను వచ్చే శీతకాలానికి కర్రజోళ్లు తయారుచేసుకోడం, తేనెపెట్టెలు చేయడం — వీటిల్లో నిమగ్నమైపోయేడు.

# 8

ఇంక ఆరోజున ఎలీషాను దిగవిడిచి, ఎఫిమ్ కొంచెందూరం ముందుకుపోయికూర్చుని, స్నేహితునికై నిరీక్షిస్తూనేవున్నాడు. కూర్చుని వుండగానే నిద్రవచ్చింది. మెలుకువవచ్చేకకూడా చాలాసేపు వున్నాడు గాని ఎలీషా రానేలేదు. చూసిచూసి విసువుపుట్టింది. పొద్దుచెట్లచాటున వాలింది. కాని, యింకా అతడు రాకపోడంతో ఎఫిమ్‌కి ఆందోళన కలిగింది :

“బహుశా ఎలీషా వెళ్ళిపోయే వుంటాడు. లేకపోతే దారినిపోయే యేబండివాడో యెక్కించుకుని వుంటాడు. నిద్రపోతూన్న నన్ను ఎలీషా చూసివుండడు. అయినా నన్నెల్లా దాటిపోయివుంటాడు చెప్మా? ఈ మైదానాల్లో ఎంతదూరమేనా యిట్టే కనిపిస్తుందే! అతను ముందే వెళ్లివుండి, నేను వెనక యింకా వెతుకుతూకూచుంటే, మేము ఒకరినొకరం మళ్లీ కలుసుకోనేలేము. ముందుకేపోతా. ఈరాత్రికి తప్పకుండా అతన్ని కలుసుకోగలుగుతాను ”

ఎఫిమ్ యిట్లా అనుకుని వెంటనే బైలుదేరి ముందికి నడిచేడు. గ్రామంచేరగానే పెద్ద దగ్గిరికివెళ్ళి అడిగేడు, “పొట్టిగావుండే ఒక వృద్ధ యాత్రీకుడు వచ్చేడా ?” అని. పెద్ద, లేదన్నాడు. వస్తే ఫలానాచోటికి పంపమని ఆతనితోచెప్పి, ఆరాత్రికి ఒక రైతుయింట బసచేసేడు.

ఆరాత్రికూడా ఎలీషా రాలేదు.

ఉదయం మళ్లీ బైలుదేరి ఎఫిమ్ ముందికి సాగేడు. దారిలో కని పించినవాళ్ళందర్నీ యెవరైనా పొట్టిగా, బట్టతలతోవున్న వృద్ధుదు కని పించేడాఅని అడుగుతూనేవున్నాడు. ఎవరూ అట్టివాణ్ణి చూడనేలేదు. ఎఫిమ్‌కి ఆశ్చర్యం కలిగింది, ఎలీషా ఏమైవుంటాడా ? అని.

"ఒడెస్సాలో తప్పకుండా కలుస్తాము. లేకపోతే ఒడమీద తప్పదు." అనుకుని, ఎలీషానుగూర్చి సమాధానపడి, ఒంటరిగానే ముందుకి సాగేడు.

దారిలో యితనికి మరో యాత్రికుడు కలిసేడు. అతడొకసారి ఆస్‌పర్వతానికి పోయివచ్చి, మళ్లీ రెండోసారి యెరూషలేంకు వెడుతూ న్నాడు. పుర్రెటోపీ ధరించి, పొడుగాటి అంగరఖా తొడుక్కొని, పొడుగ్గా గడ్డం పెంచుకుని ఉన్న అతన్ని ఓమజిలీలో కలుసుకుని, అతనితో వెంబడించేడు, ఎఫిమ్.

ఒడెస్సాచేరి, ఓడకోసం మూడురోజులు కనిపెట్టుకుని వుండి పోయేరు. దేశదేశాలనుంచి వచ్చిన యాత్రికులు తండోపతండాలుగా అక్కడ కనిపెట్టుకుని ఉన్నారు. వాళ్లందర్నీ వాకబుచేసేడు, ఎలీషాను గురించి. కాని అందరూ అట్లాటివాణ్ణి చూడలేదని చెప్పేవాళ్లే.

విదేశాలకి వెళ్లడానికి కావల్సిన పాస్‌—పోర్టు సంపాదించేడు, ఎఫిమ్. అయిదు రూబుళ్ళు దానికైంది. ఓడకేవు నలభై రూబుళ్ళు అయింది. వెళ్లి, తిరిగిరావడానికి, దారి బత్తేనికై రొట్టెలూ, ఉప్పుచేపలూ, అవీ కొనుక్కొని మూట కట్టుకుని బైలుదేరేడు.

ఆ రెండోయాత్రికుడు దేశద్రిమ్మరి. టికెట్టు కొనకుండా ఓడమీద యెట్లా ప్రయాణం చేయొచ్చో చాలసేపు ఎఫిమ్‌కి బోధించేడు. కాని, ఎఫిమ్ వినిపించుకోలేదు.

"నేను డబ్బు ఖర్చుచేసి యాత్ర పూర్తిచేసుకోవాలని బైలుదేరేను. ఇల్లాంటి మాయోపాయాలు నేనవలంబించ దలచుకోలేదు." అని ఎఫిమ్ ఖచ్చితంగా చెప్పేశాడు.

ఓడఅంతా పూటు అయింది. యాత్రీకులంతా ఓడ యెక్కేరు. లంగరు యెత్తేరు. ఎఫిమ్, తోడి యాత్రీకుడూకూడా అందరితోబాటు ఓడమీదికెక్కి సురక్షితంగా కూర్చున్నారు. మొదటిరోజు ఏలవాంతరాలూ లేకుండా సజావుగానే నడిచింది. సాయంత్రానికి గాలి లేచింది. కొంచెంసేపట్లో కుంభవృష్టిగా వర్షం ఆరంభమై, ఓడని యెండుటాకులా అటుయిటు ఊపనారంభించింది. తాడిప్రమాణాన్ని కెరటాలు డెక్‌మీది నుంచి పొర్లి పడుతూన్నాయి. అంతా ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని వున్నారు. ఆడవాళ్లు ఏడ్పులూ, పెడబొబ్బలూ సాగించేరు. ధైర్యం లేని మగాళ్లు కొందరు అటూయిటూ సురక్షిత ప్రదేశాలకోసం వెతుకుతూ పరుగెత్తుతూన్నారు.

ఎఫిమ్‌కి లోపలచాలా భీతిగానేవుంది కాని పైకి కనబడనీయడం లేదు. ఓడ యెక్కినప్పుడే ఆతడు, 'తాంబోవ్'నుంచి వచ్చిన యాత్రీకుల తోబాటు ఒకచోట బిచాణాపరుచుకుని కూర్చున్నాడు. అక్కడినుంచి ఆతడు మళ్లీ కదలలేదు. ఏమీ మాటాడకుండా, శిలాప్రతిమలాగ ఆరాత్రీ, మరునాడూకూడా అతడక్కడే కూర్చున్నాడు. ఓడమీది వాళ్ళలో యెవడూ నోరు మెదపడంలేదు. తమతమ బిచాణాసంచులికి కరిచిపట్టుకుని అల్లాగే కూర్చుండిపోయేరు మూడోరోజుని గాలి తగ్గింది. ఐదోరోజున ఓడ 'కాన్‌స్టాంటి నోపిల్' చేరింది.

ప్రయాణీకుల్లో కొందరుదిగి, పట్టణంలోకి సెయింట్ సోఫియా చెర్చి చూసిరాడానికి వెళ్లేరు. ఆచెర్చి అప్పుడు తురుష్కుల చేతుల్లోనే వుంది. ఎఫిమ్ మాత్రం దిగలేదు. కొంచెం తెల్లరొట్టె మాత్రం కొనుక్కుని, జాగ్రత్త చేసుకున్నాడు. ఓడ అక్కడ ఆరోజంతా ఆగి,

మర్నాడు బైలుదేరింది. స్మిర్నా, అలెగ్జాండ్రియాలలో తిరిగి, చివరికి జాఫా చేరింది. యాత్రికులంతా జాఫాలోదిగి, యాభై మైళ్లు కాలినడకనే వెళ్లాలి, యెరూషలేముకి. దిగేటప్పుడు అంతా చాల భయపడిపోయేరు. ఓడ యెంతో యెత్తుగా వుంటుంది. అక్కడినుంచి క్రింది పడవలోకి దూకాలి. పడవ కెరటాలికి ఊరికే దొప్పలా ఊగిపోతూంది. దుమికినప్పుడు పడవలోకంటె, నీళ్ళలో పడిపోడానికే యెక్కువ సావకాశంవుంది. ఇద్దరు నీళ్ళలోపడ్డారు, కాని చివరికి అంతా ఏప్రమాదం లేకుండా, పడవలోపడి, గట్టెక్కగలిగేరు.

అక్కడ్నించి కాలినడకను బైలుదేరి మూడోరోజుని పొద్దు నెత్తి మీది కొచ్చేసరికి యెరూషలేముచేరి, పట్నంపైట, రష్యన్‌లుండే పేటలో ఆగేరు. పాస్-పోర్టులన్నీ తనిఖీ అయేక, భోజనాలు చేసి, పట్నంలోకి ఒక్కొక్క పవిత్రస్థలమే చూచుకుంటూ బైలుదేరేరు. కాని, క్రీస్తుసమాధి చూడ్డానికి అనుమతి దొరకనేలేదు.

అంచేత యాత్రికులంతా సనాతన మఠానికి వెళ్లేరు. అక్కడ స్త్రీలనీ, పురుషులనీ వేరువేరుగా, కాలిజోళ్ళు వగైరాలు విప్పించి, గుండ్రంగా కూర్చోబెట్టేరు. ఒక సన్యాసివచ్చి యాత్రికులందరి కాళ్లూ కడిగి, తుండుగుడ్డతో తుడిచేడు. ఒక్కొక్కరి పాదాలేకడిగి, తుడిచి, ముద్దెట్టుకుంటూవచ్చి, ఎలిషా పాదాలుకూడ ముద్దెట్టుకున్నాడు. తర్వాత యాత్రికులంతా ప్రాతఃసంధ్యా ప్రార్థనలకు చెర్చికివెళ్ళి, ప్రార్థనలు చేసుకుని, దీపారాధనచేసి, బంధువుల తరఫునకూడా ఆరాధనలర్పించేరు. ఇదైన తర్వాత మళ్లీ ప్రసాదం తిని, తమ కొసగబడిన ద్రాక్షాసవాన్ని తాగేరు.

మరునాటి ప్రాతఃకాలాన్నే ఈజిప్టు నుంచి వచ్చి ప్రాయశ్చిత్తం చేసుకుంటూ 'మేరీ' నివసించిన ఆగుహని దర్శించేరు. అక్కడకూడా దీపారాధనచేసి, దక్షిణ లిచ్చేసు, తర్వాత అబ్రహాము మఠానికి వెళ్ళి,

యెహోవా ఉద్యానాన్ని దర్శించేరు. ఇక్కడే అబ్రహామ్ తన కుమారుని దేవునికి బలియివ్వడానికుద్యుక్తుడైనది. 'మరియా మగ్దలీనా'కు క్రీస్తు దర్శనమిచ్చిన స్థలానికి వెళ్ళి చూసేరు. ఆతర్వాత క్రీస్తు సోదరుడైన జేమ్సుయొక్క చెర్చికివెళ్లి ప్రార్థన లర్పించి వచ్చేరు.

ఈపవిత్ర స్థలాలన్నీ ఎఫిమ్ కూడావున్న యాత్రీకుడు విపులంగా వర్ణించి చెప్పేడు. ఒక్కొక్కచోట యెంతెంత దక్షిణ యివ్వాలోకూడా అతడేచెప్పి, యిప్పిస్తూ వచ్చేడు.

ఇవన్నీ అయేసరికి సాయంత్రంఅయింది. మకాంవున్న సత్రానికి బైలుదేరేరు. భోజనాలైనాక పడుకుందామని సర్దుకుంటూంటే ఎఫిమ్ సహయాత్రీకుడు ఏడుపూ, గోలా ప్రారంభించేడు. అందరూ చేరేరు. ఏమిటంటే, ఎవరో తన పర్సు కొట్టేశారన్నాడు. అందులో రెండు పది రూాబుళ్ళనోట్లు, మూడురూబుళ్ళ చిల్లరా వుందంటాడు. ఏడ్చేడు, మొత్తుకున్నాడు. కాని, ఎవరుమాత్రం చేసేదేముంది. ఒక్కొక్కరే పండుకొని, నిద్రపోయేరు.

# 9

ఎఫిమ్ పడుకున్నాడేగాని నిద్రరాలేదు. అతని ఆలోచనలు పరిపరి విధాల పోయినాయి. "వీడిడబ్బు యెవరూ దొంగిలించలేదు. అసలు వీడిదగ్గిర డబ్బుంటేనా దొంగిలించడానికి! వీడో టక్కరి. ఎక్కడా దక్షిణ యివ్వనేలేదు! ప్రతిచోటా నాచేతే యిప్పించేడు. పైగా నన్నడిగి ఓ రూబుల తీసుకున్నాడుకూడాను!" అనుకున్నాడు.

అంతలోనే ఎఫిమ్ యిటువంటి దుశ్చింతల్ని మనసులోకి రానిచ్చినందుకు పశ్చాత్తాపపడ్డాడు, "ఒకరి న్యాయాన్యాయాల్ని నిర్ణయించడానికి నేనెవరిని? నేను పాపంలో పడిపోతున్నాను. ఇట్లాంటివాటినిగూర్చి

మళ్ళీ ఆలోచించను" అనుకున్నాడు. కాని, కొంచెంసేపటిలోనే తన నిశ్చయాన్ని మరిచిపోయి, తన సహయాత్రికు డెంతటి దురాశాపరుడో, డబ్బుపోయిందని ఎంత దొంగనాటకమాడేడో తలుచుకుని అసహ్యించు కున్నాడు. "వాడో టక్కరివెధవ! వాడిదగ్గర దమ్మిడీకూడాలేదు."

ఉదయాన్నే అంతాలేచి క్రీస్తుప్రభువు పునర్జీవాన్నిపొందినచోటి చెర్చిలో ప్రార్థనలో పాల్గోడానికి వెళ్ళేరు. సమాధిదగ్గర జరిగే ఆ ప్రార్థనలో పాల్గొనడానికి అందరికీ ఆతురతే. ఆ యాత్రికుడు ఎఫిమ్‌ను వదల కుండా కూడాతిరుగుతూనేవున్నాడు.

అందరూ ఆ చెర్చిని సమీపించేరు. ఆ సమూహంలో అన్నిజాతుల వాళ్ళూ వున్నారు. రిష్యన్‌లు, గ్రీకులు, ఆర్మీనియన్‌లు, టర్కీలు, సిరియన్‌లు,— అన్నిజాతులవాళ్ళూ ఆ భక్తబృందంలో వున్నారు. అంతా పవిత్రద్వారంవద్ద గుమిగూడేరు. అక్కడ టర్కీ పోలీసులు కాపలా కాస్తున్నారు. చెర్చిలోంచి ఒక సన్యాసివచ్చి వీరిని తోడ్కొనిపోయి, పవిత్రస్థలాలన్నీ చూపేడు. అదే క్రీస్తుదేహాన్ని శిలువమీదినుంచి దింపి, అభిషిక్తునిచేసిన స్థలం! అక్కడ తొమ్మిది పెద్ద పెద్ద కొవ్వొత్తిదీపాలు వెలుగుతూన్నాయి. సన్యాసి అన్నిటినీచూపి, వాటి ప్రాముఖ్యతనువర్ణించి చెప్తూన్నాడు. ఎఫిమ్ అక్కడ తానూ ఒకదీపాన్ని ఉంచేడు.

అక్కడినుంచి సన్యాసులు వారిని కుడిచేతిమీదుగా కొన్ని మెట్లెక్కించి 'గోల్గోథా' మిట్టను చూపేరు. ఇక్కడే క్రీస్తును కొరత వేసిన శిలువవుంది. ఎఫిమ్ అక్కడ ప్రార్థనచేసేడు. ఆ ప్రక్కనే పాతాళానికంటా తెరుచుకున్న బిలాన్నీ, క్రీస్తు కాలుసేతులలో మేకులు కొట్ట బడ్డ స్థలాన్నీ చూపేరు. ఆదామ్ సమాధినీ; ఆదామ్ అస్థికలపై క్రీస్తు రక్తాభిషేకంచేసిన స్థలాన్నీ; తలపై ముండ్లకిరీట ముంచుతూన్నప్పుడు క్రీస్తు కూర్చున్న చత్రాతినీ; సిపాయీలు కొడుతూన్నప్పుడు క్రీస్తుని కట్టి

వేసిన స్థంభాన్నీ: క్రీస్తుపాదాల్ని బిగించిన రెండుసంత్రాలతోఉన్న పెద్ద రాతిబండనీ; అన్నిటినీ యాత్రికులకు సన్యాసులు చూపించేరు.

ఇంకా ఏమేవో చూపిద్దామని వారనుకుంటూనే వున్నారు. కాని యాత్రీకుల కొకకేతొందరాయెను. ప్రభుసమాధికి బోడానికి తోసుకుంటూ అంతాబోతూన్నారు. అప్పటికి వైదేశీయ ప్రార్థన పూర్తై సనాతన గ్రీకు ప్రార్థన ప్రారంభమైంది. ఎఫిమ్ అందరితోనూ గుహలోనికి వెళ్లేడు.

తోడియాత్రీకుని తప్పించుకుందామని యెంతప్రయత్నించినా ఎఫిమ్‌కి సాధ్యంకాలేదు. అతను కనిపించినంతసేపూ, అతనినిగూర్చి చెడ్డభావన లాతని మనసులోకి వస్తూనేవున్నాయి. మరిచిపోదామంటే అతడు నీడలా వదలడు. ప్రార్థనలకువెళ్ళినా, క్రీస్తుసమాధికిబోయినా, వీడు కూడానేపడుతూన్నాడు. గుహాలయంలోకి వెళ్ళేక అందరికంటె ముందుకి బోయి గర్భగుడిదగ్గర నిలబడుదామనుకున్నాడు. గాని అప్పటికే జనంతో క్రిక్కిరిసిపోయి, సూది దూరడానికేనా సందులేకండావుంది, గుహలో. వెనక్కిబోడానికిగాని, ముందుకిపోడానికిగాని వీలేలేదు. అట్లాగేనిలబడి, మెడ రిక్కించి యెదుటకేచూస్తూ, ప్రార్థనచేస్తూ, పర్సు వుందోలేదోనని తడివిచూసుకుంటూ. ఆందోళనపడిపోతూన్నాడు, ఎఫిమ్. వాడు అబద్ధ మాడేడు ! ఏమో, పాపం ! నిజమేనేమో ! వాడిడబ్బు నిజంగా పోయే వుంటే తనడబ్బుమాత్రం పోదని నమ్మకంఏమిటి ?. ఇవే ఆలోచనతో అతని మెదడు గందరగోళంగావుంది.

## 10

అట్లాగే నిలబడి ప్రార్థనచేస్తూ, యెదురుగావున్న సమాధివైపు చూస్తూన్నాడు, ఎఫిమ్. సమాధిపైన ముప్పైఆరు దీపాలు వెలుగుతూ

న్నాయి. అందరి తలలమీదినుంచీ చూస్తూంటే, హఠాత్తుగా అందరికీ ముందు, దీపాలక్రింద అగ్నిహోత్రంమండుతూన్నదగ్గిర్లో ఎలీషాబోద్రోఫ్ కనిపించేడు. సరిగ్గా అదే బూడిదరంగు పొడుగుకోటు: వెలుతురు అతని బట్టతలపీగపడి మెరుస్తూందికూడాను!

"వాడు ఎలీషాయే అనుకుంటా! ఇదెట్లా సంభవం? నాకంటె ముందర వాడిక్కడికెట్లా చేరివుంటాడు? మా ఓడకి ముందు ఓడ వారంరోజులు ముందుగా బైలుదేరింది. దాన్ని వాడు అందుకోలేడు. ఇంక పోతే మా ఓడలో వాడు లేనేలేడు. నేను అంతా వెతికిచూసేను."

ఎఫిమ్ యిల్లాఆలోచిస్తూ, చూస్తూండగానే, ఆవృద్ధుడు ప్రార్థన చేస్తూ వంగి మూడుసార్లు వందనమాచరించేడు. ముందు ఎదురుగా భగవానునికీ, తర్వాత కుడియెడమలకి క్రైస్తవప్రపంచానికీ అభివాదనంచేసి, మళ్ళీ తలమెత్తేడు. ముఖంకూడా కనిపించింది, ఆవృద్ధుడు ఎలీషాయే! నల్లగా, వుంగరాలుతిరిగిన ఆతనిగడ్డం, చెక్కిళ్ళమీది నెరసినవెంట్రుకలు, అవేకళ్ళూ, ముక్కూ, కనుబొమలూ, అదేముఖం! సందేహంలేదు, అతడు ఎలీషాయే!

స్నేహితుడు కనిపించినందుకాతనికెంతో సంతోషమైపోయింది. ఆతడు తనకంటెముందు ఎట్లారాగలిగేడో!

"వాడు మంచి తెలివైనవాడులే, మరి! అందరికంటె ముందే లోపలికి వెళ్ళిపోయేడు! బహుశా ఎవరో దారిలో కలిసి, సాయంచేసి వుంటారు. అందరూ వెళ్ళిపోయేటప్పుడు, వాణ్ణి వెతికి పట్టుకుంటా. నావెంటబడ్డ యీయాత్రీకుణ్ణి వదిలించుకుని, ఎలీషాతో కలుస్తా. వాడితో వుంటే నాకూ పవిత్ర స్థలాలన్నింటిలోనూ సులభ ప్రవేశం దొరుకుతుంది."

ఎఫిమ్ యిట్లా ఆలోచిస్తూ, దృష్టంతా ఎలీషామీదే వుంచి చూస్తూన్నాడు. అతడు తప్పిపోతాడనే అతని భయం. ప్రార్థన పూర్తికాగానే జనం అంతా ముందుకి తోసుకుంటూ వచ్చేస్తూన్నారు. ఆతొందరలో చాలమంది నలిగి, పచ్చడై పోతూన్నారు. శిలువను స్పృశించి, ముద్దెట్టుకోడానికెవరికివారే ప్రయత్నం! ఒకటేదొమ్మి. ఎఫిమ్‌కి ఆగలభాలో పర్సు పోతుందేమోనని ఒకటేభయం! ఓచేత్తో గట్టిగా పర్సు పట్టుకుని రెండోచేత్తో దారిచేసుకుంటూ, ఆతడూ ముందుకి తోసుకుపోయేడు. అక్కడికివెళ్లేక ఎలీషాకోసం అంతా కలియచూసేడు. చెర్చిలోపలా, మఠంలోనూ, ఆవరణలోనూ అంతా గాలించేడు. లోపల ఆవరణచుట్టూ వున్న గదులన్నీ, వరాండా అంతా యాత్రీకులతో నిండి వుంది. కొందరు తింటున్నారు. మరికొందరు త్రాగుతున్నారు ; కొందరు నిద్రబోతున్నారు; మరికొందరు చదువుకుంటున్నారు. వీళ్ళలో కూడా ఎలీషా కనిపించలేదు. అతణ్ణి పట్టుకోలేక విసుగెత్తి, సాయంకాలానికి ఒంటరిగానే సత్రానికి వచ్చేసేడు. సహయాత్రికుడు మాత్రం రాలేదు. అతడు బదులు పుచ్చుకున్న రూబులుకి నీళ్ళచుక్క వదులుకోవాల్సిందే! ఎఫిమ్ తిరిగి ఒంటరిగాడైనాడు.

ఆ మర్నాడు, 'తాంబోవ్' యాత్రీకుల్లోని ఒకవృద్ధుడితో కలిసి ఎఫిమ్ మళ్ళీ క్రీస్తుసమాధిని దర్శించేడు. ముందరికి పోవాలని యెంత ప్రయత్నించినా, అతన్ని వెనక్కినొక్కేస్తూవచ్చేరు, జనం. ఓ స్థంభాని కానుకుని, సమాధివైపుచూస్తూ ప్రార్థనచేస్తూన్నాడు, ఎఫిమ్. మళ్ళీ అందరికంటెముందు, దీపకాంతిలో బట్టతల మెరుస్తూంటే నిలబడి వున్నాడు, ఎలీషా. పూజాపీఠందగ్గిరనే పూజారికిమల్లేనే చేతులుజాచి ప్రార్థనచేస్తున్నాడు!

"ఈసారి దాటిపోనివ్వను." అనుకుంటూ, చేతులతో త్రోసుకుని దారిచేసుకుంటూ, ముందుకివచ్చేడు, ఎఫిమ్. కాని, ఎలీషా కనిపించలేదు.

అంతా మాయగావుంది. మూడోరోజునికూడా మళ్ళీ ఎలీషా కనిపించేడు. చేతులుజాచి, ముఖం పైకెత్తి ప్రార్థిస్తూ, పూజాపీఠం దగ్గిరలో స్పష్టంగా కనిపించేడు. పైన యేదో దివ్యదర్శనం చూస్తూన్నట్లుగా వుందాతని వైఖరి!

"ఇప్పుడు తప్పుకుపోనివ్వను. ద్వారందగ్గిర కాచుకుంటా. అక్కడే నిలుచుంటే నన్ను తప్పించుకుపోలేడుగదా!" అనుకుంటూ ఎఫిమ్, గర్భగుడి గుమ్మంలోనే కాచుకున్నాడు. మధ్యాహ్నం కావచ్చింది. ఎందరో బైటికి వెళ్లేరు. కాని, ఎలీషా మాత్రం రానేలేదు.

ఆరు వారాలవరకూ ఎఫిమ్. యెరూషలేమ్‌లోనే వుండి, యాత్ర లన్నీ సేవించేడు. బెత్లెహామ్, బెథానీ, జోర్డన్, అన్నీ దర్శించి వచ్చేడు. ఒక కొత్త చొక్కాకొని, పవిత్ర సమాధిదగ్గర దానిమీద పవిత్ర ముద్ర వేయించేడు. తాను చనిపోయినప్పుడు, ఆచొక్కా తొడుక్కొని, సమాధి చేయించుకుంటాడు. జోర్డాన్ నది జలాన్ని ఒకపెద్ద గిండీతో నింపి సీలు వేసి పదిలపరచేడు. అక్కడి పుణ్యమృత్తికనూ, (మట్టి అనకూడదు!) పవిత్రాగ్ని ముట్టించబడిన కొవ్వొత్తుల్ని, కొని భద్రపరచుకున్నాడు. ఎని మిదిచోట్ల తన ఆప్తుల ఆత్మశాంతికై ప్రార్థనలు చేయించి, దక్షిణ లిచ్చేడు. దగ్గరున్న డబ్బంతా అయిపోయిందాకా యేవో ఒకటి చేయించేడు. ఇంక దారిబత్తేనికి మాత్రం కొద్దిగా మిగిలిందనగా బైలుదేరి గృహోన్ముఖుడయేడు. కాలినడకనే జాఫాచేరి, ఒడెస్సాకి పోతూన్న ఓడనెక్కి, సురక్షితంగా దిగి, పాదచారియై, వచ్చినదారినే బైలుదేరేడు.

## 11

ఒక్కొక్క మైలేగడిచి స్వగ్రామానికి దగ్గర పడుతూన్నకొద్దీ ఎఫిమ్‌కి యింటిదగ్గర పరిస్థితులెట్లా వున్నాయాఅనే ఆందోళన హెచ్చింది. "అప్పుడే సంవత్సరం కావచ్చింది. సంవత్సరం అంటే మాటలా? ఈలోగా ఎన్నిమార్పులు జరిగేయో? ఒకని జీవితకాలమంతా శ్రమపడి పనిచేసినా ఓయిల్లు నిర్మించడం కష్టం; కాని, నిర్మించినదాన్ని నాశనం చేయాలంటే ఎంతోసేపు అక్కర్లేదు. నేలేనప్పుడు మాకుర్రాడు జాగ్రత్తగా వ్యవహరించేడా అని? కొత్తయిల్లు ఎట్లా పూర్తిచేసేరో? చూడాదుడికీ యీశీతాకాలంలో జాగ్రత్తగా మేపేరో? లేదో? వేసవికాలపు పనులెట్లా జరిగేయో!" ఈఆలోచనలతో దారి పొడుగునా ఒకటే ఆవేదన పడిపోతూన్నాడు, ఎఫిమ్.

గత సంవత్సరం ఎలీషాతో విడిపడిన ప్రాంతం దగ్గరికి వచ్చేడు. ఆగ్రామాల్ని, ప్రజల్ని ఆనవాలు కట్టడమే కష్టం. అప్పుడు కరువు రోజుల్లో తిండిలేక కృశించిపోయిన ప్రజలు, నేడు సుఖంగా వున్నారు. కాలమానం సజావుగావుంది. ఈయేడు పంటలు బాగారాలేయి. నిరిటి దీన దశ మరిచిపోయేరు. వీళ్లు ఒకప్పుడు తిండిలేక మాడిపోయేరని మనం అనుకోనేలేము.

ఓరోజున ప్రొద్దుగూకుతూంటే ఆగ్రామాన్ని సమీపించేడు. గ్రామంలోకి ప్రవేశిస్తూంటే ఓయింటి దగ్గరనుంచి చిన్నపిల్ల పరుగెత్తుతూ వచ్చి, ఎఫిమ్‌ని పిలిచింది.

"తాతా! చిన్నతాతా! మాయింటికిరా."

ఎఫిమ్ వినిపించుకోనట్లు ముందుకు పోబోతూంటే ఆపిల్ల ఒదిలి పెట్టలేదు. కోటుపట్టుకుని లాగుతూ, తమ యింటికి లాక్కుపోయింది.

ఎంతో ఆరిందాగా నవ్వుతూ ముద్దుగా "తాతా ! రా !" అంటూంటే ఎఫిమ్‌కి పోకతప్పిందిగాదు. వాకిట్లో ఒక స్త్రీ చిన్నపిల్లవాడి చేతిని పట్టుకుని నిల్చునివుంది. ఆమె యితనికి నమస్కారంచేసి, సాదరంగా "బాబూ ! యీరాత్రి మాయింట భోజనంచేసి, వెళ్ళండి. మీజోటివాళ్లు మాయింటికి ఊరికే వస్తారా. ఆగకతప్పదు." అంది.

అతడు లోపలికి వెళ్లేడు. "ఆరోజున యీ యింట్లోకే మంచినీళ్ళ కోసం ఏలీషా వెళ్లింది ! అతన్నిగురించి వీళ్ళకేమన్నా తెలుసునేమో !"

ఆస్త్రీ ఎఫిమ్ భుజంమీది మూటలు అందుకుని లోపలపెట్టి, కాళ్లు కడుక్కోడానికి నీళ్ళిచ్చింది. పాదప్రక్షాళనచేసి తుడుచుకొని, టేబిల్ ప్రక్కనే బెంచిమీద కూర్చున్నాడు. అతనికి ఒక గ్లాసుతో పాలూ, వారెన్నికీ (పెరుగుతోచేసిన ముద్దలాంటి వంటకం—మనదద్ధోజ నం) వేడి వేడి గంజీ యిచ్చింది. ఎఫిమ్ ఆమె అతిథి సత్కారానికి పొగడుతూ, ధన్యవాదాలర్పించేడు.

ఆమె 'యిదేమంత గొప్ప' అన్నట్లుగా తలూపుచూ "బాబూ ! అతిథిపూజ చేయకండా యెట్లావుండగలం ? మీలాంటి ఆగంతునివల్లనే మా ప్రాణాలు నిలిచేయి. ఈశ్వరునేమరచి యేదో కాలంగడిపేవాళ్ళం. నిరుడు కరువువచ్చింది. ఈశ్వరుడు మమ్మల్ని బాగానే శిక్షించేడు. మృత్యువుకోసం యెదురుచూస్తూ, అందరం నిరుడు యీయింట్లోనే తిండి లేక మాడుతూ, జబ్బులతో పడివున్నాం. మేము చచ్చిపోయేవాళ్ళమే. కాని, భగవంతునికి కరుణకలిగి, మీలాంటితాతనే పంపి రక్షించేడు ! ఓరోజు యెండవేళ, దాహానికి కావాలంటూవచ్చి, మమ్మల్నిచూసి, దయ కలిగి ఆ వృద్ధుడు మాతోనేవుండిపోయేడు. మాకు తిండిపెట్టి, దాహాని కిచ్చి, సాయంచేసేడు. మా భూమి తాకట్టువిడిపించి యిచ్చేడు; బండీ, గుఱ్ఱం, ధాన్యం కొని యిచ్చి మరీవెళ్లేడు !"

ఆసమయానికే ఒక వృద్ధురాలు యింట్లోకివచ్చి, సంభాషణలో పాల్గొన నారంభించింది.

"ఈరోజువరకు ఆయన మానవుడో, దేవతో మాకు తెలియనే లేదు! మమ్మల్నందర్నీ ప్రేమించి, ఆమహాను భావుడు తానెవరో చెప్ప కుండానే, హఠాత్తుగా మమ్మల్ని వదిలి వెళ్లిపోయేడు. ఎవనిమీద మాకృతజ్ఞతచూపాలో, ఎవణ్ణిగూర్చి ఈశ్వరుణ్ణి ప్రార్థించాలో తెలియదు. అతడు యిప్పటికీ కళ్లకి కట్టినట్లున్నాడు. చావుకోసం యెదురుచూస్తూ నేను యిక్కడే పడుకున్నాను. పొట్టిగా, బట్టతలతో ఒక వృద్ధుడు లోపలికి వచ్చి, మంచినీళ్లడిగేడు. అతన్ని చూస్తే, ఏమంత విశేషం కనిపించదు. పాపిష్ఠిదాన్ని ఏమనుకున్నానో తెలుసా! 'ఇతనికిక్కడ ఏమి అవసరం?' అనుకున్నానమ్మా! మాఅవస్థ చూడ్డంతోనే భుజానవున్న సంచీ యిక్కడే పెట్టి, తెరిచేడు."

"కాదు, నాయనమ్మా! మొదట సంచి నేలమీద పెట్టేడు. తర్వాత బెంచీమీదికి తెచ్చేడు." అని సవరించింది, ఆచిన్నపిల్ల.

ఈవిధంగా అతడెక్కడ ఏంచేసిందీ, ఏమి చెప్పిందీ అంతా మళ్లీ మళ్లీ చెపుతూ, ఒకరు చెప్పినదానికి మరొకరు సవరణలుచేస్తూ చెపుతూన్నారు. ఎక్కడ పడుకున్నాడో, ఎక్కడ కూర్చున్నాడో, ఏమి చేసేడో, ఏమి మాట్లాడేడో అన్నీ వాళ్లు వర్ణించి చెపుతూంటే సాయంత్రం అయింది. రైతు, బండితోలుకుని పొలాన్నుంచి యింటికి వచ్చేడు. అతడు గుర్రాన్ని విప్పి కొట్టంలో కట్టి వచ్చి, వీరితో కూర్చుని సంభాషణ ప్రారంభించేడు.

"అతడేగనక యిక్కడికి రాకపోతే మేము చచ్చిపోయి వుండే వాళ్లం. నిరాశతో, మానవుల్నీ, దేవుణ్ణీకూడా శాపనార్థాలు పెడుతూ, చావు

కోసం యెదురు చూస్తూన్నాము. అతనే మమ్మల్నందర్నీ బతికించేడు. అతనిద్వారానే మాకు ఈశ్వర విశ్వాసం, మానవుల సద్భావంమీద నమ్మకం కలిగేయి. క్రీస్తుప్రభువాతణ్ణి ఆశీర్వదించుగాక! జ్ఞానోపదేశంచేసి మూఢులమైన మమ్మల్ని మానవుల్ని చేసేడు!" అన్నాడాతడు.

అందరూ భోజనాలు చేసి, పక్కలు పరచి పండుకున్నారు. ఎఫిమ్‌కి సుఖంగా వుండేలా పడక ఏర్పాటుచేసేరు అతడికి నిద్ర పట్టనేలేదు. ఎలీషా అతని కళ్ళయెదుటే కనిపిస్తూన్నాడు. యెరూషలేములో దేవాలయంలో మూడుసార్లాతడు కనిపించిన విషయం జ్ఞప్తికి వచ్చింది.

"ఆహాఁ! తెలిసింది. నాకంటె ముందుగా దైవసాన్నిధ్యాన స్థానం సంపాదించిన కారణం యిదన్నమాట! భగవానుడు నాభక్తినీ, కానుకల్నీ స్వీకరించేడో లేదో చెప్పలేను. గాని, ఎలీషా సేవనుగుర్తించి, ఆశీర్వదించేడని విస్పష్టమే!"

చాల రాత్రికిగాని అతనికి నిద్రేపట్టలేదు. ఉదయమే వారి దగ్గర సెలవుతీసికొని, పయనమయేడు. వారాతనికి పాథేయంగా బజ్జీలు, రొట్టెలు చేసి యిచ్చేరు. ఎఫిమ్ గృహమార్గాన్ని బట్టేడు.

## 12

కొద్దిరోజుల్లో ఎఫిమ్ యింటికి చేరుకున్నాడు. అప్పటికాతడు యిల్లువదిలి సంవత్సరం అయింది. ఇంటికి చేరేసమయానికి సాయంత్రం కావచ్చింది. కొడుకు యింటిపద్దలేడు. కొంచెం సేపటిలో సారాయంగడి నుంచి యింటికి వచ్చేటప్పటికి త్రాగినట్లున్నాడు. ఎఫిమ్ అతన్ని యెన్నో ప్రశ్నలు వేసేడు. తనులేనప్పుడు దుర్వ్యసనాల్లోపడి, డబ్బు పాడుచేసి, పనులు వెనకబెట్టేడని గ్రహించి, అతనికి చాలకోపం వచ్చింది. కొడు

కుని తిట్టేడు. అతడు యెదిరించి, "నిన్ను యాత్రకెవరెళ్లమన్నారు? డబ్బంతా యాత్రల్లో తగలేసి, పైగా నన్ను డబ్బు డబ్బంటే యెక్కడ తెస్తాననుకున్నావ్?" అనేసరికి ఎఫిమ్‌కి వళ్లుమండి, కొడుకును నాలుగు కొట్టేడు పెద్దజగడం జరిగింది.

ఎఫిమ్ మరునాడుదయమే కుమారుని విషయం మాట్లాడడానికి గ్రామాధికారి దగ్గిరికి వెడుతూంటే, ఎలీషా భార్య అతన్ని పిలిచింది.

"నమస్కారము, అన్నయ్యా! నీయాత్ర నిర్విఘ్నంగా జరిగిందా?" అని పలకరించిందామె.

"అంతా ఈశ్వర మహిమే! అంతా బాగానే జరిగింది. మీముసలాతడు వారిలో తప్పిపోయేడు. అతడు యింటికి వచ్చేడని విన్నానే?"

ఆమె ఆవిషయం, యీవిషయం మాట్లాడ నారంభించింది. ఆమెకు బాతాఖానీఅంటే యెప్పుడూ యిష్టమే.

"ఔను! చాల రోజులక్రిందటే వచ్చేసేరు. యజమాని 'మేరీ స్వర్గమన దినా'నికి* ముందరే యింటికి వచ్చేరు. ఆయనను సురక్షితంగా యింటికి చేర్చినందుకు వెయ్యిదండాలుపెట్టేం, ప్రభువుకి. అతడుయింట్లో లేకపోతే మాకు తోచదు. ఆయనకు పెద్దవయసు వచ్చి యిప్పుడంతగా పనిచేయలేరుగాని, ఆయన సలహా లేనిదే మాకెట్లా జరుగుతుంది. అబ్బాయి అంటాడు: "నాన్న లేకపోతే అంతా గాఢాంధకారంలా ఉంటుందమ్మా!" "ఔను, మరి. ఆయనంటే మాకందరికీ అంత యిది!"

"ఇంట్లో వున్నాడా, యిప్పుడు?"

"ఆఁ: వున్నాడు. తేనెటీగల్ని పెట్టెల్లో పెడుతూ, పెరటి తోట

---

* దీనినే 'అసంప్షన్' అంటారు. చర్చీలలో ఆగష్టు 15 వ తేదీన దానిని చేస్తారు. మేరీని చనిపోయేక ఆమె శరీరాన్నీ, ఆత్మనీ భద్రపరచి, దేవదూతలు స్వర్గానికి తీసికొనిపోయిన దినమని క్రైస్తవ సాంప్రదాయం.

లోనే వున్నారు. ఈయేడు తేనెటీగలు బాగా ముసురుతూన్నాయట ఆయ నంటారు, "పాపాత్ములమైనా మనకి ఈశ్వరుడు అర్హతను మించే యిస్తున్నాడు!" వెళ్లు, అన్నయ్యా! నిన్ను చూడాలని ఎంతో యిదవు తూన్నారు, పెరట్లోకివెళ్లు."

నడవలోంచి పెరట్లోకి, అక్కడినుంచి తేనెటీగల తోటలోకీ వెళ్లేను, ఎఫిమ్. అక్కడో బిర్చిచెట్టుక్రింద పొడుగాటి గోధుమరంగు కోటు తొడుక్కొని, పైకిచూస్తూ నిలుచుని వున్నాడు, ఎలీషా. ముఖానికి దోమతెరగాని, చేతులకి గ్లోవులు (రబ్బరు లేక ఊలుతో అల్లబడిన తొడుగు) గాని వేసుకోకుండా, చేతులుపైకి యెత్తి ప్రార్థిస్తున్నట్లుగా నిల్చున్న అతని బట్టతల మెరిసిపోతూంది. అతడు యెరూషలేమ్ క్రీస్తు సమాధి దగ్గర కనిపించినట్లే వున్నాడు, సరిగ్గా! బిర్చిచెట్టు కొమ్మల్లోంచి సాయంతన సూర్యుడు పెద్ద మంటలా కనిపిస్తున్నాడు. ఎలీషా తలమీద చుట్టూ యెగురుతూన్న తేనెటీగలు బంగరు కాంతితో మెరుస్తూ కాంతి వలయంలావున్నాయి. అవి ఎలీషాను కుట్టడంలేదు. ఈదృశ్యంచూసి ఎఫిమ్ ముగ్ధుడై, అట్టే నిలబడిపోయేడు.

వెనకే వచ్చిన గృహిణి, భర్తను హెచ్చరించింది;

"ఏదో కాలక్షేపం! ఏమండీ, మన ఎఫిమ్ వచ్చేడు."

ఎలీషా వెనకతిరిగి గడ్డంలో చిక్కుకున్న తేనెటీగల్ని మెల్లిగా విడిపించుతూ, సంతోషంగా ఎఫిమ్‌వైపు చేతులుజాచి వచ్చేడు.

"ఈశ్వరుడు నిన్ను కృపచూస్తాడు, ఎఫిమ్! నీకు ప్రభువు నూరేళ్లాయుష యిస్తాడు, నేస్తమా. నీయాత్ర నిర్విఘ్నంగా సాగిందికదా?"

"ఆఁ! యాత్రంతా నాకాళ్లేచేసినాయి. నీకోసం జోర్డాన్ నదిలోంచి పవిత్రజలాన్ని తెచ్చేను. ఆనకవచ్చి తీసుకొనివెళ్ళు. కాని, ప్రభువు నాసేవల్ని స్వీకరించేడో లేదో తెలియదు!........"

"సరే! సరే! మనదేముంది? అన్నిటికీ ఆఈశ్వరుడే వున్నాడు. క్రీస్తు మనల్ని దయచూస్తాడు."

ఎఫిమ్ ఏమీ జవాబు చెప్పలేదు. చాలసేపటికి,

"నాశరీరం అక్కడికి వెళ్ళింది. కాని, నాఆత్మ అక్కడికి వెళ్ళిందో లేదో? మరొకరి ఆత్మ అక్కడ వుందో........"

"అంతా ఈశ్వరేచ్ఛ! నేస్తమా! అదంతా ప్రభువు యిష్టం!"

"దారిలో నువ్వు ఆగిన యింటిదగ్గరే నేనూ వచ్చేటప్పుడు ఆగేను...."

ఎలీషా యేవో వెదురుతూన్నట్లుగా, మాటలు మార్చడానికి తొందరగా....

"ఎఫిమ్! మన యిష్టమేముంది? మనం ఊరికే నిమిత్తమాత్రులమే. అంతా ఈశ్వరుడే చేయిస్తాడు. ఏమిటి, నిలుచున్నావేం? రా, కూర్చో. తేనె రుచి చూద్దువుగాని."

తేనె యిచ్చి, సంసార గొడవలనుగూర్చి అదీయిదీ చెపుతూ, ఆగ్రామంలో జరిగిన సంగతి యెత్తనీకుండా మరిపించాలని ప్రయత్నిస్తున్నాడు, ఎలీషా.

ఎఫిమ్ ఒక్క నిట్టూర్పు విడిచేడు. ఇంక ఆగ్రామంలో ఎలీషా సాయపడిన కుటుంబాన్నిగూర్చిగాని, యెరూషలేం దేవాలయంలో పవిత్ర జ్యోతులక్రింద ఎలీషా కనిపించడాన్నిగూర్చి కాని మాట్లాడడానికాతడు ప్రయత్నించనేలేదు. ఈశ్వరుడు ప్రతివ్యక్తికీ ఆమరణాంతం కొన్ని కర్తవ్యాల్ని నిర్దేశించే వున్నాడని అతడు యిప్పటికి గ్రహించేడు. లాభలోభాలను పొందక, ప్రేమతో సత్కార్యాచరణ చేస్తూండడమే ఈశ్వర నిర్దేశం!

(రచన 1885)

# సంతృప్తియే సుఖము

ఉఫా రాష్ట్రంలో ఇలియాస్ అనే బష్కీర్ జాతివాడుండేవాడు. తండ్రి అతనికి పెండ్లిచేసి, కొద్ది కాలానికే పరలోక గతుడయ్యేడు. తండ్రి చని పోయేటప్పటి కాతనికున్న ఆస్తి బహుస్వల్పం. ఏడు గోడీగలు, రెండు ఆవులు, యిరవై గొర్రెలూ,- యివే అతని ఆస్తి. ఇలియాస్ చాల పొదు పరి; మంచి పనివాడు. అందుచే క్రమంగా అతని సంపద పెరుగుతూ వచ్చింది. అతడూ భార్యాకూడా సూర్యోదయాత్పూర్వమే లేచి, రాత్రి పొద్దుబోయేవరకూ కష్టించి పనిచేస్తూనే వుండేవాళ్లు. ఈరీతిగా ముప్పై ఐదేళ్లు పనిచేసి, చాల సంపదను ప్రోగుచేయ గలిగేడు.

కొద్ది కాలంలోనే అతనికి మూడువందల గుర్రాలు, నూటయాభై ఆవులు, రెండువేల గొర్రెలూ వున్నాయి. అతని మందల్ని చూడ్డాని కిప్పుడెందరో పనివాళ్లున్నారు. ఎందరో స్త్రీలు, ఆవులు, గోడీగల పాలు తీయడానికీ, పాలల్లోంచి క్యుమిస్,* వెన్న, జున్ను చేయడానికీ నిరం తరం అతని దగ్గర పనిచేస్తుంటారు. అతనికేమీ లోటులేదు. చుట్టుపట్ల వున్నవారందరూ యితని ఐశ్వర్యానికి సెభాష్ అనేవారు.

"అతనికేం, మహారాజు! అదృష్టవంతుడు! లోటేముంది? పెట్టిపుట్టేడు!" అనేవారందరూ.

ఉన్నత స్థితిలో వుండేవాళ్లెందరో అతన్నిప్పుడెరుగుదురు. వాళ్లంతా అతనితో స్నేహంగా వుండడానికి యిష్టపడుతూండేవాళ్లు. దూరదేశాలనుంచి కూడా యెప్పుడూ అతిథులాతని యింటికి వస్తూండే వాళ్ళు. వాళ్ళందర్నీ ప్రత్యుత్థానంచేసి, ఆతిధ్యం యిచ్చేవాడు, ఇలియాస్.

---

* గుర్రం పాలలోంచి తయారు చేయబడే ఒక రకమైన సారాయము.

ఆహారపానీయాలు, క్వమిస్, టీ, మాంసం, ఒకటేమిటి అన్నీ, ఎల్ల వేళలా అతిథులకి సమృద్ధిగా దొరికేవి. ఎవరైనా అతిథి వచ్చినరోజుని ఒకటో రెండో గొర్రెలు యమునికి అతిథులుగా వెళ్లేవి! చాలమంది వస్తే గోడిగ ఒకటైనా మడమడలాడేది.

ఇలియాస్ కిద్దరు కుమారులూ, ఒకకుమార్తె వున్నారు. వారందరికీ వివాహాలు చేసేసేడు. ఇతడు బీదవాడుగా వున్నప్పుడు వాళ్ళుకూడా యితనితోబాటు పనిచేసేవాళ్ళు. గుర్రాల్నీ, గొర్రెల్నీ మేపుకొచ్చేవారు. ఇప్పుడీతని స్థితి గొప్పదికాగానే వాళ్ళు సోమరులై, జులాయిగా తిరగడం నేర్చుకున్నారు. పెద్దవాడు త్రాగుడు నేర్చుకుని, వీధి కొట్లాటల్లో చనిపోయాడు. రెడోవానిభార్య స్వతంత్రురాలు. అంచేత వాడు తండ్రి మాట వినడం మానేశాడు. వాడికి భాగం పంచిపెట్టి అతనిదారిని అతన్ని పంపాల్సి వచ్చింది, ఇలియాస్‌కి.

రెండో కుమారునికి ఒకయిల్లూ, కొన్ని పశువులూ, జీవాలూ యిచ్చి, వేరుంచిన తర్వాత ఏదో తెగులు వ్యాపించి గొర్రెలు చాలా చచ్చిపోయేయి. ఆమరుచటి సంవత్సరం అనావృష్టిచే పంటల్లేవు, గడ్డిలేక ఆశీతాకాలం చాల పశువులు చచ్చిపోయేయి. ఇన్నిటికీతోడు 'మూలిగే నక్కమీద తాటిపండు' అన్నట్లుగా ఆ ఏడాది కిర్ఘిజ్ దండు వచ్చి, మంచిగుర్రాలన్నిటినీ దొంగిలించుకొనిపోయేరు. అతనిసంపదంతా యీ విధంగా క్షీణించనారంభించింది. అతని సంపదతోబాటు, శరీర దార్ఢ్యంకూడ తగ్గిపోయింది. డెబ్బైయేళ్ళవయస్సులోనే అతను తిండి కోసం మొహంవాచి, తన ఉన్నికోట్లూ, తివాచీలూ, బళ్లూ, జీనులూ,— యివన్నీ అమ్ముకోవాల్సినగతిపట్టింది. ఆఖరికి మిగిలిన కొద్ది గొర్రెల్నీ కూడా విక్రయించి, శూన్యహస్తాలతో మిగిలేడు.

ఇదంతా చాలకొద్దికాలంలోనే జరిగిపోయింది. అందువల్ల యిదెట్లాజరిగిందో కూడ ఇలియాస్ గుర్తించలేకపోయేడు. పొట్ట

పోసుకోడానికై తానూ, వృద్ధభార్యా చివరకి కూలికి పోవాల్సినస్థితి యేర్పడింది. కట్టుబట్టలుగాక నాదీ అనదగినది అతనికిప్పుడొక్క ఉన్ని కోటు, టోపీ, బూట్లజత, వృద్ధభార్య- 'షెమ్ షెమాషీ'- మాత్రమే. రెండోకుమారుడు దేశాంతరాలకి పోయేడు. . కుమార్తె చనిపోయింది; పెద్దకొడుకావరకే చనిపోయేడు. ముసలితనంలో యీ దంపతులిప్పుడు అసహాయస్థితిలో వుండిపోయేరు:

వారి పొరుగువాడు, మహమ్మద్ షా. అతనికి ఈ వృద్ధులమీద జాలికలిగింది. అతడేమీ ధనికుడు కాడు. కాని నిరుపేదా కాడు. అతనికి సుఖజీవనం జరిగిపోయేది. స్వభావం చాలమంచిది. ఇలియాస్ ఐశ్వర్యంతో ఉన్నప్పుడాతని అతిధిమర్యాదలు తలుచుకుని, యిప్పటిస్థితిచూచి చాలవిచారించేడు. ఆ దంపతులతో యిట్లా అన్నాడు :

"తాతా ! నువ్వూ, అవ్వా వచ్చి మాయింట్లోవుండండి. ఓపికున్నంతమటుకు ఏదోకాస్త నాకు పనిసాయం చేద్దురుగాని. వేసవిలో నా పళ్ళతోటలో నీరుకట్టడం, శీతకాలంలో మాడలముందు గడ్డీగాదం వున్నదోలేదో చూడ్డం, ఆపాటిచాలు. షెమ్ షెమాషీ పాలుతీసి, క్యూమిస్ చేస్తుంటుంది. తిండీ, గుడ్డా యిస్తాను; యింకా మీకేంకావాల్సినా నన్నడగండి, యిస్తుంటా."

పొరుగువాని అభిమానాదరాలకి అభివందనాలుతెలిపి, ఇలియాస్, భార్యతోసహా మహమ్మద్‌షా ఇంటిపనిచేయడానికి వచ్చేశాడు. మొదట్లో అలవాటుతప్పి వుండడంవల్ల పని కష్టమనిపించింది. కాని క్రమంగా కొద్దిరోజులకే పని అలవాటయింది. చేతనైనంత పనిచేస్తూ నిశ్చింతగా కాలక్షేపం చేస్తున్నారా వృద్ధదంపతులు.

ఇటువంటి పనివాళ్లు తనకు దొరకడం ఎంతలాభమో కొద్దిరోజుల్లోనే మహమ్మద్‌షాకి తెలిసివచ్చింది. వీరు యజమానులుగా వున్నవాళ్లే

గనక యేయేపనులు యెప్పుడుచెయ్యాలో, అంతా వీళ్ళకి కొట్టినపిండే. పైగా వీళ్ళది ఒళ్ళుదాచుకునే స్వభావంగాదు. ఎప్పుడూ ఏదోపనిచేస్తూనే వుండేవాళ్ళు. అల్లాంటివాళ్ళకి యీ వృద్ధాప్యంలో ఎటువంటిఅవస్థ వచ్చిందా ? అని మహమ్మద్ షా విచారిస్తూనేవుండేవాడు.

ఒకరోజున మహమ్మద్ యింటికి దూరదేశాన్నుంచి కొందరు అతిథులు వచ్చేరు. వారిలో ఒక ముల్లా కూడా వున్నాడు. గొర్రెని ఒక దాన్ని కోసి, వండమని ఇలియాస్‌కి ఆజ్ఞయిచ్చేడు, యజమాని. గొర్రెని పట్టుకుని, కోసి, వండి, అతిథులకి వడ్డించేడు. తింటూ, టీ, క్యుమిస్ త్రాగుతూ, తివాచీలమీద దిండ్లకానుకుని కూర్చుని, బాతాఖానీవేస్తూన్నారు. ఆ సమయానికే ఇలియస్ పనిపూర్తిచేసుకుని, అటువెడుతూ కనిపించేడు. ఆతన్నిచూస్తూనే మహమ్మద్, అతిథులతో: "అదుగో ! ఆ వెళ్ళే వృద్ధుణ్ణి చూసేరా ?" అన్నాడు.

"ఆఁ ! ఆతన్ని గురించి విశేషమేమిటి?" అతిథుల్లో ఒకడన్నాడు.

"అతడొకప్పుడీ ప్రాంతానికంతకీ ధనికుడు ! ఇలియాస్ అంటే ఆతడే. అతన్ని గురించి వినలేదూ ?"

"ఏమిటీ ? విన్నాను. కాని ఆతన్ని యెప్పుడూ చూడలేదు. అతని పేరు దూరదేశాల్లోకూడా విననివాళ్లుండరు !" అన్నాడతిథి, కుతూహలంతో.

"అది సరేగాని యిప్పుడాతనికేమీ లేదు. ప్రస్తుతం నాదగ్గిరే పని చేస్తూన్నాడు. అతని భార్య కూడా యిక్కడే పనిచేస్తూంటుంది."

అతిథికి ఆశ్చర్యం కలిగింది. నాలిక తాటించి, తలపంకిస్తూ,- "ఔను బాబూ ! కలిమిలేములు కావడి కుండలు. అంతా చక్రనేమి క్రమాన నడుస్తూంటాయి. ఇప్పుడు పైనవున్న ఆకులే మళ్ళీ క్రిందికి తిరుగుతవి.

విధిని తప్పించడం యెవరితరం? అయితే, వృద్ధుడికి చాల కష్టంగానే వుండి వుంటుంది. కదూ ?" అన్నాడు.

"ఏమో, ఎవరికీతెలియదు. అతడు బహుశాంతుడూ, ఓరిమి కల వాడూనూ. కష్టపడి పనిచేస్తాడు."

"అతనితో మాట్లాడాలి, అతని జీవితాన్ని గురించి తెలుసుకోవా లని కుతూహలంగావుంది." అన్నాడు, అతిధి.

"అట్లాగే తప్పకుండా." అంటూ మహమ్మద్ ఇలియాస్‌ను కేక వేసి పిలిచేడు : "బాబాయ్ ! ఇల్లారావయ్యా. కాస్త క్యుమిస్ పుచ్చుకుని వెడుదువుగాని. పిన్నినికూడా పిలు."

ఇలియాస్, భార్యను తీసుకుని, లోపలికి వచ్చేడు. యజమానికి, అతిధులకీ నమస్కారాలుచేసి, ప్రార్థన చేసుకుని, ద్వారం దగ్గరలోనే కూర్చున్నాడు. షెమాషీ తెరమాటుకిబోయి యజమానురాలితో బాటుగా కూర్చుంది.

ఓకప్పు క్యుమిస్ ఇలియాస్‌కి యిచ్చేడు, మహమ్మద్. వందన పూర్వకంగా దానినందుకుని, యజమానికి ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధిగా దీవించి, కొద్దిగాత్రాగి, క్రింద బెట్టేసేడు.

అతిధి అందుకున్నాడు : "తాతా ! మమ్మల్నిచూస్తే, నీకు వెను కటి సుఖదినాలు జ్ఞప్తికివచ్చి విచారం కలగటంలేదూ ? అప్పుడు కలిమి గల దినాలు ; యిప్పుడు లేమితో ఎట్లాగడుస్తోంది ?"

ఇలియాస్ చిరునవ్వుతో, జవాబు చెప్పేడు. "నాసుఖదుఃఖాన్ని గూర్చి నేనేచెప్పతే మీరు నమ్మరు. మాముసలావిడ నడగండి ఆమెస్త్రీ ; ఆడవాళ్ళ హృదయాన్ని నాలిక దాచలేదని లోకవిదితమేగదా ! ఉన్న సంగతంతా ఆమె చెపుతుందడగండి."

అతిధి కుతూహలం హెచ్చింది. తెరవైపుతిరిగి, "అవ్వగారూ! మీకష్టసుఖాలనుగూర్చి మాకొంచెం చెప్పండి, వింటాము." అన్నాడు.

షెమ్‌షెమాషీ తెరవెనకనించే జవాబుచెప్పింది: "మేము యాభైయేళ్ళనుంచీ సుఖంకోసం ఆశించేము. ఎంత దేవుళ్ళాడినా యింత వరకు మేము సుఖమంటే యెరుగనేయెరుగము! ఇప్పుడుమాకు "మా" అనేదేలేదు. రెక్కలకష్టంచేసి, పొట్టపోసుకుంటున్నాము. ఈ జీవిత విధానంలోనే మాకు శాంతి సౌఖ్యాలు లభించేయి. ఈవిధంగా మా జీవిత శేషం వెళ్ళిపోతేచాలుననే మేము కోరేది."

అతిధులకూ, గృహమేధికీకూడ ఆశ్చర్యం కలిగింది. మహమ్మద్ ఆశ్చర్యపూరితుడై లేచివెళ్ళి తెరతొలగించి, ఆ వృద్ధురాలిని విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నాడు. ఆమె చేతులుజోడించుకుని కూర్చుని, ఇలియాస్‌వైపు దరహాసంతో చూస్తూంది; ఆ వృద్ధుడుకూడ ఆమెవైపు సంతోష శ్రద్ధలతో చిరునవ్వు నవ్వుతున్నాడు. ఆమె అంతట్లో తిరిగి అంది: "నేను పరిహాసానికి అనటంలేదు. నిజమే చెప్తుతూన్నా. అర్ధ శతాబ్దకాలం సుఖాన్వేషణచేసేం. అయితే మేము సంపన్నులమైవున్నంత కాలం యెక్కడా సుఖంకానరాలేదు. ఇప్పుడంతాపోయి, చెమటోడ్చి కాలం గడుపుతూన్నాం; అందువల్ల అనన్యమైనసుఖం అనుభవించ గల్గుతున్నాం."

"ఇప్పుడు మీరుఅనుభవిస్తూన్నామన్న సుఖం, దేనిలోను?"

"చెపుతా, వినండి! మేము ధనికులుగా వుండేటప్పుడు మాకు స్థిమితమేవుండేదికాదు. కాస్త తీరికగా యిద్దరంకూర్చుని, కబుర్లు చెప్పుకొనేందుకుగాని, దైవస్మరణ చేసుకోడానికిగానీ, ఈశ్వరుణ్ణి ప్రార్థించుకొనేందుకుగానీ, అవకాశమేవుండేదిగాదు. ఎప్పుడూ ఏదో తొందరే. అన్నిటికీముందు వచ్చేవారూ, పోయేవారూ. వాళ్ళకి యేంచేయాలి?

ఎట్లాచూడాలి ? ఏంటహూకరించాలి ? వాళ్లువెళ్ళి మమ్మల్నిగూర్చి చెడుగా మాట్లాడకుండా చూసుకోవాలనే ఆదుర్దా. ఇంక నౌకర్లు— వాళ్లేమో వీలైనంత హెచ్చుగా తిని, యెక్కువగా నిద్రబోదామని ప్రయత్నించేవాళ్ళు. వాళ్ళచేత వీలైనంత హెచ్చుపనిచేయించాలని మా తాపత్రయం. ఈ విధంగా తప్పుమార్గాల్లో ఆలోచించడం; పాపాయ పరపీడనం గదా ! ఏ గొఱ్ఱె నే తోడేలు యెత్తుకుబోయిందో ! దొంగలు గుర్రాల్ని తోలుకుపోయేరేమో ! రాత్రి నిద్రేపట్టేదికాదు. రాత్రి కల్లోకూడ యేదో ఆందోళనే, రాత్రి యెన్నోసార్లులేచి, ఇల్లూ, దొడ్డీ అంతా కలయదిరిగి వచ్చేవాళ్ళం; ఒకటికాకపోతే మరొకటి. అన్నీ తొందరలే. శీతకాలానికి గడ్డి సరిపడుతుందో, లేదో ? ఇన్నిటికీమించి నాకూ, ముసలాయనికీ మాట కలిసేదేకాదు ! అతడిట్లా చేద్దామంటే, నేనింకోలా చేద్దామనటం; యుద్ధరం పోట్లాడడం; ఇంతే మా జీవితవిధానం. ఒక ఆదుర్దా తగ్గితే మరొకటి. సుఖంఅంటే యెరుగనే యెరుగము."

"మరి, యిప్పుడో ?"

"ఇప్పుడా ? ఉదయమేలేస్తాం. కాస్సేపు మంచీ సెబ్బరా కులాసాగా మాట్లాడుకుంటాం. పోట్లాడుకోవాల్సిన విషయాలూ, సమస్యలూ లేవు; కంగారూ, గందరగోళం చెందాల్సినవీలేవు. యజమాని సేవచేయడమే మాకున్న పని. మనఃపూర్తిగా, శక్తివంచనలేకుండా పనిచేస్తాం. యజమానికి మావల్ల నష్టమేమీకలుగకుండా పనిచూచుకుపోతాం. ఇంటికి వచ్చేసరికన్నీ సిద్ధంగావుంటాయి. భోజనం, ఆహారపానీయాలు, శీతకాలం తొడుక్కునేందుకు ఉన్నికోటూ, కప్పుకోటానికి శాలువలు కూడా వున్నాయి. అవసరమైతే బొగ్గులూ, కట్టెలకూ కొదువేలేదు. మాట్లాడుకునేందుకు వలసినంత వ్యవధి. పరమార్థచింత, ఈశ్వరస్మరణ, వీటిని యీపరిస్థితుల్లోనే చేయగల్గినాము. యేభై యేళ్ళకి మాజీవితాల్లో సౌఖ్యం యిప్పుడు మాత్రమే రుచి చూస్తున్నామంటే నమ్మండి !

అందరూ నవ్వేరు. ఇలియాస్ గంభీరంగా,-

"అన్నలారా! నవ్వే మాటేముంది? ఇట్టిదే మానవజీవితం. మేమూ మూర్ఖులమే. మొదట్లో సంపదలు పోయినందుకేడ్చేము. ఈశ్వరుడు మాకు ఒక జీవితసత్యాన్ని వెల్లడిచేసేడు. ఆసత్యాన్నే మీకు చెపుతూన్నాం. మా ఆత్మ సంతృప్తికోసం గాదు, మీక్షేమాన్నికోరే చెపుతున్నాం." అన్నాడు.

"ఇవి సత్యవాక్కులు. ఇలియాస్ అనుభవం చాల గొప్పది; యదార్థమైనది కూడాను. పవిత్ర గ్రంథాల్లోకూడా యిట్లే వ్రాయబడి వుంది." అన్నాడు, గడ్డం సవిరించుకుంటూ, ముల్లా.

నావ్వాగిపోయింది; అందరూ దీర్ఘాలోచనలో పడ్డారు.

(రచన 1885)

# ఇరుగు పొరుగు.

"తరువాత పేతురు ప్రభువు దగ్గరికివచ్చి అడిగేడు: 'ప్రభూ! నాపొరుగువాడు నాకు హానిచేస్తూంటే యెన్నిసార్లని వాణ్ణి నేను క్షమించి ఊరుకోవాలి? ఏడుసార్లు కాస్తే చాలునా?' ప్రభువు, పేతురుతో యిట్లా జవాబిచ్చేడు: 'ఏడుసార్లేకాదు. ఏడుకి డెబ్భైరెట్ల పర్యాయాలు నీకితరులు చేసిన కీడును క్షమించాలి.' స్వర్గరాజ్యం కూడా భూమిమీది రాజ్యాలవంటిదే. ఒకరాజు తన సేవకుల లెక్కలన్నీ చూడాలని ప్రారంభించేడు. ఒకడు రాజుకి పదివేల దీనారాలు బాకీ పడినట్లు తేలింది. వాణ్ణి రాజుయెదుట హాజరు పెట్టేరు. కాని, అతనివద్ద యీబాకీ తీర్చుటకు సామర్థ్యం లేనందున, వాణ్ణే, భార్యాబిడ్డల్నీ బానిసలుగా విక్రయించి, డబ్బు జమకట్టించమని రాజు తన భటులకాజ్ఞనిచ్చేడు. ఆసేవకుడు రాజునెదుట మోకరిల్లి 'ప్రభూ! నన్ను కరుణించు. నీఋణం తీర్చుకుంటాను,' అని వేడుకొన్నాడు. రాజుకు సేవకునిపై దయ కలిగింది. అతని హృదయం కరిగి, సేవకుని మన్నించి, అతని బాకీ అంతా రద్దుచేసేడు. ఈసేవకుడు వెళ్ళి, తనకొక నూరురూకలు బాకీపడిన తోడిసేవకునొకణ్ణి పీక పట్టుకుని, తక్షణమే అప్పు తీర్చమనినిర్బంధించేడు. 'కొంచెం ఓపికపట్టు, అన్నా. నీబాకీ తీర్చేస్తా' నని ఆసేవకుడు ప్రాధేయపడ్డాడు. కాని, అతడూరుకోలేదు. బాకీదారుమీద వ్యాజ్యంవేసి, బాకీ పూర్తిగా చెల్లించేవరకూ ఖైదులో పెట్టించేడు. తోడి సేవకులీ సంగతంతా చూసి చాల విచారించేరు. జరిగిన విషయాన్ని తమ యజమానితో చెప్పుకున్నారు. అప్పుడు ప్రభువాసేవకుని పిలిపించి, ఆతనితో యిట్లా చెప్పేడు: 'ఓరి! దుర్మార్గుడా! నువ్వు వేడుకున్నందున నీవీయవలసిన బాకీనంతనూ రద్దుచేసేనుగదా? నేను నీమీద దయచూపినట్లే, నీతోటివానిమీద నువ్వు కరుణ చూపించవద్దూ? ఇట్లా వానిని మందలించి, తనబాకీ యావత్తూ తీర్చేవరకూ ఊరుకోవద్దని తన భటులకు ఆజ్ఞాపించేడు, ప్రభువు. మీరు హృదయపూర్వకంగా మీతోటి మానవుల తప్పుల్ని క్షమించకపోతే, మనకందరికీ ప్రభువైన నాతండ్రికూడా మీవిషయంలో అట్లే చేస్తాడు.

(మత్తయి. 18. 21–35.)

ఒకానొక గ్రామంలో ఇవాన్ షెర్బకోవ్ అనేరైతు వున్నాడు. అతడు వయసులో వున్నాడేమో, మాంచి బలంగావున్నాడు. గ్రామంలోకల్లా అతను మంచి పనివాడని పేరుంది. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్ద వానికి వివాహం అయి, కోడలు వచ్చింది. రెండోవానికి కాబోతూంది. మూడోవాడింకా కుర్రాడు. అతడు గుర్రాల్ని మేపుతూ, నాగలిపట్టడం యిప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాడు. ఇవాన్ భార్య చాల తెలివైనదీ, పొదుపరికూడా. పెద్దకోడలు నెమ్మదైనదీ, కష్టపడి పనిచేసేదీ. ఆకుటుం బంలో కంతకీ పనిచేయలేనిదీ, పోషించబడాల్సిందీ ఇవాన్ ముదుసలి తండ్రి ఒకడు మాత్రమే. ఆవృద్ధుడు ఏడేళ్ళనుంచీ ఉబ్బసవ్యాధితో మంచంపట్టి వున్నాడు. నెగడితిన్నె * మీదనుంచి లేవడమేలేదు. ఇవాన్‌కి ఏమీ లోటులేదు. మంద దండిగానే వుంది. మూడుగుర్రాలూ, ఓపిల్లా; ఆవూ—దూడా; పదిహేను గొర్రెలు; పాడికీ, పంటకీ ఏమీ లోపంలేదు. గుడ్డా గుడుసూ యింట్లో ఆడవాళ్లే కుట్టుకుంటారు. బూట్లూ, కాలిజోళ్లూ స్వయంగానే తయారు చేసుకుంటూ, పొలాల్లో పనీపాటూ చేసుకుంటూ, సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు. ఈయేటి పంట గాదుల్లోపోసి, ముంద టేడుదాకా వుంచుతారు. ఎప్పుడూ పాతధాన్యమే తిండం వాళ్లకి అల వాటు. పన్నులన్నీ ఓట్లు అమ్మితేనే చెల్లిపోతాయి. ఇవాన్ కుటుంబం సుఖశాంతులతో జీవనం గడిపి వుండేదే. కాని, కంచెఆవల కాపరమున్న కుంటిగేబ్రియల్ కుటుంబానికీ, ఇవాన్ కుటుంబానికీ పచ్చగడ్డి వేస్తే భగ్గు మనేలా వుంది.

గేబ్రియల్ తండ్రి జీవించివున్న రోజుల్లోమాట! అతడూ ఇవాన్ తండ్రీ ప్రాణస్నేహితులుగా వుండేవాళ్ళు. ఆడవాళ్లకి ఏజల్లెడో, రోకలో

* రష్యావంటి చలిదేశాల్లో ప్రతియింట్లోనూ ఒకమూల పెద్ద అగ్నిగుండం యిటుకలతో కడతారు. దానిమీద పెద్ద అరుగులాకట్టి వుంటుంది. వెచ్చదనానికి, ఆ నెగడితిన్నె మీద కూర్చుంటారు, పండుకుంటారు కూడా.

కావాలిస్తే యిస్తూ పుచ్చుకుంటూండేవాళ్ళు. మగాళ్లకు ఏనాగలో గింజలో కావలసినా ఒకరొకరికి సాయం చేసుకునే వాళ్ళు. ఇరుగూ పొరుగూ ఏక గర్భజనితుల్లా వుంటూంటే, రోజులు సుఖంగా వెళ్లిపోయేవి. ఎప్పుడేనా ఏఆవో దూడో గనక పొరుగువారి చేలోపడి పంట పాడుచేసినా, కొట్టా ములోపడి ధాన్యం తినేసినా బైటికి తోలేసి, యజమానితో చెప్పేవాళు. "అన్నా! రాత్రి మీదూడ కొట్టాములో పడిందయ్యా! ఇంకా ధాన్యం ఒబ్బిడి చేసుకోలేదు, కొంచెం జాగ్రత్తగా ఉంచుమా!" అనే వారేగాని, ఆనోరులేని జంతువుల్ని బందెలదొడ్డికి తోలడం, చావబాది కట్టేయడం, గోరంతలు కొండంతలుచేసి ప్రచారం చేయడం, పితూరీలు, చాడీలు చెప్పడం,- యిత్యాదులు ఆరోజుల్లో యెరుగనే యెరగరు.

అదంతా వెనకటి సంగతి. ముసలివాళ్లు మూలబడిన తర్వాత కొడుకుల హయాం వచ్చింది. రోజులు మారిపోయేయి.

నిర్మలాకాశంనుంచి పిడుగుపడ్డట్టు యీతగువులూ అవీ ఊరికే పుట్టుకొచ్చిందంటే నమ్మండి.

ఇవాన్ కోడలు పెంచుతూన్న కోడిపెట్ట ఋతువుకు ముందుగానే గ్రుడ్లు పెట్టనారంభించింది. ఈస్టరుకు ముందు 'హోలీవీక్' (పవిత్రవారం) లోనే కోడి రోజూ ఏమూలో గ్రుడ్లెడుతూంది. తరుచుగా గాదెక్రింది బండిపెట్టెలోనే రోజూ ఒక్కొక్క గ్రుడ్డు కనిపిస్తూంది. ఓరోజున పిల్లలు బెదరించారో ఏమో, కోడి కంచెమీదినుంచి యెగిరివెళ్ళి, గేబ్రియల్ పెరట్లో గ్రుడ్డుపెట్టింది. కోడలు విన్నది, కోడి అరవడం. ఈస్టరు పండుగకి యిల్లు శుభ్రపరచి అలంకరించే తొందరలో ఆమె, తర్వాత పోయి గ్రుడ్డుతెచ్చి జాగ్రత్త పెట్టవచ్చులే అని ఉపేక్షచేసి వూరుకుంది. ఆసాయంత్రమే కాస్త చెయ్యి తెరిపి చేసుకున్నాక, గాదెక్రింద పెట్టెలో గ్రుడ్డు కోసం చూసింది,కోడలు. కనిపించలేదు. మామనూ, మరదల్నీ, అడిగింది. గ్రుడ్డు తీసి, జాగ్రత్తపెట్టేరేమోనని. తామెవ్వరమూ తీయలే

దన్నారు. వాళ్లు. చిన్నమరిది తారాస్ అన్నాడు, "ఒదినా! ప్రక్కదొడ్లో కోడి అరచిందమ్మా. నేవిన్నాను. తర్వాతే మన దొడ్లోకి యెగిరివచ్చింది." కోడలు వెళ్ళింది, పెట్టను చూడ్డానికి. పుంజుదగ్గిరే నేలమీద కూర్చుని, కళ్లుసగం మూసుకుని, సగం నిద్రలోవున్నట్టుగావుంది, పెట్ట. గ్రుడ్డును తానెక్కడపెట్టిందో చెప్పలేదుకదా, పాపం, అది దాన్నడిగితేమాత్రం లాభమేమిటి? అందుకని పొరుగువాళ్ళింటికివెళ్ళింది, కోడలు, గ్రుడ్డు సంగతి తెలుసుకొందామని.

పొరుగింటికోడలు రావడంచూసి, ముసిల్దిబైటకివచ్చింది.

"ఏమే! మనవరాలా! యిట్లావచ్చేవు?"

"నా పెట్ట మీ దొడ్లోకి యెగిరివచ్చిందవ్వా! ఈవేళప్రొద్దున్నే. దొడ్లో యేమూలేనా గ్రుడ్డుపెట్టిందేమో చూసిపోదామనివచ్చా."

"మేం దాన్ని చూడనేలేదే, తల్లీ! దేవుడిదయవల్ల మాకోళ్లే కావలసినన్నిగ్రుడ్లు పెడుతున్నాయి. ఇతరుల గ్రుడ్లకోసం మేమేమీ కక్కుర్తిపడక్కర్లేదు. ఇరుగుపొరుగిళ్ళలో గ్రుడ్లకోసం అడుక్కుంటూ పోవాల్సినగతి మాకేంపట్టలేదే, మాయమ్మా!" అంటూ ముసిల్ది సాగ తీసుకుంది.

ఇవాన్ కోడలికి కూడ కోపంవచ్చి, చురుగ్గా సమాధానం యిచ్చింది. ముసిల్ది ధిక్కారంగా యెత్తిపొడిచింది. దాంతో రగులుకుంది, యుద్ధం. ఇద్దరూ తిట్టుకుంటూండగానే, నీళ్ళబిందె పట్టుకెడుతూన్న యివాన్‌భార్య విని, తానూ కోడలికి సాయం వచ్చింది. గేబ్రియల్ భార్య యింట్లో పని చేసుకుంటూన్నది, పనట్లా ఒదిలేసి, బారలుజాస్తూ బైటికి వచ్చింది. ఏనాడో జరిగిన సంగతులూ, జరగని సంగతులూ కూడా ఉభయపక్షాలూ ఉటకరిస్తూన్నాయి. వాగ్బాణాలు పుంఖానుపుంఖాలుగా ప్రయోగింపతున్నారు. యుద్ధం కొంచెం సేపట్లోనే తీవ్రతరం అయింది.

గొంతులు బొంగురు పోయినా, యెవరూ అరవటం మానరు. రెండో వాళ్లు చెప్పేది వినబడకుండా, పైకైనన్ని యెక్కువమాటలు ప్రయోగించాలనే ఆదుర్దాతో వున్నారు. ప్రతిఒక్క మాటాకూడా తిట్టో, బూతో అయి యెదటివాళ్ళని ఎంతగాయపర్చగలుగుతుందా అనే ప్రతి ఒక్కతే ఆలోచిస్తూంది.

"ఓసీ రండా!—పులుగులంజా!—దొంగముండా!—వరదూ!—ముసలితడికా!—నీమామని తిండిపెట్టక చంపేవు కాదుటే?—గొడ్డెదుసాని బదులుపుచ్చుకుని యిచ్చేరానన్నావు కాదుటే!—" యిదీ వరస.

"ఓసి పుష్టిముండా! నువ్వు మాజల్లెడ దొంగిలించేవు కాదుటే! మాలోకరి ఆడిగి తీసికెళ్లేవు. యిచ్చేయి, తక్షణమే!"

ఎవరో రోకలి పైటకి తెచ్చేరు. అది పట్టుకుని గెంటడం, లాగడం, తోపులాట ప్రారంభమైంది. భుజంమీది బిందెలోని నీళ్లు చింది, అందరి బట్టలూ తడిసేయి. ఒకరినొకరు రక్కుకోడం, బట్టలు చింపుకోడం, జుట్టుపీకడం, దెబ్బలాట మొదలైంది. పొలంనుంచి వస్తూన్న గేబ్రియల్ తన భార్యకి సాయం వచ్చేడు. ఆపళంగా యివానూ, కొడుకూ యిహ వూరుకోకూడదని రంగంమీదికి ఒక్క ఉరుకున వచ్చేరు. అందరూ ఒకరిమీద ఒకరు కట్టకట్టుకుని క్రిందామీదా పడుతూన్నారు. ఇవాన్ మాంచి బలంగలవాడేమో కొంచెం సేపట్లోనే అందర్నీ యిటూ అటూ త్రోసేసి, గేబ్రియల్ గడ్డం లంకించుకుని, ఓగుప్పెడైతే పీకేసేడు. అప్పటికి జనం పోగై, బహు కష్టంమీద అందర్నీ విడదీయగల్గేరు.

అసలు యీ రెండు కుటుంబాలకీ స్పర్ధలు పెరిగిన, కథయిదీ. గేబ్రియల్ తెగిపోయిన తన గడ్డపు వెంట్రుకల్ని జాగ్రత్తగా కాగితంలో చుట్టి, పట్నానికి వెళ్లి క్రిమినల్ కోర్టులో చార్జీ పడేసి వచ్చేడు.

"నేను గడ్డం పెంచుకున్నది, యీరౌడీ వెధవలచేత పీకించుకు నేందుకా ? వీణ్ణి పాతించేస్తా, చూడండి !" అనేవాడందరితోనూ. గ్రేవి యల్ భార్య యిరుగు పొరుగు వాళ్లతో బడాయిగా, "ఇవాన్‌కి శిక్ష వేయించి, సైబీరియాకి పంపించకపోతే. నాపేరు మారుపేరెట్టండి !" అంటూ సాగించింది. ఈరీతిగా రెండుప్రక్కలా ద్వేషాగ్ని రాజుకుంటూ, జ్వాలగా పెరిగింది.

ఇవాన్ తండ్రి మొదటినుంచీ మందలిస్తూనే వున్నాడు, "పోట్లా టలు మరిచిపోయి, కలిసికట్టుగా వుండండని. కాని, ముసలాడి మాటలు వినేవాళ్లెవరు ?

"ఒరే నాయనా ! మీరు చేసేదేమీబాగులేదురా ! ఏదో చిన్న విషయంకోసం యింతగా కావేషీలు పెంచుకుంటార్రా ? ఆలోచించండి ; వెధపది. ఒక్క గ్రుడ్డుకోసంకాదూ, యీపోట్లాటంతానూ ? పోనీ, కుర్రగాళ్లెవరో గ్రుడ్డు తీసేరనే అందాము. ఈశ్వరుడు వాళ్లకి తరిగని సంపద లిచ్చుగాక ! ఒక్క గ్రుడ్డులో పోయిందేమిటి ? ఈశ్వరుడు మనకు చాలినంత యిస్తూనే వున్నాడాయె. వాళ్లు నిన్ను తిట్టేరుగాదూ ? వాళ్లకి మంచిగా మాట్లాడేవిధం నువ్వు చెప్పాలి. నువ్వేం తక్కువ చేసేవు ? తిట్టుకి తిట్టు సమాధానమట్రా ! ఒకరినొకరు తిట్టుకున్నారు, చివరకి కొట్టుకున్నారు. ఇంక జరగాల్సిందేమిటి ? ఏవో పొరపాటునో గ్రహపాటునో యిల్లాంటివి వస్తూనే వుంటాయి. తప్పుచేయడం మానవ సహజం. ఇప్పటికేనా మించిపోయిందేమీలేదు. వెళ్ళు. జరిగింది మరిచి పోయి, క్షమించమని అడుగు. పోట్లాటలూ, కక్షలూ పెంచుకుంటే యిద్దరూ పాడైపోతారు సుమా, నామాట వినండి."

పడుచువాళ్లా మాటలు వింటేరమా ? ముసలాడు ఏదో మతిపోయి వాగుతూన్నాడనీ, చాదస్తాలయిడిగి పిరికి మందు పోస్తూన్నాడనీ వాళ్లు అనుకున్నారు.

ఇవాన్ పొరుగింటివాణ్ణి క్షమార్పణ అడగనేలేదు.

"నేను గేబ్రియల్ గడ్డం తెంపనేలేదు. వాడే తెంపుకుని, నామీద వేస్తున్నాడు. పైగా వాడికొడుకే నాగుండీలు తెంపేసి, చొక్కా అంతా చింపేశాడు. ఇదిగో! చూడండి!" అంటూ అందరికీ చూపించేడు, ఇవాన్. జిల్లాకోర్టులోనూ, పంచాయితీలోనూ కూడా గేబ్రియల్‌మీద ఫిర్యాదులు చేసేడు. అవి విచారణ అవుతున్నాయి. ఆరోజుల్లోనే గేబ్రియిల్ బండీ చాయమేకులూ, చీలలూ యెవరో తొలగించి తీసుకుపోయేరు. ఇవాన్ కొడుకే ఆపనిచేసి వుంటాడన్నారు. గేబ్రియల్ యింటివాళ్లు. "వాడు నిన్నరాత్రి తక్కుతూ తారుతూ మాగోడప్రక్కనే బండిదగ్గిరికి వెళుతూంటే చూసేము. ఎదటింటివాళ్ళు చెప్పేరు కూడానూ, వాడు చీలల్ని సారాదుకాణందగ్గిర అమ్మచూపేడని."

మళ్లీ యీచోరీకేసు కోర్టులో ఫైలయింది. ఇంటిదగ్గరా రోజూ తిట్లాటో, పోట్లాటో లేని రోజేలేదు. పెద్దలచాయనే పిల్లలుకూడా అస్తమానం కొట్లాడుకుంటూనే వున్నారు. రోజూ ఊరి స్త్రీలందరూ నదికి బట్టలుతుకపోయే సమయాల్లో ఆడవాళ్లొకరినొకరు యెత్తి పొడుచుకుంటూ, దూషించుకుంటూండేవాళ్ళు. బట్టల దురద తీరకపోయినా నాలిక దురదతీరేది.

మొదట్లో మొగవాళ్లు ఉత్తినే అబద్ధపు నేరారోపణలేచేస్తున్నా, క్రమేణా అవకాశం దొరికినపుడెల్లా ఒకరొకరి వస్తువుల్ని చేతికి దొరికించుకుని మాయం చేస్తూండేవాళ్లు. ఆడవాళ్లకీ, పిల్లలికీ కూడ ఈ దొంగపనులే చెప్పి, నేర్పిపెట్టేరు. ఆరెండు కుటుంబాల జీవితాలూ దుర్భరం కాజొచ్చేయి. ప్రతిదానికీ పోట్లాడుకోవడమూ, చీటికీ మాటికీ పంచాయితీల దగ్గిరా, బెంచిమేజస్ట్రీటు కోర్టులోనూ, జిల్లాకోర్టులోనూ ఛార్జీలు, దావాలూ, జడ్జీలకికూడా ప్రాణం విసిగిపోయింది. ఒక్కొక్కసారి గేబ్రియల్‌కి జుల్మానాపడేది. ఒకటి రెండు రోజులు ఖైదుశిక్ష పడేది. ఇంకోసారి

ఇవాన్‌కీ జుల్మానాలూ, ఖైదూ పడేవి. ఒకరొకరికి అపకారం హెచ్చుగా చేసుకొంటూన్నకొద్దీ వాళ్ళ కోపావేశాలు పెచ్చుపెరిగిపోయివి. చూసేరు కదూ, కుక్కలపోట్లాట! పోట్లాటపెరిగి కరుచుకున్నకొద్దీ వాటికి రోషావేశాలూ, క్రౌర్యం హెచ్చుతూంటాయి. వెనకనుంచి కుక్కను ఎవరు కొట్టినా ఆయెదటికుక్కే అని తలచి, మరింత కోపంగా కరుస్తుంది. వీళ్లూ సరిగా అదేమోస్తరు. జుల్మానాయో, ఖైదో విధించబడినపుడు వాళ్లు మండిపోయేవాళ్లు. "ఆగరా, తొందరపడకు! నీబాకీ తీరుస్తానులే!" అని ధిక్కరించుకునేవాళ్లు, ఒకరొకర్ని. ఈవిధంగా ఆరు సంవత్సరాలు గడిచేయి.

నెగడితిన్నెమీద పడుకునివుండే, యివాన్ తండ్రి మందలిస్తూ వుండేవాడు, పోట్లాటలు మానమని.

"నాయనా! యేంచేస్తున్నార్రా! పోట్లాటలు మాని, సుఖంగా వుండలేరురా? మీపనేదో చూసుకుంటే ఎంత లాభం! ద్వేషం, అసూయ మీమనస్సులోంచి పారద్రోలండిరా, ఎంతోశాంతి లభిస్తుంది. కోపం పెంచినగొద్దీ, తన్ను పెంచినవాణ్ణే దహిస్తుందని తెలియదూ? అందర్నీ నాశంచేసే యీ వైరాలు మానండి. నాయనా!"

అయితే ముసలాడిమాట వినిపించుకున్నవాడే లేడు.

ఆరేళ్ల గడిచి యేడో సంవత్సరం వచ్చింది. ఆగ్రామంలో జరుగుతూన్న పెళ్ళి సందర్భంలో అందరూ చేరి వున్నప్పుడు ఇవాన్ కోడలు అనవసరంగానే రేపెట్టి, గేబ్రియల్ గుర్రాల్ని దొంగిలిస్తూంటే పట్టుపడ్డాడని అతన్ని అవమానపరిచింది.

విందులో త్రాగి వున్నాడేమో, గేబ్రియల్ ఆత్మసంయమనం చేసుకోలేకపోయేడు. ఆమెను ఊచి పుచ్చుకుని కొట్టేసరికి గిర్రున తిరిగి పడిపోయింది. వారం రోజులదాకా లేవనేలేదు. అప్పటికి ఆమె గర్భిణీ.

ఇవాన్‌కి కోడలు మంచం పట్టినందుకు విచారం లేకపోగా గేబ్రియల్‌ను ఖైదుకి పంపవచ్చునని సంతోషమే కలిగింది. వెంటనే మేజిస్ట్రేట్ దగ్గిర కాగితం పారేశాడు. "ఈదెబ్బతో గేబ్రియల్‌పని తీరిపోతుంది. వాణ్ణి సైబీరియాకి పంపకపోతే నాపేరు........" కాని, పాపం. యివాన్ కోరిక నెరవేరలేదు. మేజస్ట్రీటు యీపిటిషన్‌ను అంగీకరించలేదు. డాక్టరు పరీక్ష చేయిస్తే దెబ్బలేమీ కనిపించలేదు. ఆనవాళ్లూ లేవు. అప్పటికే ఆమె లేచి తిరుగుతూంది కూడా. దానిమీద బెంచికోర్టుకు వెళ్లేడు, ఇవాన్. బెంచి మేజస్ట్రీటు యీకేసును జిల్లాకోర్టికి పంపించేసి, తన బాధ్యత వదల్చుకున్నారు. ఈసారి యివాన్ మాంచి పకడ్బందీగా యేర్పాట్లు చేసుకున్నాడు. పెద్ద గుమస్తాకి, క్రిమినల్ బ్రాంచి గుమాస్తాకీ కూడా మాంచి ఒకటోరకం సారాయి గాలనున్నర పంపించేసేడు, యినాంగా. న్యాయం యింక జరగకేంచేస్తుంది? గేబ్రియల్‌కి కొరడాదెబ్బల శిక్షపడింది. ఆరోజు కోర్టులో గేబ్రియల్ శిక్షను చదివి వినిపించేడు, గుమాస్తా: "కోర్టువారు గేబ్రియల్ కార్డీవ్ అనే ముద్దాయిని దోషిగా నిర్ణయిస్తూ, యిరవై కొరడాదెబ్బలు విధిస్తున్నారు. ఈశిక్ష కోర్టువారి యెదటనే అమలు జరుపబడుతుంది."

గేబ్రియల్ యీతీర్పును వినడంతోనే యెట్లా వుంటాడా అని ఇవాన్ అతనివైపు చూసేడు. గేబ్రియల్ చివరకంటా తీర్పు విన్నాడు; అతని ముఖం కాగితంలా తెల్లనై పోయింది. చటుక్కున ప్రక్కకి తిరిగి బైటిహాలులోకి నడిచిపోతూంటే, ఇవానూ బైటికి పోదామని బైలుదేరేడు, తన గుర్రాన్ని చూసుకోడానికి. కోపంతో వణుకుతూ గేబ్రియల్ అంటున్నాడు. "నావీపుమీద కొరడాతో కొడతారు. మంట పుడుతుంది. ఈమంటలు యిక్కడితో ఆరిపోవని గుర్తుంచుకోనీ, వాణ్ణి! వాడివేవో మంటల కాహుతి అయేరోజు అట్టే దూరంలేదు."

ఈమాటలు వింటూనే ఇవాన్ వెనకతిరిగి కోర్టువారి దగ్గరికి పరి

గెత్తేడు. "మహాప్రభో! న్యాయమూర్తులు! గేబ్రియల్ నాకొంపకి చిచ్చు పెడతానంటున్నాడు. సాక్షులుకూడా వున్నారు. రక్షించాలి, బాబూ!"

జడ్జీలు గేబ్రియల్‌ను వెనక్కి పిలిపించేరు.

"నీవు అతని యింటికి చిచ్చు పెడతానన్నావా?"

"నేనేమీ అననేలేదు. కొట్టించండి, నన్ను! మీచేతుల్లోవుంది, అధికారం. నేనేమీ నేరం చేయలేదు. అయినా శిక్ష ననుభవించాల్సి వచ్చింది. అతనికో! ఏంచేసినా, చెప్పినా చెల్లుతూంది!" అన్నాడు. గేబ్రియల్. ఇంకా యేదో చెప్పబోతూన్నాడు. ముఖం యెర్రబడింది. పెదిమలు విల్లులావంగి, అదరుతూన్నాయి. కోపం, దుఃఖం, పరాభవాలతో విరూపమైపోయిన ముఖం త్రిప్పుకున్నాడు, గేబ్రియల్. అతని ముఖం చూసి అసెసర్‌లుకూడా ఉలిక్కిపడ్డారు. "వీడు ఏదో ఘాతచేసే టట్టే వున్నాడు. తనకో, యివాన్‌కో!" అని వాళ్ళందరికీ తట్టింది.

జడ్జీల్లో వృద్ధుడొకడున్నాడు. అతడు యీతగువును అంతం చేయాలని, "ఏమయ్యా; మీరిద్దరూ వినండి. ఏదో రాజీపడుకోండి. గేబ్రియల్! నీవు చేసింది మంచిపనే అనుకుంటున్నావా? గర్భంతోవున్న ఆడదాన్ని చెయ్యిచేసుకుంటావా? ఈశ్వరానుగ్రహం వుందిగనుక సరిపోయింది కాని లేకపోతే యెంత ప్రమాదం! తెలిసిందా? నామాటవిని, తప్పు ఒప్పుకుని క్షమార్పణ వేడుకో. ఇవాన్ క్షమిస్తాడు. మీరిద్దరూ రాజీ పడితే. తీర్పును సవరించడం, మాచేతిలో పని!" అన్నాడు.

అదివినకే చెయ్యి తడిబన పెద్ద గుమాస్తా వింటూనే "అది అసంభవం, అయ్యా! 117 రూలు ప్రకారంగా; ఫిర్యాదీ, ముద్దాయీలు రాజీపడలేదుగాన తీర్పును అమల్లో పెట్టించడం కోర్టువారి పని." అని ఎత్తుకున్నాడు.

వృద్ధ జడ్జీ ఈతడిమాటలు లక్ష్యపెట్టలేదు. "ఏమయ్యా! గుమాస్తా! నువ్వు అవసరం లేనిదే మాట్లాడకు. మనం జ్ఞాపకం పెట్టుకోవాల్సింది, యీదూల్సుకావు. మానవులంతా సోదరభావంతో మెలగాల్సిందని ఈశ్వర శాసనం. అదొక్కటే మనం యెల్లప్పుడూ శిరసావహించ వలసింది." ఇవాన్, గేబ్రియిల్,-యిద్దరితో మాట్లాడినా ప్రయోజనం లేకపోయింది. గేబ్రియల్ అందుకుని ;

"నాకు యాభై వచ్చేయి. కొడుకు పెద్దవాడైనాడు. కోడలుకూడా వచ్చింది. నాజీవితంలో యిప్పటివరకూ దెబ్బలశిక్ష పేరే వినలేదు. ఈనాటికి, యివాన్, వాడిపేరు ఉచ్చరిస్తేనే పాపం చుట్టుకుంటుంది.- వాడి మూలంగానే నాకీ అవమానం తటస్థించింది. ఇప్పుడు వాణ్ణి, నేను క్షమాపణ వేడుకోవాలా! బాగానేవుంది. చాలు. ఇహ చాలు! నేనూ వాడికి బాగా జ్ఞాపకం వుండేలా చేయగలను!"

అంటూంటే గేబ్రియల్ కంఠం రుద్ధమైపోయింది. ఇంకేమాటలూ అతని కంఠంలోంచి పెగిలిరాలేదు. మొహం వెనక్కి త్రిప్పేసుకుని, గేబ్రియల్ బైటికి వెళ్ళిపోయేడు.

జిల్లాకోర్టుకీ, ఆగ్రామానికీ ఏడుమైళ్ళుంటుంది. కోర్టునుంచి ఇవాన్ యింటికి చేరుకునేటప్పటికి చాల ప్రొద్దుపోయింది. ఇంటిలోని ఆడవాళ్ల పశువుల్ని పాలుతీయడానికి వెళ్ళి వుండడంచేత యివాన్ గుర్రాన్ని జీను విప్పి, కొట్టాంలో కట్టేశాడు. కాస్త గడ్డి దాని ముందరపడేసి, ఇంట్లోకి వెళ్లేడు. ఆడవాళ్లు ఆవుల దగ్గిరికి పోయేరు, పిల్లలింకా పొలాలనుంచి యింటికి రాలేదు. ఇల్లు బావురుమంటూన్నట్లుంది. ఒక్కడూ బెంచీమీద కూలబడి, ఆలోచించుతూ కూర్చున్నాడు. ఆరోజు జరిగినదంతా అతని కళ్ళముందర ప్రత్యక్షమవుతూంది. శిక్షను చదివి వినిపించినప్పుడు గేబ్రియల్ ముఖం రక్తహీనంగావడం, అతను ముఖం గోడవైపు

త్రిప్పేసుకోడం, అతని కంఠం రుద్ధంకావడం,-అన్నీ గుర్తుకొచ్చేయి. మనస్సు కలచినట్లైంది. తనకే కొరడాదెబ్బల శిక్ష విధించబడినట్లైతే తన మనస్సెంత బాధపడేదో ఊహించుకోసాగేడు. గేబ్రియల్ అంటే సాను భూతి, విచారం అతని మనస్సును ద్రవీభూతం చేయసాగేయి.

ఇవాన్ తండ్రి దగ్గుతూ నెగడితిన్నెమీదనే లేచి కూర్చుని, కాళ్లు క్రిందికి వ్రేలాడవైచి, మెల్లిగా దిగేడు. తూలుతూ నడిచి, ఇవాన్‌కి దగ్గరలోనే ఓబెంచీమీద చతికిలపడ్డాడు. ఆమాత్రం ప్రయత్నానికే ఆవృద్ధుడు తాళలేక, దగ్గడం ప్రారంభించేడు. దగ్గు తెరఊపేసింది. కొంచెం సేపటిలోనే తేరుకొని, ఊపిరి తిప్పుకున్నాడు. టేబిలుమీద చేతినుంచి, ఆనుకుని, "ఏంరా! నాయనా! వచ్చేవేం? ఏమైంది?" అన్నాడు.

"ఆ! యిరవై కొరడాదెబ్బలు శిక్ష!"

వృద్ధుడు శిరఃకంపనంతో అన్నాడు. "ఇవాన్! నీవు చేస్తున్నది, తప్పు. దానికి ప్రతిఫలం చెడుగే అనుభవిస్తావు సుమీ! శిక్షననుభవించేది గేబ్రియల్ కాదు నువ్వే. నీకు నువ్వే అపకారం చేసుకుంటున్నావు. సరే, వాళ్ళు గేబ్రియల్‌ను కొట్టేరే అనుకో! అతని దుఃఖం, అవమానం నిన్ను సుఖవంతునిగా చేస్తున్నాయా?"

"వాడల్లాంటిపని యీజన్మలో మళ్లీ చెయ్యడు!" అన్నాడు, ఇవాన్.

"ఏం? వాడు, నీకంటె చెడ్డపని చేసేడా? చెప్పు!"

ఇవాన్‌కి కోపం వస్తూంది. "ఏంచేశాడా? తెలియదు? ఓపలేని ఆడదాన్ని చావకొట్టేడు! పైపెచ్చు నాకొంప తగలబెడతానన్నాడు! మహా మంచిపని చేశావురా, నాయనా! అని వాడికి దండంపెట్టి రానా?"

వృద్ధుడు ఒక్క నిట్టూర్పు విడిచి అన్నాడు: "ఒరే నాయనా! నేను యేడేళ్ళుగా మూలబడివున్నా. నువ్వు యీవిశాల ప్రపంచంఅంతా

తిరుగుతూన్నావు. చూస్తూన్నావు. అందుచే నీకు అంతా తెలుసుననీ, నాకేమి తెలియదనీ అనుకుంటున్నావు గదూ? ఎంత పొరబాటు? నాయనా! ఇవాన్! నీకు తెలియడంలేదు. క్రోధం నీకళ్లకి పొరలు కప్పింది. చెవులకు తాళాలు వేసిందోయ్! ఇతరుల్లోని తప్పులు నీకళ్ళకెదురుగా కనిపిస్తాయి. మరి, నీవో? నువ్వు చేసేవన్నీ కప్పిపుచ్చుకుని, సమర్థించు కుంటావ్. ఎంతసేపూ, నీవనేదేమిటి? వాడు తప్పుచేశాడనేకదా? పోనీ వయ్యా, అల్లాగే ఒప్పుకుందాం. వాడొక్కడే తప్పు చేసేవాడైతే, ప్రపంచంలో యీ చెడుగింతగా ఎందుకుంటుంది? ద్వేషం, వైరం ఎప్పుడూ ఒక్కనివల్లనే పుట్టవు. రెండుచేతులూ కలవకపోతే చప్పుడు పుట్టదు. చెడుగుకూడా అట్లాగే ఒక్కనివల్ల యెప్పుడూ కాదు. ఇద్దరుంటేనే అది విజృంభిస్తుంది. నీకు అతని తప్పులే కనిపిస్తాయి. నీవు చేసేవి కనిపించవు. వాడొక్కడే తప్పుకు మనిషైతే యింతవరకూ రాకనేపోను. గేబ్రియల్ గడ్డం తెంపినదెవరు? వాడి గడ్డి దొంగిలించినదెవరు? వాణ్ణి కోర్టులమ్మట త్రిప్పుతూన్నదెవరూ? అంతకీ వాడే కారణమని నువ్వంటావు, యిప్పుడు! నీవు చెడుపనులు చేయడమే, చెడుగా ఆలోచించడమే, అన్ని చెడుగులకూ మూలంకదూ? నేనేమీ యీమాదిరిగా జీవించలేదు; నీకిట్లా చెయ్యమని నేర్పనూలేదు. గేబ్రియల్ తండ్రీ, నేనూ యిట్లాగే కాలం గడిపేమూ? ఇరుగుపొరుగు యెల్లా జీవించాలో అల్లాగే జీవించేము, మేము! వాళ్లింట్లో గోధుమపిండి నిండుకుంటే అతని భార్య వచ్చి అనేది: "బాబూ! పిండి నిండుకుంది. కొంచెం గోధుమపిండి కావాలి." నేనేమనేవాణ్ణి: "అయ్యోతల్లీ! ఈమాత్రానికేనా. అదిగో! ఆమిద్దెమీది గాబులోవుంది. నీకు కావలసింది తీసికెళ్ళు, అమ్మా!" "అంతే. గుర్రాల్ని పొలానికి తోలడానికెవరూ వుండకపోతే నన్నే పంపేవాణ్ణి!" "వాన్యా! యిదుగో వాళ్ల గుర్రాల్ని తోలికెళ్ళి అప్పగించిరా." నాకేదైనా అవసరం వుంటే సరాసరి వెళ్లడం "ఏం! తమ్ముడా! గార్డే!

నాకిది కావాలోయ్!" "దానికేం, అన్నా! ఫ్రోల్! నీకు కావలసింది తీసికో! "ఇదీ అప్పటితీరు. మీరూ అంత ఐకమత్యంతోనూ సుఖంగా జీవించగలిగేవాళ్లు. అయితే మీరు చేసినదేమిటి? నిన్న యిక్కడ ప్లెవ్నా * యుద్ధాన్ని గూర్చి యెవరో ఒక సైనికుడు మాట్లాడుతూ న్నాడు. మీయిద్దరిమధ్యా యిప్పుడా ప్లెవ్నాకంటె పెద్ద యుద్ధమే జరుగు తూంది. ఇదేనా మానవజీవితం? ఇదేనా పరమార్థం? నీవీయింటికి యజ మానివి, నువ్వే అధిపతివిక్కడ. నువ్వు నీయింట్లోని పిల్లలకూ, ఆడ వాళ్ళకూ నేర్పుతూన్నదేమిటి? నోటికొచ్చినట్లు వదరమనీ, యితరుల్ని ద్వేషించమనీనా? మొన్నను తారాస్కా, గుంటడు, వాళ్ళ అరీనాను బూతులు తిడుతూంటే, వాడితల్లి చూస్తూ, వింటూ నవ్వుతూంది. అది మంచిపనేనా? దీనికంతకీ నువ్వే బాధ్యుడివి. యిహం, పరం రెండూ చూచుకో! ఆత్మోన్నత్యం అక్కర్లేదూ? నువ్వొకటంటే నేను రెండు మాటలు సమాధానం చెప్పనా? నువ్వొకటి కోడితే నేనూ రెండు తగల నీయనా, నాయనా! క్రీస్తుప్రభువు భూమిమీద అవతరించి బోధించిందే మిటి? మనబోటి పాపులకి, అందరు మానవులకి ఆయన ఉపదేశించిన దిదేనా? నిన్నెవరేనా చెడుగా మాట్లాడితే తిరిగి సమాధానం యివ్వవద్దు. అతడి అంతరాత్మే బాధిస్తుందాతణ్ణి, ఎవరైనా నిన్ను ఒక చెంపకొడితే రెండోచెంప చూపించు. "శిక్షార్హుడనే అయితే యిదిగో! రెండో చెంప. కొట్టు! అంతే!" అతడే సిగ్గుపడిపోతాడు. నీముందర వినీతుడౌతాడు. క్రీస్తుప్రభువు బోధించిందిది! అంతే కాని, నిన్ను కూడా కయ్యానికి తయారుకమ్మని కాదు. ఏం? మాట్లాడవేం? నేచెప్పింది బాగావుందా?"

ఇవాన్ అంతావిని, ఊరుకున్నాడు. ముసలివాడికి దగ్గు తెరవచ్చి, ఉక్కిరిబిక్కిరిచేసింది. కొంత సేపటికి తెప్పరిల్లి ఊపిరి తిప్పుకుని, మళ్లీ మాట్లాడడం ప్రారంభించేడు.

---

* బల్గేరియాలోని యీ పట్టణంవద్దర 1877 లో రష్యన్లకూ, టర్కులకూ మహా భయంకర యుద్ధం జరిగింది.

"ఏం! యివాన్! జీసస్ ప్రభువు చెప్పిందాంట్లో తప్పు ఏమైనా వుందా? ఆయన చెప్పినదంతా మన క్షేమానికే. పరలోకందాకా ఏందుకూ? ఈలోకంలోనే చూడు. మీరు యీ తగూలాటలు ప్రారంభించేక నీప్రాణం సుఖంగా వుందా, అంతకిపూర్వమా? ఈకోర్టుల్లో ఎంత డబ్బింతవరకూ ఖర్చైందో లెక్క చూచుకో? పట్టణంలో హోటళ్లకీ, ప్రయాణాలకీ, వాడుగులకీ ఎంతవుతూంది! నీకొడుకులేమో పెరిగి పెద్దవాళ్ళయేరు. వాళ్లూ సంపాదిస్తుంటే, నీవు సుఖసంపదలతో వుండాల్సిందే కామా? అయితే యీరోజున నీస్థితేమిటి? నీసొమ్మంతా ఏమయింది? ఇంతకీ కారణం? ఒకటే! నీగర్వం! అహంభావం! నువ్వూ, కొడుకులూ పొలాలు దున్ని, పైర్లూ పంటలూ వేయాల్సిందిపోయి, వాళ్ళని వెంటేసుకుని పొరుగువాణ్ణి యేడిపించడానికై కోర్టులమ్మటా, ప్లీడర్ల దగ్గిరికీ కాలికి బలపం కట్టుకుని తిరుగుతున్నావు! అదునుకి దున్నక, విత్తక వుంటే, భూదేవి మాత్రం మన్ని దయచూస్తుందా? ఈయేడు ఓట్లు ఎందుకని పండలేదు? ఎప్పుడు విత్తులు చల్లేవు, జ్ఞాపకంలేదూ? పట్నానుంచి నువ్వెప్పుడూ వస్తే? ఈఛార్జీవల్ల నువ్వు పొందిన ప్రయోజనం ఏముంది? మరింత నాలుగు చూరులూ అంటుకున్నాయంతేనా? నువ్వూ, కొడుకులూ ఒకరి జోలికి పోకండా పొలంపని చూసుకుంటూ, సంసారం చూసుకుంటూంటే, ఒకవేళ యెవడైనా నీకపకారం చేసినా, ఈశ్వరుని సాక్షిగా వానిని క్షమించివుంటే అప్పుడు నీవు ఎంత సుఖపడగల్గేవాడివి! నీమనస్సుకి ఎంత శాంతీ, సౌఖ్యమూ, సంతృప్తీ కలిగేవి!"

ఇవాన్ యేమీ మాట్లాడలేదు.

"నాయనా! వాన్యా! నేను ముసిలివాణ్ణయేను. వెళ్లు. మన యెర్ర గుర్రాన్ని జీనువేసి, పరుగున శీఘ్రంగా కోర్టుకి వెళ్లు. ఈకేసు, వ్యవహా

రమూ అన్నీ కట్టి పెట్టించు. రేపు ఉదయమే గేబ్రియల్ యింటికి వెళ్ళి, వానితో మనసిచ్చి మాట్లాడి, పొత్తుగావుండు. రేపే మేరీకన్య పండగ కూడాను. సెలవుదినం. గేబ్రియల్‌ను మన యింటికి ఆహ్వానించు. తేనీటివిందు యేర్పాటుచేయి. తగాదాలు పూడ్చిపెట్టండి. ముందు యిటు వంటివాటి ఊసే యెత్తమని శపథం తీసుకోండి. ఆడవాళ్ళనీ పిల్లల్నీ కూడా అట్లాగే చేయమని ఆదేశించుకోండి."

ఇవాజ్ నిట్టూర్చేడు. తనలోనే "నాన్న చెప్పేదంతా నిజమే." అనుకుంటూంటే, అతని మనస్సుమీది నుంచి ఏదో బరువు తీసేసి నట్లైంది. ఈతగాదానంతనీ యెట్లా పరిష్కరించుకోగలనా ? గేబ్రియల్‌తో స్నేహం యెట్లా చేసుకోగలనా ? అనేది మాత్రం అతనికి తేలనేలేదు.

వృద్ధుడు, యితని మనస్సులోని భావాల్ని అవగతం చేసుకున్న వానిపలెనే అందుకున్నాడు. "వాన్యా! వెళ్ళు నాయనా! ఇప్పుడే. ఈపనిని వాయిదా వెయ్యకు. మంటను మొదటనే ఆర్పివేయాలి. నాలుగుచూరులూ అంటుకున్నాక ఆర్పడం మన తరంగాదు. నాయనా!" అతనింకా యేదో చెప్పాలనుకుంటున్నాడు. ఇంతలోకే ఆడవాళ్లు సందడిగా లోపలికి వచ్చే సేరు. అందరూ తలోరకంగానూ పూతిగోరింకల్లా వదరడం ఆరంభిం చేరు. వాళ్ళకప్పుడే అంతా తెలిసి పోయింది; గేబ్రియల్‌కి కొరడా దెబ్బల శిక్ష పడడం; అతడు తమయింటికి చిచ్చుపెడతాననటం, అన్నీ. వీటికింకా కొన్నిచేర్చి, కధలల్లి, పొలంలోనే గేబ్రియల్ యింటి ఆడం గులతో జగడమాడే వచ్చేరు. గేబ్రియల్ కోడలన్న సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లుగా చెప్పేరు. ఆమె అన్నదట "మేమూ దీనికి మారు చెప్పగలంలే! మేజస్ట్రేటుగారు మాకనుకూలం చేసి తీరుతాడు. స్కూలు మేష్టారిచేత చక్రవర్తికి అర్జీ తయారుచేయించి పంపేములేండి, తొందర పడొద్దు. బండి చీలలు యెవరుతీసిందీ, మాపండ్లతోట నాశనం చేసిన

సంగతీ,- అన్నీ వున్నాయి. పిటిషన్‌లో. మీభూమిలో సగం మాకు యిప్పించుతారు చూడు !"

ఇదంతా వింటూంటే, ఇవాన్ మనసు మళ్లీ కలిగిపోయింది. "గేబ్రియల్‌తో రాజీయేమిటి ? ఛీ" అనుకున్నాడు.

గృహయజమానికి అనేక పనితొందరలు. ఇవాన్ ఆడవాళ్ళతో మాట్లాడుతూ కూర్చోడాని కెక్కడవుతుంది ? మెల్లిగా లేచి, గదిలోంచి బైటికొచ్చి, గాదులదగ్గిరికీ, అక్కడినుంచి పశువుల కొట్టాముకీ పోయేడు. అక్కడి పనులు పూర్తిచేసుకుని యింటిముంగిట్లోకి తిరిగి వచ్చేటప్పటికి సూర్యాస్తమానం కావస్తూంది. పొలాలనుంచి కొడుకు లప్పుడే యింటికి వస్తూన్నారు. పొలాల్లో గోధుమచల్లిక లప్పుడే ఆవుతున్నాయి. పొలంలో పనుల్నిగూర్చి కొడుకుల్ని వివరాలడిగి తెలుసుకుని, యివాళ-కాడీ-మేడీ, తట్టా-బుట్టా సర్దుబాటు చేసికొని, మరామ్మతు చేయాల్సిన గుర్రపు మెడదట్టీ ముందువేసుకుని కూర్చున్నాడు. అది అవగానే పెరట్లో పాకలోకి పోయి యేవో రాటలుంటే వాటి కొసలు చేగొడ్డలితో కాస్త సరిచేస్తున్నాడు. అప్పటికే బాగా చీకటిపడింది. మిగిలివున్న రాటల్ని మర్నాడు సరిచేయవచ్చునని ఓప్రక్కకి నెట్టేశాడు. పశువుల ముందు గడ్డీ గాదం వేసి, అన్నీ సరిగా వున్నాయా అని పారచూసేడు. రాత్రి మేతకి గుర్రాల్ని బీళ్ళలోకి తోలుకొని పోవడానికి తారాస్కా వస్తే. వాడికి గేటు తీసివుంచి, వాడూ గుర్రాల్ని తోలుకు పోగానే గేటుమూసి, గడియలు బిగించేడు. "ఇప్పటిమటుక్కి త్వరగా భోంచేసి, పడుకోవాలి. నిద్దరొస్తూంది." అను కున్నాడు, యివాన్ తనలోనే. గుర్రపు మెడదట్టీని చేతులో పట్టుకుని, యింటిదగ్గిరికి వచ్చి, గుమ్మంలో అడుగు పెట్టబోతూంటే దడి అవతలనుంచి గేబ్రియల్ బొంగురు కంఠం విని పించింది. కొంచెం సేపటినుంచీ గేబ్రియల్ సంగతి, పోట్లాటలసంగతీ మరిచేపోయేడు ; తండ్రి చెప్పింది కూడా అతని మనసులో లేదు; ఉన్న

ట్లుండి గేబ్రియల్ మాటలు విని, అన్నీ జ్ఞాపకం వచ్చేయి. ఉలిక్కి పడ్డాడు. యివాన్, ఏదో విషప్పురుగు తొక్కినట్లు. "వాణ్ణి యములాడు తీసుకుపోనూ! వాణ్ణి నరికెయ్యాలని వుంది!" గేబ్రియల్ మాటలు వినడంతోనే అతనిలో మళ్లీ ద్వేషం పొంగి పొర్లింది. ఆగి, నిశ్చలంగా, నిశ్శబ్దంగా నిల్చునే, గేబ్రియల్ తిట్లన్నీ విన్నాడు. తలపంకించి, కదలేడు. ఇంట్లోకి ప్రవేశిస్తూనే చూసేడు. సావిట్లో దీపం వెలుగుతూంది. వెచ్చగా, వెలుతుర్నగా వుంది. ఓవైపున కోడలు రాట్నందగ్గిర కూర్చుని యేకులు ఒడుకుతూంది. భార్య భోజనం వడ్డనకు యేర్పాట్లు చేస్తూంది. పెద్దకొడుకు, మరోప్రక్క జోళ్లు తయారుచేయడాని క్కావాల్సిన బెరడును బాగుచేస్తున్నాడు. చిన్నకొడుకు టేబిల్‌దగ్గర కూర్చుని, ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. ఈచిన్న కుటుంబంలోని శాంతీ, సౌఖ్యమూ, సంతృప్తీ,—అన్నీ అతనికి గుర్తుకు వచ్చేయి. దుర్మార్గుడైన ఆపొరుగువాడు లేకపోతేనా! అతని స్మరణే యివాన్‌కి గుండెల్లో గాలంవలె వేధిస్తూంది. పాలకడవలో విషపుబొట్టు! ప్రశాంత సంసార జీవితంలో పొరుగువానితో పొరపొచ్చెం!

ఇవాన్ కోపంగా లోనికి ప్రవేశించేడు. బల్లమీద ముణుచుకూర్చున్న పిల్లిని క్రిందికి తోసేసేడు. చేతులు కడుక్కొనే తొట్టి యథాస్థానంలో లేనందుకు ఆడవాళ్ళని తిట్టేడు. క్రుంగిపోయిన హృదయంతో బెంచీమీద కూలబడి, గుర్రపుమెడపట్టీ బాగుచేయ నారంభించేడు. ఏపని చేస్తున్నా అతని బుర్రలో గేబ్రియల్ పీడకలలా వుంటూనే వున్నాడు. కొట్టుదగ్గరే, తన కొంప అంటిస్తానన్నాడు! ఇప్పుడే కాదు, తనని నరికేస్తానన్నాడు.

తారాస్కాకి తల్లీ వడ్డించింది. వాడూ భోజనంకాగానే చేతులు కడుక్కొని, ఫొంగొర్రెచర్మపు కోటూ, పైన ఉన్నికోటూ తొడిగి, మొలపట్టీ బిగించుకుని, ఓకొప్పెముక్క కోటు జేబులో కుక్కుకుని, గుర్రాల దగ్గి



రికి పోదామని వీధులోకి వచ్చేడు. వాడి పెద్దన్న కూడా వానితో వెడదామని లేవబోతుంటే, ఇవాన్ లేచి, గుమ్మంలోకి వచ్చి నిలబడ్డాడు.

బైట రాత్రి గాఢాంధకారంగా వుంది. ఆకాశమంతా కారు మబ్బులు. గాలి అప్పుడే వీవ నారంభిస్తూంది. ఇవాన్ వాకిట్లోకి దిగి, తారాస్‌కి గుర్రం యెక్కడంలో సాయంచేసి, గుర్రపుపిల్లని వెనకాలే తోలి, వాడు వీధులోంచి, వెడుతూంటే చూస్తూ నిలుచున్నాడు. పొలాలికి బోతున్న యితర పిల్లగాళ్ళతో తారాస్ కలుసుకొనేవరకూ అల్లే నిలుచుని చూస్తూ, చివరకి వాళ్ల గుర్రాల డెక్కలధ్వని కూడా వినబడకుండే వరకూ ఎందుకో నిలబడిపోయేడు. అతని హృదయకుహరంలో ప్రతిధ్వనిస్తూనే వున్నాయ్, యింతసేపూ గేబ్రియల్ శాపనార్థాలు: "నీదేమి మండకుండా చూచుకో!"

"వాడన్నిటికీ తెగించి వున్నాడు." అనుకున్నాడు యివాన్ అప్రయత్నంగానే. "ఈమధ్య యెండలు బాగా కాచేయి. గాలికూడా వీస్తూంది. వెనకపెరట్లోంచి దూరి, వాడు ఏతుక్కలోనో కాస్త అగ్గిపారేసి తప్పుకుంటాడు. అర్ధగంటలో అంతా తగులడిపోతుంది. అగ్గి ఎల్లాపుట్టిందీ ఎవడూ కనిపెట్టలేడు! వాణ్ణి నేను పట్టుకోగలిగితే, అంత సులభంగా యీసారి తప్పించుకు పోలేడు!" ఈ ఆలోచనలతో అతనికి పిచ్చెక్కినట్లైపోయింది. ఇంట్లోకి పోవడానికిమారు, వీధిలోనికి వెళ్ళి, సందులో పడి, పెరటి వెనక్కి చేరుకున్నాడు. "ఓమాటు చుట్టూరా చూసి పోతా. వాడేం తలపెట్టేడో యెవడికి తెలుసు?" మెల్లిగా, చప్పుడుగాకుండా అడుగువేస్తూ, దొడ్డిగుమ్మందాటి కంచెవార నక్కి కూర్చుని చూసేడు. కంచెకి ఆవలివైపు, కొనగా ఏదో కదిలినట్లయి. కళ్ళు పెద్దవిచేసి కాఢాంధకారంలోకి చూస్తున్నాడు. అంతా నిశ్చలంగానూ, నిశ్శబ్దంగానూ వుంది. గాలి మెల్లిగా వీస్తూంది. ఎండుటాకులు కదిలిన గలగల ధ్వనీ,



గడ్డిలో గాలి కదిలిన చప్పుడూ తప్ప యింకేమీ వినపడ్డంలేదు. చీకటి మసిబూసినట్లుగా వుంది. చాల సేపటినుంచి చీకటిలో వుండడంవల్ల అతని కళ్లు కొంచెం కొంచెంగా చూడగలుగుతున్నాయి. దూరంలో ఆవలి మూల నాగలీ, కంచెలోని వెలితీ మసకగా కనిపిస్తున్నాయి. ఎంత సేపటికీ మరేమీ కనిపించలేదు..

"ఆచ్ఛే! నేనే భ్రమపడ్డాను. ఏమీలేదు. అయినా ఓసారి చుట్టూ చూసివస్తే మంచిది." అనుకుని, కంచెవారే చప్పుడు చేయకుండా, వంగి నడుస్తున్నాడు. ఎరడు జోళ్లు తొడుక్కున్నా, చాల జాగ్రత్తగా అడుగు వేస్తుండఢంవల్ల అతని ఆడుగులు అతనికే వినపడడంలేదు. రెండో మూలకి చేరేడు. నాగలి సమీపంలోనే వుంది. ఇంతలో ఏదో చటుక్కున మెరిసినట్లై, మాయమైంది. ఇవాన్ గుండెలు ఆగిపోయేయి. ఊపిరికూడా తీయకుండా అట్లాగే ఓక్షణం నిలబడిపోయేడు. మరోసారి ప్రకాశవంతమైన వెలుతురు, ఆస్థలంలోనే మెరిసింది. తనవైపు వీపుత్రిప్పి, ఏవరో నేలమీద వంగి కూర్చుని, చేతిలోని ఒక గడ్డి తుట్టని అంటిస్తూన్నాడు. ఇవాన్ గుండెలు గుండుదెబ్బ తగిలిన పిట్టలా తటతట కొట్టుకున్నాయి. తటాలున పెద్దపెద్ద అంగలు వేస్తూ, ముందుకి నడుస్తున్నాడు. తన కాళ్లతో నడుస్తున్నట్లుగానే లేదతనికి.

"ఈసారి వాడు తప్పించుకోలేడు. యిక్కడే దొరికిపోతాడు!" అనుకుంటూ, ఇవాన్ కంచెలోని వెలితిదగ్గిరికి చేరుకున్నాడు. అప్పటికే పెద్దమంట లేచింది; ధాన్యపుగాదుల దగ్గరి గడ్డి అంటుకుంది. మంటలు ఝుంజూరు లందుకుంటున్నాయి. ఆవెలుగులో స్పష్టంగా కనిపించేడు, కుంటి గేబ్రియల్.

పావురంమీదికి ఉరికే డేగలా, గేబ్రియల్ మీది కురికేడు, ఇవాన్. "నిన్ను యిక్కడే కట్టేస్తానీసారి" యిదే అతని ఆలోచన.

పాదధ్వని వినిపించింది. కుంటివాడు వెనక తిరిగి చూచి, గభుక్కున గాది చుట్టు తిరిగి కుందేలులా గెంతుతూ పరుగెత్తేడు.

"ఎక్కడికి పారిపోతావురా ? లంజాకొడకా !" అంటూ ఇవాన్ అరుస్తూ, గేబ్రియల్ వెంట పడ్డాడు. అతడు గేబ్రియల్ చొక్కా లంకించుకున్నాడు. కాని అంతలోనే పట్టు జారిపోయింది. మళ్లీ గేబ్రియల్ కోటు కొసలు రెండూ పట్టుకున్నాడు. ప్రాణభీతితో గేబ్రియల్ మూరేడు. కోటు చిరిగిపోయింది ; ఇవాన్ వెనక్కి పడిపోయేడు, ఆనిసురుకి. మళ్లీ వెంటనేలేచి, పరుగెత్తేడు, "దొంగ ! దొంగ ! పట్టుకో !" అంటూ.

గేబ్రియల్ ఒక్క పరుగున తన దొడ్డిచేరేడు. ఇవాన్ కూడా ఆదొడ్లోకి దూకి, పట్టుకోబోతూన్నాడు. అంతలోనే ఇవాన్ నడినెత్తిని, అశనిపాతంలా ఏదో పడింది ; గేబ్రియల్ ప్రాణాలికి తెగించి చేతికి దొరికిన కొయ్యతీసి, ఇవాన్‌ను శక్తికొద్దీ మోదేడు.

ఇవాన్ కళ్ళు తిరిగిపోయేయి, చీకట్లు క్రమ్మేయి. కళ్ళముందు వెలుగు చుక్కలు గిర్రునతిరిగినై. మళ్లీ అంతా చీకటి అయిపోయింది. అతడు నేలమీదకి ఒరిగి, పడిపోయేడు. అతనికి స్మృతి తెలిసేటప్పటికి అక్కడెవరూ లేరు. వెలుతురు పట్టపగలులా వుంది. అంతా గోలా, కేకలూ, జనం సందడిగా పరుగులెడుతున్నారు, పటపట ధ్వనులతో మంటలు ఆకాశాన్నంటుతూన్నాయి. ప్రక్కకి చూసేడు. తన పెద్దగాదెల వరస భగ్గున మండుతూంది ; చిన్నగాదె అప్పుడే అంటుకోబోతూంది. గాలి అప్పటికే బాగా వీస్తూంది. మంటల నెరుసులు, మండుతూన్న గడ్డితుట్టలూ గాలికి యెగిరి, యింటిమీద పడుతూన్నాయి.

"బాబో ! బాబో ! అంతా ఐపోయింది !" అని అరుస్తూ లేచి, నిరాశతో తుంట్లు బాదుకుంటూన్నాడు, ఇవాన్. "అయ్యయ్యో !

ఎంతపని జరిగిపోయింది. మొదటే ఆతుట్టని తీసి ఆర్పేస్తే యింతపని జరిగేదికాదే! అన్నా! ఎందుకు చేయలేదు, నేనాపని!" అని అరవబోయేడు. గుండెలు బరువెక్కి-పోయేయి. రక్తం ముఖానికెగదట్టింది. వెలుగు రాలేదు. పరుగెత్తుదామనుకున్నాడు; కాళ్ళు స్వాధీనం తప్పేయి. అతిప్రయత్నంమీద తూలుతూ ముందున కొక్క- అడుగు వేసేదో లేదో, గుండె దడదడ లాడి, ఉక్కి-రిబిక్కి-రై పోయేడు. ఊపిరి తిప్పుకోడానికి ఒక్క-క్షణం ఆగేడు. మెల్లిగాదేకుతూ, కంచె తిరిగి వెళ్లేటప్పటికి రెండు గాదెలూ అంటుకుపోతున్నాయి. ఇల్లు ఓమూల మండుతూంది; ద్వారబంధం అంటుకుంది. కిటికీల్లోంచి మంటలు పైకి నాలికలు జాచుతున్నాయి. ముంగిట్లోకి వెళ్ళడానికే సాధ్యంగాలేదు. జనం చాలామంది మూగేరు. కాని ఏమిచేయడానికీ శక్యంలేదు. చుట్టుపట్ల రైతాంగం అంతా తమతమ సామానులు వీధిలోకి జేరవేసుకుంటున్నారు; పెరళ్ళలోంచీ, పాకల్లోంచీ పశువుల్ని పలుపులువిప్పి, బైటికి కొట్టేస్తున్నారు. కొంచెం సేపట్లోనే గేబ్రియల్ యిల్లూ అంటుకుంది. వాయుదేవుడి పుణ్యాన కొంచెంసేపట్లో సగం గ్రామం పరశురామప్రీతి అయిపోయింది.

ఇవాన్ యింట్లోవాళ్లు కట్టుబట్టలతో బైటపడ్డం కష్టమైపోయింది. ముసలితండ్రినిమాత్రం యెట్లాగో యింట్లోంచి రక్షించుకోగలిగేరు. పూచికపుల్లకూడా యింట్లోంచి తెచ్చుకోవడం సాధ్యంకాలేదు. పాపం! పశువులన్నీకూడా పాకలతోబాటు కాలిపోయేయి. గుర్రాలు పొలంలో వుండడంవల్ల బతికిపోయేయి. కోళ్లూకొక్కి-రాయిలూ, కాడీ, మేడీ, బళ్లూ నాగళ్లూ, పెట్టెలూ పట్టలూ, ధాన్యం, అపరాలూ అన్నీ అగ్నిదేవుడికి ఆహుతిమైపోయేయి.

గేబ్రియల్ యింట్లోంచి యేదో కొద్దిగా సామానులూ, పశువులూ మాత్రం రక్షించబడినాయి. అగ్నిదేవుడు తెల్లవారేవరకూ శాంతించలేదు.

ఇవాన్ కాలుతున్న యింటియెదుటే, గుడ్లప్పగించి చూస్తూ నిలుచున్నాడు. "అన్నా! యేంపనిచేసేను? ఆకాస్త వెంటే లాగి, తొక్కి ఆర్పేస్తే పోయేదే! అయ్యయ్యో!" అని, వంటిమీద స్మారకం లేనట్లుగా అంటూనే వున్నాడు. మిద్దెమీది దూలాలుకాలి లోపలికి కప్పు అంతా కూరినపుడు మాత్రం ఆవేశంతో మంటల్లోకి దూకి, దూలంపట్టుకుని వెర్రిబలంతో లాగడం మొదలెట్టేడు. ఆడవాళ్ళు గొల్లుమని, ఏడుస్తూ, అతన్ని పిలుస్తున్నా వినిపించుకోనేలేదు. ఎట్లయితేనేం, ఆదూలం బైటికి లాగి, మళ్లీ యింకోదానికోసం వెళ్లేడు. కాని యీసారి తూలిపోయి, మంటల్లో పడిపోయేడు. కొడుకులు బహు కష్టంమీద ఈవాణ్ను బైటికి తెచ్చి, రక్షించుకోగల్గేరు. ఇవాణ గడ్డం, జుట్టూ, చేతులూ కాలిపోయేయి. బట్టలన్నీ కాలి, మసిచూరిపోయాయి. కాని, ఇవాన్‌కి దేహంమీద స్మారకమేలేదు.

"దుఃఖంతో పాపం, అతనికి పిచ్చెత్తిపోయింది!" అన్నారు, చూసేవాళ్ళంతా. తెల్లవారుయామకి మంటల తీవ్రత తగ్గింది. ఇవాన్ అక్కడే నిలుచున్నాడు. "మొదట్లోనే ఆవెంటిలాగి ఆర్పేస్తే, యిట్లా జరిగేదికాదుగదా!" అనేమాటలు అవిరామంగా అతని నోట్లోంచి వస్తూనేవున్నాయి.

తెల్లవారేక గ్రామపెద్ద కుమారుడు ఇవాన్ దగ్గిరికి వచ్చేడు.

"బాబూ! మీనాయన మరణావస్థలో వున్నాడు. ఆఖరిసారి వెళ్లి చూచిరా! నిన్ను చూచిగాని ఆవృద్ధుడి ప్రాణాలు పోనంటున్నాయి." ఇవాన్ తండ్రినిగూర్చి మరిచేపోయేడు. అతనికీమాటలు అర్థంకాలేదు.

"ఏమిటి! మానాన్నా? ఎవరికోసం కబురు పంపేడు?" అన్నాడు కొంతసేపటికి, తెలివివచ్చి.

"నీకోసమే. మాయింట్లో పడుకున్నాడు. నిన్ను చూడాలంటున్నాడు. రా, ఇవాన్‌బాబూ!" అంటూ గ్రామపెద్ద కుమారుడు

అతని చేయిపట్టుకుని తీసుకుపోతూంటే, మారుమాటాడక యివాన్ నడిచి వెళ్లేడు.

ఆవృద్ధుణ్ణి బైటికి లాగేటప్పుడు కాలుతూన్న గడ్డితుట్టలు మీద పడి అతని శరీరం చాలచోట్ల కాలింది. గ్రామానికి ఆవలి చివరనున్న గ్రామపెద్దయింటికి తీసికొనివెళ్ళి, అక్కడ పండుకోబెట్టేరాతణ్ణి. యివాన్ అక్కడికి చేరేసరికి, ముసలమ్మలూ, పిల్లలూ తప్ప మరెవరూలేరు. అంతా మంటలదగ్గిరే వున్నారు. ఇవాన్‌ను చూడ్డంతోటే ముసలమ్మ మెల్లిగా మరణశయ్యమీదనున్న ఫ్రోల్‌తో, కొడుకు వచ్చేడని చెప్పింది. ఫ్రోల్‌ని ఒక బల్లమీద పండుకోబెట్టేరు. అతని చేతిలో వెలుగుతున్న కొవ్వొత్తివుంది. అతడి దృష్టంతా ద్వారంపైపేవుంది. కుమారుని రాక చూచి అతను కొంచెం కదిలి, దగ్గరగా రమ్మని క్షీణస్వరంతో పిలిచేడు. కొడుకు సమీపించిన తర్వాత "నాయనా! వాన్యా! నేనేం చెప్పేనురా? ఊరు తగులబెట్టిందెవర్రా?" అని ప్రశ్నించేడు.

"నాన్నా! వాడే! వాణ్ణి పట్టుకున్నా. నేను! వెలిగించి, చూరులో పెడుతుంటే చూశాను. ఆతుట్ట పీకేసి, ఆర్పేసివుంటే, యిదంతా జరిగి వుండేదేకాదు," అన్నాడు, ఇవాన్ ఉదాసీనంగా.

"ఇవాన్! నేను చనిపోతున్నా. నాయనా! నీకూ ఏదోరోజున మరణం తప్పదని తెలుసుకో! ఇందులో తప్పెవరిది?" అన్నాడు, వృద్ధుడు, కఠినంగా.

ఇవాను తండ్రి కళ్ళలోకి తేరిపారచూసేడు. అతని నోటికి మాట రాలేదు. వృద్ధుడేమళ్లీ "ఇవాన్! ఈశ్వరసాక్షిగా, ఇందులో తప్పెవరిదో, చెప్పు? మాట్లాడవేం? నేనునీతో యేమనిచెప్పేను?" అన్నాడు.

ఇవాన్‌కి స్మృతికలిగింది; విషయం యిప్పుడే గ్రహించేడు. ఒక్కసారిగా యేడుపు వచ్చింది. వెక్కుతూ "నాన్నా! తప్పంతా నాదే!" అన్నాడు. తండ్రిపక్క మోకరించి, యేడుస్తూ, "నాన్నా! నన్ను క్షమిం

చవూ? ఈశ్వరుని ముందు, నీముందూకూడ తప్పుచేసేను. నువ్వు క్షమించవూ?"

వృద్ధుని హస్తాలు బలహీనంగా కదిలేయి. కొవ్వొత్తి యెడమ చేతిలోకి తీసికొని, కుడిచేతిని నొసటికి యెత్తబోయేడు. అప్పటికే అతని లోని బలం క్షీణించింది; చేయి క్రిందికి నిస్సహాయంగా జారిపోయింది.

"దేవదేవా! వెయ్యి నమస్కారాలు! ఈశ్వరా! కృతజ్ఞుణ్ణి!" అంటూ వృద్ధుడు తన దృష్టినంతా కొడుకుమీద కేంద్రీకరించేడు.

"వాన్యా! విను, నాయనా!"

"వింటున్నా, నాన్నా!"

"నువ్విప్పుడేం చేయదలచుకున్నావ్?"

ఇవాన్ యింకా యేడుస్తూనే వున్నాడు.

"నాకేం తెలియదు, నాన్నా! ముందెల్లా బతకాలో దిక్కుతెన్నూ తోచటంలేదు, నాన్నా!"అని మాత్రం అనగలిగేడు.

వృద్ధుడు కండ్లు మూసుకున్నాడు. అతని పెదవులు స్పందిస్తూన్నాయి. ఆఖరిసారి తనశక్తిని కూర్చుకుంటూన్నట్లుగా ఒక్క క్షణం వూరుకుని అన్నాడు. "ఏం ఫర్వాలేదు. నాయనా! నోరు మంచిదైతే ఊరూ మంచిదే! ఈశ్వరసాక్షిగా నువ్వు ఋజుమార్గంలో పోతే, బ్రతుకలేనన్న అధైర్యం పడనక్కర్లేదు." ఒక్క క్షణం మళ్లీ ఊరుకొని, చిరునవ్వునవ్వి, అన్నాడు: "చూడు. వాన్యా! అగ్గి పెట్టినదెవరో చెప్పకు. నీవు యితరుల పాపాల్ని క్షమించగలిగితే, ఈశ్వరుడు నీపాపాల్ని క్షమించకపోడు!"

వృద్ధుడు బహుప్రయత్నంమీద రెండుచేతులతో కొవ్వొత్తినిపట్టుకొని హృదయంమీద వుంచుకున్నాడు, నిట్టూరుస్తూ, కాళ్లుజాచి, ప్రాణం వదిలిపెట్టేడు.

* * * *

అగ్ని యెట్లాపుట్టిందీ ఇవాన్ యెవరితోనూ చెప్పనేలేదు. ఈ రహస్యం యెవరికీ తెలియకుండా వుండిపోయింది. అతని మనస్సులో

గేబ్రియల్‌మీది క్రోధాన్ని మరిచిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇవాన్ నడవడి గేబ్రియల్‌కి చాల ఆశ్చర్యం కలిగించింది. ఇదంతా బైట పెడ తాదేమోననే భీతి అతన్ని చాలరోజులు పీడించింది. క్రమంగా యిద్దరూ ఒకరికొకరు యెడంగా వుండడం పోయింది. తిరిగి యెప్పుడూ పోట్లాడు కోనేలేదు. వాళ్ళ కుటుంబాలూ వాళ్ళనిచూసి, కలహాలు మానేరు. ఒకే పాకలో యిద్దరూ వుంటున్నారిప్పుడు. ఇళ్ళు కట్టుకోడంలో కూడా పర స్పరం సాయం చేసుకుంటున్నారు. గ్రామమంతా తిరిగి కట్టుకునేటప్పుడు కూడ, వాళ్ళు విడిపోలేదు. ఇరుగుపొరుగుగా వుండడానికే ఇవాన్-గేబ్రియల్‌లు నిశ్చయించుకున్నారు.

తమ తండ్రులకివలెనే యిప్పుడు వీళ్ళిద్దరూ పరమ మిత్రులు అయిపోయేరు. ఇవాన్, తన తండ్రి మాటల నెన్నడూ మరువనేలేదు. "అగ్నిని మొదట్లోనే ఆర్పాలి. అగ్నినీ, ఋణాన్నీ పెరగనీకు" అన్న ఆప్తవాక్యం,-అతని చెవుల్లో నిరంతరం ధ్వనిస్తూనే వుంది.

ఎవరైన తన కపకారంచేస్తే, తిరిగి ప్రత్యపకారంచేసి, కసితీర్చు కోడానికి యత్నించేవాడే కాదు. తన్నెవరైనా తిట్టినా, మంచి మాటల తోనే అతనికి బుద్ధి వచ్చేటట్లు సమాధానం యిచ్చేవాడు. తన ఇంటిస్త్రీ లకూ, బిడ్డలకూ యిట్లు ప్రవర్తించుటే నేర్పేడు. అతని శాంతి సౌఖ్యాల కెప్పుడూ భంగము కలుగలేదు.

క॥ ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ • వివరింపంగా,
అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు • నేర్పరి సుమతీ?

క॥ ఒరులేయవి యొనరించిన
నరవర ! యప్రియంబు ద • న మనమునకగు దా
నొరులకు అవి సేయకునికి
పరాయణము పరమధర్మ • పథములకెల్లన్ ॥ (రచన: 1885)

# చిన్నపిల్లల తెలివి

అది ఏప్రిల్ మాసం. ఈస్టర్ పండుగ రోజులు. దొడ్లల్లోనూ, వీధుల్లోనూ మంచు యింకా వుంటూనేవుంది. స్లెడ్జిబళ్ళు అప్పుడప్పుడే మూలబెట్టేరు. * పొద్దెక్కినకొద్దీ మంచు కరిగి, నీరు వీధుల్లో కాలువలుగా ప్రవహిస్తూంది.

ఆసన్నని సందుకి రెండు ప్రక్కలా వాముల దొడ్లున్నాయి. అక్కడి మంచు కరిగి, సన్నగా ప్రవహించి, వీధిలో ఒకచోట పల్లంగా వుంటే అక్కడ మడుగుకట్టి నిలిచింది.

పండుగ రోజులేమో, పిల్లలు సరికొత్త బట్టలు కట్టుకుని ఉల్లాసంగా వీధుల్లో ఆడుకుంటున్నారు. చెర్చినుంచి వస్తూ అకూల్యా, మలాషా, యిద్దరూ సందులోంచి నడుస్తూన్నారు. వాళ్ళల్లో మలాషా చాలా చిన్నది; అకూల్యా కొంచెం పెద్దది. ఇద్దరూ కూడ సరికొత్త గౌనులు తొడుక్కుని వున్నారు. మలాషా నీలిరంగు పువ్వుల గౌనూ, అకూల్యా పసుపు రంగు పువ్వుల గౌనూ తొడుక్కుని వున్నారు; యిద్దరూ ఎర్రటి రుమాళ్ళు తలమీదనుంచి గడ్డంక్రిందికి కట్టుకున్నారు. చెర్చినుంచి వస్తూ, దారిలో యిద్దరూ కలుసుకుని జట్టుగా నడుస్తూ, ఒకరి కొత్తబట్టలు ఒకరికి చూపెట్టుకుని, మాట్లాడుకుంటూ వస్తూన్నారు. ఆసందుమొగకి వచ్చేక కొంత సేపు ఆడుకుంటూ, నీళ్లు చూసేరు. ఆనీళ్ళలో దిగి నడిస్తే ఎంత బాగుం

---

* రష్యాలో దట్టమైన మంచుపొరమీద చక్రాల్లేని యీ స్లెడ్జి బండ్లమీదే ప్రయాణాలు చేసినా, సరుకులు తీసికొనివెళ్ళినా. వేసవి రాగానే యీమంచు కరుగ నారంభించి, స్లెడ్జిలు నడిచేందుకు వీలుండదు. అందుచేత ఆబళ్లు మూలబెట్టి, చక్రాలబళ్లు పైకి తీస్తారు. అదీ సందర్భం యిక్కడ.

టుంది ? చిన్నపిల్ల మేజోళ్లు, బూట్లు,-అన్నిటితోనూ నీళ్ళలో దిగబో తూంటే పెద్దపిల్ల ఆపేసింది.

"ఏమే. మలాషా ! వాటితో నీళ్లల్లో దిగకే. మీ అమ్మ తిడు తుందే. నేను జోళ్లూ. మేజోళ్లూ విప్పేస్తాను. నువ్వూ విప్పేసుకో; యేం ?"

ఇద్దరూ బూట్లూ, మేజోళ్లూ విప్పి గట్టున పెట్టి, గౌనులు పైకెత్తి చేతుల్తో పట్టుకుని, నీళ్లల్లోకి దిగేరు. ఒకతె యీవైపునుంచీ, రెండోది ఆవైపునుంచీ, యెదురెదురుగా నడుస్తూ, సంతోషంగా నవ్వుతూ ఆడు కుంటూన్నారు. మలాషా చీలమండలు మునిగేదాకా నడిచి, ఆగి పోయింది :

"అకూల్యా ! చాల లోతుందేవ్, అమ్మబాబో !"

"ఫర్వాలేదు లేవే ! భయపడకు. అంతకంటె లోతుండదు, యీ నీళ్ళలో." అని ధైర్యం చెప్పింది, పెద్దదిగనుక అకూల్యా.

ఇద్దరూ నడుచుకుంటూ గుంటమధ్యకి వచ్చేరు. అకూల్యా అంది:

"మలాషా ! నీళ్లు చెదరగొట్టకేం. మెల్లిగా నడు. ఏం ?"

అకూల్యా యిట్లా చెపుతూనేవుంది, మలాషా కాలెత్తి ధమ్మున నీళ్ళలో దించింది. బురదనీరు పైకి యెగజిమ్మి అకూల్యా కొత్తగౌనంతా తడిసిపోయింది. గౌనేకాకుండా, ఆమె ముఖం, కళ్లూ కూడా బురదై పోయింది. మలాషా జెదిరి దూరంగా పోతూంటే, అకూల్యాకి చాల కోపంవచ్చి, ఆమెని కొట్టడానికి చేయెత్తి గబగబా వెంటాడింది. మలాషా మరీ భయపడిపోయి, నీళ్ళలోంచి గట్టెక్కేసి, యింటికి పారిపోబో తూంది. ఆసమయానికే అకూల్యా తల్లి ఆదారిని వెడుతూ, కూతురు గౌను బురదగా వుండడంచూసి;

"ఏమే ! రాలుగాయీ ! ఏంచేస్తూన్నావే ? ఈబురదేమిటే, నీమొహం యీడ్చా !" అని తిట్ట నారంభించింది.

"నేనేం చెయ్యలేదే! మలాషామే! చెయ్యాలని చేసింది!" అంది. బెదురుతూ, అకూల్యా.

ఇది వినడంతోటే ఆమె మలాషాను ఒడిసి పట్టుకుని, వీపుమీద నాలుగు చరిచింది. వీధంతా వినిపించేలా గోలచేస్తూ, మొఱపు ప్రారంభించింది, మలాషా. ఇంట్లో పనిచేసుకుంటూన్న వాళ్లమ్మ యీగోల విని, పరుగెత్తుకు వచ్చింది.

"నాబిడ్డను యెందుకమ్మా కొడుతూన్నావు? చంటిపిల్లని చంపేసిం దమ్మోయ్." అంటూ ఆమె రైమని లేచింది. మాట మీద మాట బాలలు జామకుంటూ యిద్దరూ బావురు పిల్లల్లా పోట్లాట ప్రారంభించేరు. అది విని మగాళ్లుకూడా చేరేరు. యీచోద్యం చూడ్డానికి పెద్దగుంపు పోగైంది. అందరూ అరిచేవాళ్లేగాని వినేవాళ్లెవరూ లేరు. ఈగోలలో యెవరో మరొకరిని తోసేడో, తొయ్యబోయేడో! దాంతో చెయ్యీ చెయ్యీ కలిపేరు, మగాళ్లు. అకూల్యా నాయనమ్మ ఒక్కర్తె మాత్రం యీతగువు చల్లార్చాలని ప్రయత్నిస్తూంది.

"ఏమర్రా, నాయనలుగామా? ఊరుకోండి. మాబాబులు; నిక్షేపం లాంటి పండుగపూట యిట్లా తిట్టుకుంటారుటే, పిల్లా? సిగ్గు లేదుటే? పండుగపూట సంతోషంగా ఉండే సమయంలో యీపోట్లాటలెందుకర్రా?"

ఆముసలిదాని గోల యెవరేనా వినిపించుకుంటేనా? పైపెచ్చు ఆమెని ఆతోపులాటలో తొక్కిపారేశారు. కూడాను. ముసిలిది, చాపు తప్పి కన్నుకొట్టిపోయి నంతపనై, బైటపడింది. ఈలోపుగా మలాషా, అకూల్యా యేంచేస్తూన్నారో, తెలుసా?

తల్లులిద్దరూ తిట్టుకుంటూండగానే, అకూల్యా మొహాన్నున్న బురద తుడిచేసుకుని, మళ్లీ నీళ్లగుంట దరికి వెళ్లింది. ఆగుంట యెదర కొంచెంమేర దిబ్బగా వుంది. అక్కడ దారిచేస్తే నీరంతా వీధులోకి ప్రవహిస్తుంది ఓక్షణం చూస్తూ నిలబడి, మలాషాకూడ వచ్చి, ఒక

ముక్కతో కాలువ తవ్వలో సాయపడ నారంభించింది. మగాళ్ల చేతులు కలుపబోయే సమయానికి ఆపిల్లలు తవ్విన కాలువలోంచి నీళ్లు ప్రవహిస్తున్నాయి. ముసలమ్మ గుంపుచుట్టూ తిరుగుతూ, ఊరుకోమంటూన్న చోటికే ఆకారువనీళ్లు గబగబా వచ్చేస్తూన్నాయి. ఆకాలవకి రెండు ప్రక్కలా యిద్దరు పిల్లలూ పరుగెడుతూ, కేకలు వేస్తున్నారు!

"పట్టుకోవే! మలాషా! పట్టుకో!" అంటూ అరుస్తూంది. అకూల్యా. మలాషా సంతోషంతో ఉక్కిరిబిక్కిరిగా నవ్వుతూ, పరుగెత్తుతూంది!

తాము త్రవ్విన కాలువలో కొట్టుకుపోతూన్న ఆకర్రముక్కను చూస్తూ, దానితో పరుగెత్తుతూ, పరమానందంతో కేరింతాలు కొడుతూన్నారు, ఆచిన్న బిడ్డలు. తమమూలంగా తల్లిదండ్రులు పోట్లాడుకుంటూన్నారనే విషయమే వాళ్ళకి గుర్తులేదు. ప్రవాహంతోబాటు పరుగెత్తుతూ యీగుంపు దగ్గిరికి వచ్చేసేరు. ముసలమ్మ ఆపిల్లల్ని చూసి, పెద్దలతో,-

"సిగ్గులేదుటర్రా? ఈచిన్న పిల్లల్ని చూసేనా బుద్ధి తెచ్చుకోండి. వీళ్ళకోసమేనా మీరు పోట్లాడుకుంటూంట? చూడండి, వాళ్లు అంతా అప్పుడే మరిచిపోయి, కులాసాగా కలిసి ఆడుకుంటూంటే, మీరు తగుదునమ్మాయని వాళ్ళకోసం కొట్టుకుంటారా? నాచిట్టితల్లులే! ఎంత బుద్ధిమంతులమ్మా, మాబంగారు తల్లులు! వీళ్లనిచూసి, బుద్ధి తెచ్చుకోవాలి, పెద్దవాళ్లు!"

అంటూ, అవ్వ ఆపిల్లల్ని కాగలించుకుని, ముద్దెట్టుకుంది.

గుంపంతా అటుతిరిగి, ఆదృశ్యం చూసేరు. వాళ్ళకే సిగ్గనిపించింది, తమ తెలివితక్కువకి. అంతా నవ్వుకుంటూ, యెవరిళ్ళకి వాళ్లు వెళ్ళిపోయేరు.

"మీరు పూర్తిగా మారిపోయి, చిన్నబిడ్డల్లా ఐపోతేనేగాని, స్వర్గరాజ్యంలోనికి ప్రవేశించలేరు సుమా!" (రచన 1885)

# ప్రేమ గలచోట దేవుడున్నాడు

ఒకానొక పట్టణంలో మార్టిన్ అవ్‌దీష్ అనే చెప్పులు కుట్టేవాడు వుండే వాడు. అతనికి స్వంతయిల్లు లేనందున ఒక చిన్న గది అద్దెకు తీసికొని, అందులో నివసిస్తున్నాడు. అదొక పాత యిల్లు; వీధికి చాల పల్లంగా వుంది. కిటికీ దగ్గర కూర్చుని పనిచేసుకుంటూ, వీధిలో పోయీవాళ్లని చూస్తే, మార్టిన్‌కి వాళ్ల కాళ్లు మాత్రమే కనిపించేవి. కాలి బూట్లుచూసే, వాటి యజమానులెవరైనదీ అతడు పోల్చుకోగలిగేవాడు. అతని చేతి లోకి ఒకటి రెండు సార్లైనారాని జోడు ఆప్రాంతంలోనే లేదు. కొన్నిటికి మడమలు వేసేడు; కొన్నిటికి టాకీలు వేసేడు; మరికొన్నిటికి పిగిలిన కుట్లు బాగుచేసేడు; కొన్నిటికి పైటాపంతా కొత్తగా వేసిచ్చేడు. అతని కెప్పుడూ చేతినిండా పనుండేది. మంచి పనివాడికి పనెందుకుండదు? పైగా అతని మజూరీయికూడ చాల సబబుగా వుండీవి. అతనుపయోగించే చర్మాలు కూడా పక్కారకానివే. నమ్మకమైన పనివాడని మార్టిన్ ఆప్రాంతాల్లో పేరుపొందేడు. కాతాదారులు కావాలన్న రోజుకి పనిచేయగలిగి తేనే పని అచ్చుకునేవాడు. పని పూర్తికాదని తోస్తే, ఆమాటచెప్పి, పని ఒప్పుకునేవాడేకాదు. అబద్ధాలు చెప్పడం, జరగని వాగ్దానాలు చెయ్యడం, తిప్పి చంపడం, అతని కలవాటులేదు.

మార్టిన్ చాల యోగ్యమైన వాడనిపించుకున్నాడు. పాపభీతి, పారమార్ధికచింతా గలవాడై, ఆతడు యెప్పుడూ ఈశ్వరుణ్ణి ధ్యానిస్తూండే వాడు. ముసలితనం పైబడినకొద్దీ అతనిలో పారమార్ధిక చింత హెచ్చుతూ వచ్చింది. తన స్వంత దుకాణం పెట్టక పూర్వం, మరో యజమాని వద్ద జీతానికుండేటప్పుడే, అతని భార్య చనిపోయింది. అప్పటికాతనికి

మూడేళ్ళ వయసుగల కొడుకొక్కడు మాత్రం వుండేవాడు. అతనికి చాలమందే సంతానం పుట్టేరు. గాని అంతా చిన్నతనంలోనే చనిపోతూ వచ్చేరు. భార్య చనిపోయినకొత్తలో యీబాలుని కూడా తన సోదరిదగ్గిరికి పంపివేద్దామనుకున్నాడు. ఆమె ఒకకుగ్రామంలో వుంటూండేది. కాని. మిగిలిన ఆఒక్కబాలునిమీదా అతనికి మమత యెక్కువై, ఆతన్ని వదలలేకపోయేడు: "మా కపితోష్ నాదగ్గిరే వుంటాడు. పాపం, వాడు నన్నొదిలి వుండలేడు. కొత్తవాళ్ళదగ్గర వాడికసలే అలవాటులేదు. నాచిట్టి తండ్రిని నాదగ్గిరే వుంచుకుంటా."

యజమానిదగ్గర పని మానుకుని, కొత్తగా అద్దెకు తీసికొన్న యింట్లోకి మారేడు. అక్కడ, కొడుకుతో. ఓమాదిరిగా సుఖంగానేనన్ని చెప్పాలి, జీవయాత్ర నడుపుతూన్నాడు. రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోతున్నాయి. కొడుకు యెదిగి, చేతికందివస్తూన్నాడు. మార్టిన్ సంతోషానికి హద్దులేదు. కుమారుడు పనివాడై, సంపాదనాపరుడై, తన రోజులు చింపుతాడనే సంతృప్తితో, పితృహృదయం స్నేహస్నిగ్ధమై, పొంగుయివారేది. ఆరోజుల్లోనే పిల్లవానికి జ్వరం రావడం; వారం రోజులు తీవ్ర జ్వరంతో మంచంపట్టి, ఎనిమిదో రోజున తండ్రిని దుఃఖ సాగరంలో ముంచి. యీలోకం వదిలి పోవడం జరిగింది. మార్టిన్, కుమారునికి ఖనన సంస్కారాదులుచేసి, నిరాశాహతుడై, భారంగా జీవయాత్ర నడుపుతూన్నాడు. తననుకూడా తీసుకుపొమ్మని మరీమరీ దేవుణ్ణి ప్రార్థించేవాడు, కన ప్రియపుత్రుణ్ణి, ఏకైక సంతానాన్ని అంత చిన్నతనంలోనే తీసుకునిపోయి, ముసిలితనంలో కూడా తన్ను బతికించి వుంచినందుకు దేవుణ్ణి కఠినంగా నిందించేవాడు. ఆతర్వాత చెర్చికి పోవడం కూడా మానేశాడు. ఈశ్వరుడు కరుణామయుడనే విశ్వాసం అతనిలో సడలజొచ్చింది.

ఇట్లావుండగా ఒకరోజున మార్టిన్ బాల్య స్నేహితుడైన వృద్ధుడొకడాతన్ని చూడ్డానికి వచ్చేడు. వీరిద్దరిదీ పూర్వం ఒక గ్రామం. ఆవృద్ధుడు యెనిమిది సంవత్సరాలనుంచీ తీర్థయాత్రలు చేస్తూ, పుణ్యక్షేత్రాలన్నీ చూసేడు. త్రోయిష్టా మఠాన్ని దర్శించుకొని, దారిలో బాల్య స్నేహితుణ్ణి ఒకమాటు చూచి పోదామని వచ్చేడు. చాలాకాలానికి కలుసుకొన్న బాల్యమిత్రుని దగ్గర హృదయం విప్పి, తన దుఃఖమయ జీవితాన్నంతనీ యేకరువు పెట్టుకున్నాడు, మార్టిన్.

"పుణ్యాత్ముడా ! నాకింక జీవించాలని కూడ లేదు. భగవంతుణ్ణి నేను కోరేదేమంటే త్వరగా నన్ను కూడా తీసుకుపొమ్మనే. నాకీ ప్రపంచంలో కొంచెంకూడ ఆశలేదు." అన్నాడు, గద్గదికంతో.

"తమ్ముడా ! అట్లా కోరుకోడానికి నీకధికారం లేదోయ్. భగవంతుని చేతల్లో మంచి సెబ్బరలను నిర్ణయించలేము ; మనం అల్పజ్ఞులం. మనతర్కం, మన కోరికలు గాక ఈశ్వరేచ్ఛే నెరవేరుతుంది. నీకుమారుడు చనిపోయి, నీవు జీవించేవుండాలని ప్రభువు అభిప్రాయమైతే, అది శ్రేయస్కరమే ఐవుంటుంది, నాయనా. మనం, మన దుఃఖంలో, నిరాశలో అన్యథా భావిస్తూంటాము. ఎందుకంటే స్వార్థపరులమై స్వసుఖంకోసమే జీవించాలని కోరుతూంటాంగనక." అన్నాడా, వృద్ధుడు.

"మానవుడు, తన సుఖం కోసంగాక మరెందుకోసం జీవించాలేమిటి ?" మార్టిన్ అడిగేడు.

"భగవంతునికోసం, మార్టినూ. మనకీ జీవితాన్నిచ్చినది, భగవంతుడు. మనం ఆయనకోసమే జీవించాలి. నీవు నీకోసంగాక ఈశ్వరునికోసమే జీవించడం నేర్చుకోగలిగితే, నీకు దుఃఖనివృత్తిగలిగి తీరుతుంది. ఏది జరిగినా నీకు సహజంగానూ, సంతోషకరంగానూ వుంటుంది. ఆ ఈశ్వరుని చేతల్లో విచారించవలసిన దేముంది."

ఈమాటలు విని, మార్టిన్ ఆలోచనలో పడ్డాడు. కొంచెంసేపు నిశ్శబ్దంగా కూర్చుని. మళ్లీ ప్రశ్నించేడు: "దేవునికొరకే జీవించడం అంటే ఏమిటి? అదెట్లో చెప్పు."

"దేవునికొరకు జీవించడం యెట్లో క్రీస్తుప్రభువు చూపించే వున్నాడు. నీకు చదవడం వచ్చునా? వస్తే, బైబిలును కొని. చదువు తూండు. నీవెల్లా జీవించాలని ఈశ్వరుడు నిర్దేశించేడో అందులో వుంటుంది. కావలసినదంతా అందులోనే చూస్తావు." అని జవాబిచ్చేడు, వృద్ధయాత్రికుడు.

స్నేహితుని మాటలు మార్టిన్ హృదయంలో గాఢంగా నాటు కున్నాయి. ఆరోజే బజారుకిపోయి పెద్దచ్చు బైబిలు కొనుక్కొచ్చి, చదువు ఆరంభించేడు.

సెలవు రోజుల్లోనే చదువుతూందమని మొదట్లో అనుకున్నా ప్రారంభించగానే మనస్సును తేలిక పరచడం చూసి, నిత్యమూ బైబిలు పఠనం సాగించేడు, మార్టిన్. ఒక్కొక్కరాత్రి గ్రంథపఠనంలో మునిగి తన్మయుడై వున్నస్థితిలో దీపంలో చమురైపోయి, అయిష్టంగానే మార్టిన్ బైబిల్ మూసేసి పడుకోవలసి వచ్చేది. ప్రతీరాత్రీ చదవటం ఆతనికిప్పుడు అలవాటైపోయింది. చదివినకొద్దీ అతనిలో జ్ఞానోదయం కాజొచ్చింది. ఈశ్వరోద్దేశ్యమేమిటో, భగవంతుని కోసం జీవించడం అంటే యేమిటో మార్టిన్ క్రమంగా గ్రహించగల్గేడు. భారంగా వుండిన అతనిమనసు అననుభూతమైన సంతృప్తితో తేలిక కాజొచ్చింది. అదివ రలో రాత్రి పక్కమీదకి వెళ్లేటప్పుడు, బరువైన హృదయంతో, చని పోయిన ఏకైకపుత్రుని తలచుకుంటూ పండుకొనేవాడు. ఇప్పుడు హృదయభారాన్నంతనీ చేత్తో తీసేసినట్లయింది. ప్రతిరాత్రీ మార్టిన్, పండుకొనబోయేముందు ప్రార్థన చేస్తున్నాడు: "ఈశ్వరా! నీమహిమ

నెంతని వర్ణించగలను! నీసంకల్పముల నెవరెరుగుదురు! ప్రభూ! నీయిష్టమే జరుగనిమ్ము!"

అదిమొదలు మార్టిన్ జీవితమే మారిపోయింది. పూర్వం సెలవు రోజుల్లో హోటలుకుబోయి, టీ త్రాగేవాడు. అప్పుడప్పుడు స్నేహితులతో కలిసి ఒకటి రెండు గ్లాసులు 'వోడ్కా' * కూడా పుచ్చుకోడం కద్దు. ఒక్కొక్కప్పుడు కాస్త పుచ్చుకుని బైటికి వచ్చి, కులాసాగా చిలక పలుకులు పలికేవాడు, ఒళ్ళు మరచి పోకపోయినా, ఎవర్నో కేకలెయ్యడమో, అసందర్భంగా మాట్లాడ్డమో చేసేవాడు. ఇప్పుడదంతా గత చరిత్ర. అతడి జీవితం ప్రశాంతంగా, సుఖంగా నడుస్తోందిప్పుడు. రోజూ ఉదయాన్నే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, టీ త్రాగి పనిలో కూర్చునేవాడు. మళ్లీ సాయంత్రం పని కట్టిపెట్టి, సామానంతా సద్దుకుని, భోజనం చేసేక లాంతరు టేబిల్‌మీద పెట్టుకుని, చాలసేపు చదువుకుంటాడు. అతనిలోని సందేహాలూ, అపనమ్మకాలూ తొలగిపోయి. చదువుతున్నకొద్దీ మనస్సు ప్రస్ఫుటంకాజొచ్చింది.

ఒకరోజేమైందంటే, మార్టిన్ పొద్దుపోయేవరకూ మేలుకుని ఏకాగ్రంగా చదువుతూ కూర్చున్నాడు. 'లూకా సువార్త'లో ఆరో అధ్యాయంలో వున్నాడు:

"నిన్నొక చెంపపై కొట్టువానికి రెండో చెంప నిమ్ము; నీఉత్తరీయమును తీసికొని పోవువానికి అంగినికూడ యిచ్చివేయుము; నిన్నడిగిన ప్రతివానికీ నీవద్దనున్నవానినిమ్ము. నీవస్తువులను తీసికొన్నవారిని

---

* ఇది రష్యాలో సామాన్యులంతా త్రాగే మద్య ద్రవ్యం. దీన్ని 'రై' ధాన్యం నుంచి బట్టీపట్టి తయారు చేస్తారు. దీనిని త్రాగటం పెద్ద తప్పుగా రష్యనులు పరిగణించరు.

తిరుగ వానినిమ్మని అడుగకుము. పరులు నీకెట్లు చేయవలెనని కోరుదువో, అట్లే నీవు యితరుల కొనరింపుము. *

ఇవి చదువుతూంటే మార్టిన్ హృదయం ద్రవించింది. మనస్సు నిండినట్లయింది. ఇంకా చదువుతూన్నాడు :

"మీరు నన్నెందుకు పదేపదే ప్రభూ! ప్రభూ! అని పిలుస్తూ కూడా, నేను చెప్పినట్లు ఆచరించరు? ఎవరైతే నాదగ్గిరికి వచ్చి, నేచెప్పినది విని, ఆప్రకారం నడుచుకుంటారో వారు లోతైన పునాది తీసి యింటిని రాతితో కట్టిన వానివంటివారు. వరదలు వచ్చినప్పుడు, ప్రవాహం పొంగుతూ నాలుగువైపులా ఆయింటిని ఉద్రుతంతో తాకుతుంది కాని ఆయిల్లు చెక్కుచెదరక నిలబడుతుంది. ఎందుకంటే, అది గట్టిపునాది పై కట్టబడింది గనక. కాని, యింకోడు నామాటలన్నీ వింటాడు ; ఆచరణ మాత్రం శూన్యం. అట్టివాడు, తన యింటిని నేలమీద కట్టినవాని వంటివాడు. వరదలువచ్చి, ప్రవాహం హెచ్చి, మొదటి తాకిడికే అట్టి యిల్లు గుభుక్కుని కూలుతుంది. అట్టి యింట సర్వనాశనం తప్పదు."

ఈవాక్యాలు చదువుతూంటే మార్టిన్ హృదయం ఆనంద తరంగితమైపోయింది. మెల్లిగా కళ్ళజోడు తీసి, పుస్తకంమీద పెట్టి, టేబిల్ మీద మోచేతులానించి, ఆలోచనా నిమగ్నుడై చాలసేపు కూర్చుని, తన జీవితం యీఆప్తవాక్యాలకి అనుగుణ్యంగా వుందా? అనే ధ్యాసలో పడ్డాడు ; మార్టిన్.

---

* కం॥ ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియంబు దనమ • నమున కగు, దా
నొరుల కవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ • పథములకెల్లన్॥ —మహాభారతము.

"నాయిల్లు రాతిపునాదిమీద కట్టబడిందా? యిసుక మీద నిర్మించబడిందా? రాతిపునాదే అయితే సరేసరి. ఇక్కడ ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తే అంతా బాగున్నట్లే వుంటుంది. ఈశ్వరాజ్ఞను అక్షరాలా అనుసరిస్తూన్నట్లే అనుకుంటాం. మళ్లీ, ప్రపంచములోకి వెళ్ళి, గందరగోళాల్లో అజాగ్రత్తలో పడిపోయి, పాపాలు చేస్తూనే వుంటాము. కానీ, ఈశ్వరకృపవల్ల నేను పాపాచరణనుంచి దూరంగా వుందునుగాక! ఇట్టి ఆలోచనే నాకు కొండంత ధైర్య సంతోషాల నిస్తూంది! ప్రభూ! ఈబలహీనునికి సాయంచెయ్యి!"

ఇట్లా ఆలోచిస్తూ, యింక పండుకొనేందుకు పోదామనుకున్నాడు. కాని, పుస్తకం వదలబుద్ధి పుట్టక, మళ్లీ చదువనారంభించేడు. ఏడో అధ్యాయం చదువుతూయున్నాడు,- శతాధిపతి, విధవరాలి కుమారుడు, జాన్‌శిష్యులకు జవాబు,- చదువుతూధనికుడైన ఫారిసీ క్రీస్తును తన యింటికాహ్వానించిన ఘట్టానికి వచ్చేడు. పాపియైన ఒక స్త్రీ ప్రభువు పాదాలకి సుగంధ తైలంరాచి, తన కన్నీటితో కడిగింది; ఆమెను ప్రభువు కటాక్షించేడు. కథ సాగుతూంది. నలభైనాలుగో పేరా వచ్చింది:

"ప్రభువు, సైమనుపైపు తిరిగి, ఆస్త్రీ నుద్దేశించి యిట్లన్నాడు: నీవాస్త్రీని చూసేవుకదూ? నేను మీయింటికి వచ్చేను. నీవు నాకు పాద ప్రక్షాళనానికి ఉదకంకూడాయివ్వలేదు. ఆమె నాకాళ్లను తన కన్నీటితో కడిగి, కురులతో తుడిచింది. నీవు! నన్ను ఒక్కసారీ ముద్దు పెట్టుకోలేదు. ఆమె! నేను వచ్చినప్పటినుంచీ నాపాదాన్ని ముద్దిడుతూనేవుంది! నాతలకు నూనెకూడ యివ్వలేదు నువ్వు. ఆమె, నాపాదాలకే సుగంధ తైలం రాచింది!"

ఇట్లా చదువుతూంటే, మార్టినుకి ఒక ఆలోచన పుట్టింది. "ఆయన ప్రభువు పాదాలకి నీళ్ళివ్వలేదు, ముద్దు పెట్టలేదు, తలకు నూనె పూయ

లేదు!........" మళ్ళీ మార్టిన్ కళ్ళజోడు తీసి పుస్తకంమీద పెట్టి, ఆలోచించ నారంభించేడు.

"ఆ ఫారిసీ నాసంటివాడే అయివుంటాడు. అతడూ కేవలం తనను గూర్చే ఆలోచించుకుంటూండి వుంటాడు — ఓకప్పు టీ సంపాదించడం యెల్లాగా? వెచ్చగా, సుఖంగా వుండడం యెట్లాగా? ఎంతసేపూ తన సుఖమేగాని, అతిధినిగూర్చి అతడాలోచించనేలేదు. అయ్యయ్యో! ఎంత మాట? ఆ అతిధి యెవరు? ప్రభువే! ఆప్రభువు నాయింటికి వస్తాడా? వస్తే, నేను అట్లాగే ప్రవర్తిస్తానా?"

అట్లా అనుకుంటూ రెండు చేతుల్లోనూ తలమోపి ఆలోచిస్తూంటే, అకస్మాత్తుగా కునుకు పట్టింది.

"మార్టిన్!" అని యెవరిదో గొంతు చెవి దగ్గరగా పిలిచినట్లై, ఉలికిపడి లేచి, "ఎవరది" అన్నాడు.

ద్వారంవైపు చూసేడు. ఎవరూలేరు. మళ్లీ 'ఎవరువారు?' అని కేకేసేడు. ఈసారి స్పష్టంగా "మార్టిన్! రేపు వీధులోకి చూస్తూండు, నేను వస్తా." అన్నట్లు వినిపించింది.

మార్టిన్ మేలుకుని, కుర్చీలోంచి లేచి, కళ్లు నులుముకున్నాడు. ఆమాటల్ని తాను కలలోనే విన్నాడో, మేలుకొని వుండగానే విన్నాడో నిశ్చయించుకోలేకపోయేడు. దీపం ఆర్పి, వెళ్ళి పడుక్కుని, నిద్ర బోయేడు.

మార్టిన్ మరునాడుదయం యింకా చీకటి వుండగానే లేచేడు. ప్రార్థనచేసుకుని, పొయ్యి అంటించేడు. మామూలుగానే కాచేటిపులుసు, గోధుమజావ పొయిమీద పడేసి, నామోవార్‌కూడా వెలిగించేడు. టీకోసం సరంజాం అంతా సిద్ధపరిచి, దుస్తులు వేసుకుని, కిటికీదగ్గర పనిలో నిమగ్నుడయ్యాడు. కాస్పుని పనిచేసుకుంటూనే, మార్టిన్ గతరాత్రి జరిగిన

దాన్ని గురించి ఆలోచిస్తూన్నాడు. అదంతా స్వప్నంగా ఒక మాటు తోచేది; యింకోసారి తాను నిజంగా మాటలు విన్నట్టే నిశ్చయించుకొనేవాడు.

"ఇట్లాటి సంగతు లిదివరకెన్నో జరగలేదా ఏమిటి?" అని చివరకి సమాధానం చెప్పుకుని, తృప్తిపడ్డాడు

కిటికీలోంచి వీధులోకి చూడ్డమేగాని ఆరోజున పనేమీ సాగడం లేదు. ఎవరేనా తాను గుర్తుపట్టలేని: బూట్లతో వీధులో నడుస్తూంటే, బాగా వంగి, వాళ్ళ ముఖాలు పరిశీలిస్తూన్నాడు. వంగి చూడకపోతే వాళ్లే గాని మరేమీ కన్పించదాయెను. మరి. ముందుగా ద్వారపాలకుడొకడు కొత్త ఫెల్టుబూట్లు కొడుక్కుని వెళ్లేడు; తర్వాత నీళ్ళు మోసేవాడు వెళ్లేడు. అంతలోనే జార్‌నికోలస్ కాలంనాటి వృద్ధ సైనికుడొకడు, స్పేడు పట్టుకుని కిటికీ కెదురుగా కన్పించేడు. బూట్లనిబట్టి, మార్టిన్ అతన్ని పోల్చుకున్నాడు. అతనివి పాత ఫెల్టు బూట్లే కాని వాటిపైన తోలుతో కుట్టిన గొలోష్‌లు (మంచులో కాపుదలకోసం పైన తొడుక్కునే అదనపుజోడు) తొడుక్కున్నాడు. అతని పేరు స్టెపానిచ్. వృద్ధుడని దయవలచి ఆప్రక్క కాపురముంటూన్న వర్తకుడు, స్టెపానిచ్‌ని తన యింట్లో వుండనిచ్చేడు. ద్వారపాలకునికి సాయంగా వుంటూండడం తప్ప యితనికి మరోపనిలేదు. కిటికీకెదురుగా మంచును తుడుస్తూన్నాడు, స్టెపానిచ్. ఒకమాటు తలెత్తిచూచి, మళ్ళీ తనపనిలో నిమగ్నుడయేడు, మార్టిన్.

తన భ్రమ తలుచుకుంటే తనకే నవ్వొస్తూంది. "ముసలితనం రావడంతో నాకు మతిపోతోందేమో! స్టెపానిచ్ మంచు తుడవడానికి వస్తూంటే, క్రీస్తు ప్రభువు నాకోసం వస్తూన్నాడనుకుంటాను, నేను! మతిపోతూందేమో. నాకు!"

అనుకుంటున్నాదేగాని పది కుట్లు కుట్టేటప్పటికి మళ్లీ కిటికీలోంచి పైకి చూడాలనిపించింది. మనస్సు, కళ్లూ, అటుపై పే లాగుతూన్నాయి. వీధులో ముసలి స్టెపానిచ్, తన పారను గోడకు చేరవైచి, విశ్రాంతి తీసుకుంటూ, వెచ్చదనంకోసం చేతులు రాసుకుంటున్నాడు. అతడు బాగా ముసలివాడై పోవడమేగాక నీరసంగా కూడా వున్నాడేమో, మంచు తుడవడానికి కూడా అతనిలో బలం లేకపోతూంది.

"అతణ్ణి లోపలికి పిలిచి, కాస్త టీ యిస్తా. సామోవార్ మోత పెడుతూందప్పుడే. ఇంతట్లోకి పోయిందేమిటి!" అనుకుంటూ, మార్టిన్ కంతాణీని మైనంలోగుచ్చి, లేచేడు. సామోవార్‌ను టేబిల్‌మీద వుంచి, టీ కలిపేడు. కిటికీ దగ్గిరికి వెళ్ళి, వ్రేళ్ళతో అద్దాలమీద కొట్టి, చప్పుడు చేసేడు. స్టెపానిచ్ బైటనుంచి కిటికీని సమీపించేడు. మార్టిన్ అతణ్ణి లోనికి రమ్మని సంజ్ఞచేసి, వెళ్ళి తలుపుతీసి,-

"లోపలికి రా. కొంచెం చలికాచుకో, నెగడి వేడిగానేవుంది. పాపం, నీకు చాలా చలిగావుండి వుంటుంది." అన్నాడు.

స్టెపానిచ్‌కి ఎంతో సంతోషమైంది. "ఈశ్వరుడు నిన్నాశీర్వదిస్తాడు! చలికి నాయెముకలు కూడా కటకట లాడిపోతున్నాయి." అంటూ లోనికివచ్చి, గుమ్మందగ్గరే మంచు దులుపుకున్నాడు. నేలంతా తడిసిపోతుందేమోనని కాళ్లు కూడా తుడుచుకుంటూంటే, తూలి, పడిపోబోయేడు.

"కాళ్ళు తుడుచుకోనక్కర్లేదులే, నేనెల్లాగా నేల తుడుస్తానుకదూ? అదంతా నాకు నిత్యకృత్యంలోదే రా, మిత్రమా. నెగడి దగ్గర కూర్చుని. కొంచెం టీ పుచ్చుకో."

అంటూ, రెండు గ్లాసులనిండా 'టీ' నింపి, ఒకటి అతిథికిచ్చి, తన గ్లాసులో టీని సాసరులో పోసి, ఊదుతూ, త్రాగనారంభించేడు.

స్టైపానిచ్ తన గ్లాసు ఖాళీచేసేసి, బోర్లించి,* మిగిలిన పంచదారను దానిమీద వుంచేడు. టీ యిచ్చినందుకు మార్టిన్‌కు కృతజ్ఞత తెలుపుతూన్నాడేగాని యింకోగ్లాసు పుచ్చుకోడాని కభ్యంతరంలేదని అతని వైఖరే తెలుపుతూంది. మార్టిన్ యింకోగ్లాసు నింపుతూ అన్నాడు.

"ఈగ్లాసుకూడా పుచ్చుకో, అన్నా!" స్టైపానిచ్, గ్లాసుయెత్తి టీ త్రాగుతూన్నాడు. గాని, మార్టిన్ తన గ్లాసు అట్లేవుంచి, మాటిమాటికీ వీధివైపు చూస్తూనే వున్నాడు.

"నువ్వెవరికోసమేనా నిరీక్షిస్తూన్నావా?" అనడిగేడు, అతిథి.

"ఎవరికోసం చూస్తూన్నానంటావా? ఏమని చెప్పాలో తెలియడం లేదు. చెప్పడానికే సిగ్గేస్తూంది. నిజంగా నేనెవరినీ నిరీక్షించడం లేదు; కాని, నిన్నరాత్రి నేను విన్న మాటలు మరిచిపోలేకుండా వున్నాను, అది కేవలం నాభ్రమేనేమో, చెప్పలేను. తెలిసిందా? మిత్రమా! గడిచినరాత్రి సువార్తలు చదువుతూన్నా, ఆప్రభువును గూర్చి. ఆయన యెన్ని కష్టాలు మానవుల కోసం పడ్డాడో, ఆయన యీ భూమిమీద యెట్లా నడిచేడో, అంతా చదువుతూన్నా. నువ్వు, వినేవుంటావు, ఆచరిత్రంతా, ఏం?"

"ఇతరులు చెపుతూంటే విన్నానంతే. నేను అక్షరాలు రాని మూర్ఖుణ్ణి, పుస్తకాలు చదవలేను." అన్నాడు, అతిథి.

"ఆహాం! అల్లాగా. ఆప్రభువు భూమిమీద యెట్లా నడిచేడో చదువుతూన్నా. ప్రభువు తనయింటికి వచ్చినపుడు సరిగా ఆదరించని ఆఫారిసీ కథ దగ్గిరికి వచ్చేను. ఆఫారిసీ, ప్రభువును అతిథిగా పొంది కూడా సరిగా మర్యాద చేయలేకపోయేడు! అదేనాకు జరిగినట్లైతే, ప్రభు

---

* దీనికర్థం, నాకు వలసినంతా పుచ్చుకోవడం అయింది. చాలునని. రష్యాలో యిది సాంప్రదాయం.

వును గౌరవించడానికి నేను చేయనిదేముంటుంది? ఆతడు ప్రభువును మర్యాదచేయలేదు! ఇట్లా తలపోస్తూంటే, చల్లగా ఒక్క కునుకు పట్టింది. అంతలో యెవరో పిలుస్తూన్నట్లై, మెలుకువ వచ్చింది. ఎవరో చెవిదగ్గర మెల్లిగా అన్నట్లయింది: 'నిరీక్షించు. రేపు నేను వస్తాను.' ఇట్లా రెండుసార్లు జరిగింది. నిజం చెప్పాలంటే. నామనస్సంతా యీఆలోచనతోనే నిండిపోయింది. అనుకోడానికే సిగ్గేస్తూంది. ఆప్రభువుకోసమే నిరీక్షిస్తూన్నాను, నిజానికి!"

స్టెపానిచ్ మౌనంగా తలపంకించేడు. గ్లాసు ఖాళీచేసి, టేబిల్ మీద బోర్లించేడు. కాని, మార్టిన్ ఊరుకోలేదు. గ్లాసు మళ్లీ తిరగతీసి, టీ పోస్తూ;

"అన్నా; ఇదికూడా పుచ్చుకో. ప్రభువు నిన్ను రక్షించుగాక! నేననుకుంటూన్నదేమిటంటే, ఆయన భూమిమీద అవతరించి, యెవరినీ ద్వేషించకుండా ఎట్లా వున్నాడా? అని. బీద ప్రజల్లోనే కలిసి తిరుగుతూండేవాడు కూడాను. అజ్ఞానులమధ్య మెలగుతూ, కేవలం మనబోటి సామాన్యుల్లోంచే తన శిష్యుల నెంచుకున్నాడు! పాపులం, రెక్కాడితే గాని డొక్కాడని కష్టజీవులం, మనం. మనంటివాళ్లు, ప్రభువు శిష్యులు! ఆయనేమన్నాడు:" ఎవడైతే అధికారమత్తుడో వాడు వినీతుడుగా చేయబడును. ఎవరు హీనస్థితిలో నున్నారో వారు అధికారంలోనికి రాగలరు. "అంతేగాదు." మీరు నన్ను ప్రభూ! అని పిలుస్తారు. నేనో మీపాదములు కడుగుతాను." ఇంకా అన్నాడు. "ఎవడు మొదటివాడుగా ఉండ గోరునో, వానిని అందరికీ సేవకుడుగా వుండనిమ్ము. ఎందుచేతనంటే, బీదలు, అమాయికులు, నిరాడంబరులు, దయామయులు, సాధుపురుషులు అగువారే ఈశ్వరకృపకు అర్హులని లెంపయండి! "పేదసాదలపై ఆప్రభువు కెంతదయ!" అన్నాడు మార్టిన్.

స్టెపానిచ్, టీ త్రాగడమే మరిచిపోయేడు. బహు వృద్ధుడేమో, అతనికి యిష్టేనీరు కండ్ల వచ్చేస్తుంది. మార్టిన్ మాటలు వింటూంటే ఆతని కళ్ళవెంట నీరు ధారగా ప్రవహిస్తూంది.

"ఇంకొంచెం పుచ్చుకో, నేస్తమా!" అంటూనే వున్నాడు, మార్టిన్. కాని, స్టెపానిచ్ క్రాస్ * చేసుకుని, కృతజ్ఞత తెలుపుతూ, గ్లాసును దూరంగా నెట్టి, లేచి నిల్చున్నాడు.

"మార్టిన్! వందనాలు. నాశరీరానికీ, మనస్సుకీ కూడ ఆహారం, ఆనందం యిచ్చేవు. కృతజ్ఞుణ్ణి!"

"నువ్వు రావడమేనాకు పదివేలు. మళ్లీ యెప్పుడేనా వస్తూండు. అతిథితో కూర్చోడమంటే నాకు పరమసంతోషం."

స్టెపానిచ్ సెలవు పుచ్చుకుని వెళ్లిపోయేడు. మిగిలిన టీ కూడా గ్లాసులో ఒంపుకొని త్రాగి, సామాను సర్దేసి, పనిలోకివెళ్ళి కూర్చున్నాడు, మార్టిన్. బూటు ఒకటి తీసి పైకుట్టు కుడుతూన్నాడు. కుడుతూకూడా మార్టిన్ మాటిమాటికీ కిటికీలోంచి బైటికి చూస్తూ ప్రభువును గూర్చే ఆలోచిస్తూన్నాడు. క్రీస్తు జీవితచర్యలూ, ఆయన బోధనలూ మార్టిన్ మెదడునంతా ఆక్రమించుకుని కూర్చున్నాయి.

ఇద్దరు సోల్జర్లు వీధమ్మట వేళ్లేరు. వాళ్లల్లో ఒకడు గవర్నమెంటు బూటూ, యింకోడు స్వంతబూటూ తొడుక్కొని వున్నారు. ఆతర్వాత పొరుగునవున్న ధనికగృహస్థు, మెరుస్తూన్న గాలోష్‌లు ధరించి, పిమ్మట రొట్టెల వాడు పెద్దబుట్టను మోస్తూనూ నడిచిపోయేరు. వాళ్లు వెళ్లేక ఒక స్త్రీ చిరిగిపోయిన స్టాకింగులు, మోటు జోడూ తొడుక్కొని

---

* క్రైస్తవులు భక్తి పురస్సరంగా తమ హృదయంమీద + అనే గుర్తును చేతులతో అభినయిస్తారు, మౌనంగా. మనం 'ఈశ్వరా!' అనుకుంటూ, చేతులు జోడించి, ఆకాశంవైపు మోడ్చినట్లన్నమాట.

వచ్చింది. ఆమె కిటికీ దాటింది గాని గోడదగ్గరగా నిలబడిపోయింది. మార్టిన్ వంగి ఆమె వైపుచూసేడు. ఆమె ఎవరో అపరిచితురాలు. వంటి నిండా బట్టకూడా లేదు. చేతుల్లో చంటిబిడ్డకూడాను. గోడవైపు తిరిగి వీపును గాలివీస్తూన్నవైపుకు పెట్టి. చలిగాలికి కొంకరించుకు పోకుండా చంటిబిడ్డను పీలికలతో కప్పుతూంది. ప్రయత్నమేగాని కప్పడానికంటూ ఆమెదగ్గర గుడ్డలేవి? ఆమె ధరించినవే వేసవిదుస్తులు. అవైనా చిరిగి. పీలికలైవున్నాయి. బిడ్డ యేడుపు కిటికీగుండా మెల్లిగా వినిపించుతూంది. పాప మా తల్లి. బిడ్డనూరడించడానికి యత్నించుతూందే కాని బిడ్డ ఊరు కోడు. మార్టిన్ లేచి. బైటికివచ్చి ఆమెను పిలిచేడు.

"అమ్మా! ఓ అమ్మా!"

ఆమె విని. వెనక తిరిగి చూసింది.

"చంటిబిడ్డతోకూడా అక్కడ చలిలో యెందుకు నిల్చున్నావు? రా. తల్లీ. లోపలికిరా. కొంచెం వెచ్చనిచోటు వుంటే బిడ్డడికి బాగా కప్పదువుగానిలే. ఇట్లా రామ్మా. లోనికి!"

ఆమెకి చాలా ఆశ్చర్యం కలిగింది. మాపుగుడ్డ * ధరించిన ఒక ముసిలివాడు. కళ్ళజోడు మీదనుంచి చూస్తూ. తనను పిలుస్తూంటే ఆశ్చర్యంకలిగినా. ఆమె మాటాడకుండా అతని వెనకనే యింట్లోకి పోయింది.

గుమ్మాలెక్కిదిగుతూ. లోపలిగదిలోకి వెళ్ళి. నెగడిదగ్గరగా తీసి కెళ్ళేడామెను. మార్టిన్.

"అమ్మా! అదుగో నెగడిదగ్గరగా. ఆమంచంమీద కూర్చో. చలి కాచుకుంటూ. బిడ్డకి పాలియ్యి."

---

* పనిలో వుండే సమయాల్లో కార్మికులు తమ బట్టలు మురికికాకుండా పైన కట్టుకునే గుడ్డ వంటిది. దీన్నే 'అప్రాన్' అంటారు.

"పాలు యెక్కడివి? నాకు యీరోజంతా తిండేలేనిదే." అన్నదే కాని, బిడ్డను అడ్డాల్లో వేసుకుని, పాలు నములబెట్టింది.

మార్టిన్ తలూచేడు. లోపలికి వెళ్ళి రొట్టే, పళ్ళెమూ పట్టుకొని వచ్చి, ఓవెన్ (నెడిగమీద నిర్మించిన అరుగులో వంటకాలుంచుకొనే అలమార) తలుపు తెరచి అందులోని కేబిజిపులుసు కంచంలో పోసేడు. జావ తయారయిందేమోనని చూసేడు కాని అదింకా అవలేదు. అందు కని టేబిల్‌మీద గుడ్డపరచి, పులుసు కంచం, రొట్టెమాత్రం దానిమీద వుంచేడు.

"కూర్చుని, తినుతల్లీ. పిల్లవాణ్ణి నేను చూస్తాలే. నాకూ బిడ్డలుండే వారు. అంతా ఈశ్వరేచ్ఛ! అమ్మా! పిల్లల్ని ఊరుకోబెట్టడం నాకూ చేతవును."

ఆస్త్రీ, క్రాస్ చేసికొని, టేబిల్‌దగ్గర కూర్చుని, భోజనం చేస్తూంటే, మార్టిన్ పిల్లవాణ్ణి మంచంమీద పడుకోబెట్టి, ప్రక్కనే కూర్చుని నోటితో 'క్లక్ - క్లక్' మంటూ వాణ్ణి మరిపించి, యేడుపు మానిపించాలని యత్ని స్తున్నాడు. కాని, బోసినోటితో ధ్వని సరిగా రావటంలేదు; పిల్లడు యేడుపు మాననూలేదు. ఆప్రయత్నం ఫలించక, యింకో ఉపాయం చేసేడు. చూపుడువ్రేలు పిల్లవాని నోటిదాకా రానివ్వడం, చటుక్కున వెనక్కి లాక్కోడం.- యిట్లాగే మళ్లీ మళ్లీ చేస్తూన్నాడు. వ్రేళ్ళన్నీ బొళ్లు కుట్టడాని కుపయోగించే మైనంతో ఖరాబుగావున్నాయి. అంచేత, పిల్లవాని నోటికి వ్రేలుమాత్రం అందించలేడు. మొదట్లో పిల్లవాడు, ఆవ్రే లిని తదేకదృష్టితోచూస్తూ, ఊరుకుని, కొంచెంసేపట్లోనే బోసినోటితో నవ్వ నారంభించేడు. మార్టిన్‌కి బ్రహ్మానందం అయిపోయింది.

ఆమె భోజనంచేస్తూ, కబుర్లు చెపుతూంది. తనెవరో యెక్కడ వుండేదో, అంతా చెపుతూంది.

"నాభర్త, మిలటరీలో వున్నాడు. ఎనిమిది నెలలక్రితం, అతన్నెక్కడికో, దూరానికి పంపించేరు. అప్పటినుంచీ అతడికబురే తెలియ లేదు, నాకు. నేను ఒక సంపన్నుల యింట్లో వంటచేస్తూండేదాన్ని. బిడ్డ పుట్టింతర్వాత, నాపని వారికక్కర్లేదన్నారు. మూడు నెలలనుంచీ, నానా పాట్లూ పడుతూన్నా. ఎక్కడా పనికే పెట్టుకోరు, నన్ను! అదివరకున్న చెంబు తప్పేలా కూడా అమ్ముకుతిన్నాం. ఆతర్వాత యెక్కడేనా 'పాల తల్లి'గా వుండటానికి యత్నించేను. ఎవరూ అక్కర్లేదనేవారే. నేను చిక్కిపోయి వున్నానట! సరిగా కడుపునిండా తిండి వుంటేకాదూ, బలిసి వుండడానికి? ఇప్పుడే ఓవర్తకుని భార్య దగ్గరికివెళ్ళి వస్తున్నాను. ఆమె దగ్గర, మావూరిదే ఒకామె పనిచేస్తూందిలే. ఆవర్తకుని భార్య నన్ను వుండమంది. అంతా సవ్యంగానే జరిగిందనుకుంటూంటే, యింతలోనే మరో పుట్టమునకొచ్చి పడింది. ఓ వారంరోజులు పోయేక రమ్మనమందామె! ఇంకేంచేసింది? వాళ్ళయిల్లు చాలా దూరం. నాకూ ప్రాణం చాలొచ్చింది బిడ్డడికి ఆకలి, పాపం. నాచిట్టితండ్రి మాఅదృష్టం బాగుండి, మమ్మల్ని జాలిదలచి ఒకామె తలదాచుకునేందుకు చోటిచ్చింది. కాని, లేకపోతే యేమైపోయేవాళ్ళమో!"

మార్టిన్ నిట్టూర్చేడు. ఏమంటానికీ తోచలేదు.

"ఇంతకంటె మంచి బట్టలు, చలికి ఆగేవి, లేవూ?"

"నాకు వెచ్చని బట్టలా? ఎక్కడివీ? చివరకి నాశాలువా ఒకట్టీ కూడా నిన్ననే ఆరు పెన్నీలకి తాకట్టు పెట్టాల్సి వచ్చింది." అంది ఆమె.

భోజనం ముగించి వచ్చి, బిడ్డడిని తీసుకుందామె. మార్టిన్ లేచి వెళ్ళి, గోడను వ్రేలాడుతూన్న బట్టల్లోంచి, ఒకపాత అంగీ తెచ్చేడు.

"ఇదిగో, ఇది కప్పు బిడ్డకి. అదీ పాతదై, చిరిగిపోయింది. కాని చంటిబిడ్డకి కప్పడానికి పనికివస్తుంది."

ఆస్త్రీ, అంగీపైపొకసారీ, ఆవృద్ధునిపై పొకసారీచూసి, అంగీ నందుకుంటూంటే, కళ్ళ నీళ్లు, పొంగిపొర్లి వచ్చేసేయి. మార్టిన్ మొగం ప్రక్కకి త్రిప్పుకుని, పరుపుదగ్గిరికివెళ్ళి, దాని క్రిందినుంచి ఓచిన్న ట్రంకు బైటికి తీసేడు. దాంట్లో చెయ్యిపెట్టి యేదో వెతికి, కొంచెం పేపయేక, ఆస్త్రీ యెదుటికి వచ్చి కూర్చున్నాడు. ఆమె గద్గదికంతోనే అంది :

"ఈశ్వరుడు నిన్ను రక్షిస్తాడు, బాబూ! క్రీస్తు ప్రభువే నన్ను నీకిటికీ దగ్గిరికి పంపివుంటాడు. లేకపోతే నాబిడ్డడు చలికి కొయ్యబారి పోను. నేను బైలుదేరినప్పుడు అంత చలిగా లేనేలేదు. అంతలోనే యెంత చలి హెచ్చిపోయిందో! సరిగ్గా సమయానికి నిన్ను కిటికీలోంచి చూడమని, ప్రభువే ఆజ్ఞాపించి వుండాలి! నీదయేకనక లేకపోతే, మావంటి దీనులగతి యేమయ్యేదో?"

మార్టిన్ చిరునవ్వుతో జవాబిచ్చాడు :

"ఔను! నిజమేతల్లీ! నువ్వన్నది. ఆప్రభువే నన్ను కిటికీలోంచి చూస్తూండమన్నాడు. ఏమీ కారణంలేనిదే ఊరికేనే చూడ్డంలేదు, నేను!"

అంటూ తనస్వప్నవృత్తాంతం అంతా ఆమెతో చెప్పేడు, మార్టిన్. ప్రభువు మాటలు తాను విన్నసంగతీ ఆయన మర్నాడు వస్తానని చెప్పి నట్లూకూడా చెప్పేడు.

"ఎవరు చెప్పగలరు? దేన్నీ అసంభవ మనటానికి వీల్లేదు." అంటూ ఆస్త్రీ లేచి, పాత అంగీని బుజంమీద వేసుకుని, పిల్లవానిని దానితో బాగా కప్పింది. తన కృతజ్ఞత నింకొకసారి తెలుపుతూ, వంగి నమస్కరించింది, మార్టిన్‌కి.

"క్రీస్తుకోసం యిది తీసుకో" అంటూ మార్టిన్ ఆమెచేతిలో ఆరు పెన్నీలు వుంచేడు. తాకట్టుపెట్టిన శాలువా విడిపించుకోడానికని

అడబ్బులు యిచ్చేడు. ఆమె నిలబడే గంభీరంగా క్రాస్ చేసుకుంది. మార్టినూ క్రాస్ చేసుకొన్నాడు. సెలవు తీసికొని, ఆమె వెళ్ళిపోయింది.

ఆమెను పంపించేసి వచ్చి, మార్టిన్ కొంచెం రొట్టీ, కాబేజీ పులుసూ కంచంలో పెట్టుకుని తిని, సామానుసర్ది, మళ్లీ పనిలో చతికిలపడ్డాడు. పని చేసుకుంటూన్నాడన్న మాటేగాని, కిటికీ లోంచి చూడ్డం మరిచిపోలేదు. కిటికీమీద ఏదో నీడపడ్డప్పుడల్లా, యెవరా వెడుతూన్నదని పరిశీలించి చూస్తునే వున్నాడు. అతను యెరిగున్నవాళ్లూ, యెరగని వాళ్లూ యెందరో దారిని వెడుతూనే వున్నారు. ప్రత్యేకించి చెప్పదగిన విశేషం ఏమీ జరుగలేదు

కొంతసేపయ్యేక ఆపిల్‌పళ్ళు అమ్ముకునే ముసిలిది కిటికీ యెదురుగావచ్చి నిలుచుంది. ఆమె నెత్తిమీది గంప పెద్దదేగాని అది బరువుగా వున్నట్టులేదు. బహుశా పళ్ళు చాలభాగం అమ్మేసి వుంటుంది. వీపుమీద చెక్క పేళ్లతో నిండిన బస్తా ఒకటి వుంది. ఎక్కడో యిల్లు కట్టుకుంటూన్నదగ్గిర చెక్క పారేసిన పేళ్లూ, చిత్రికపొట్టూ పోగుచేసి, పొయిలోకి పనికొస్తాయని యింటికి పట్టుకెడుతూంది, ముసిలిది. సంచిలో పేళ్ళు గుచ్చుకొంటున్నాయేమో. బుజం మార్చుకుందామని అక్కడ నిలబడి, రోడ్డుప్రక్కగా సంచీని దించింది. నెత్తిమీది పళ్ళ గంపను ఆప్రక్కనేవున్న పిట్టగోడమీద పెట్టి, సంచిని కుదిస్తూంది. ఆమె యీపనిలో వుండగా, ఒక పిల్లవాడు పరుగునవచ్చి గంపలోని ఆపిల్ పండు ఒకటి యెత్తుకుని, తుర్రున పరుగెడుతూన్నాడు. ముసలమ్మ వాణ్ణి కనిపెట్టిందేమో, చటుక్కున అటుతిరిగి, వాడి చొక్కా లంకించుకుని పట్టుకుంది. పారిపోదామని కుర్రవాడు పెనుగులాడుతూన్నా ఆమె వదలలేదు. రెండు చేతుల్తో చొక్కా పట్టుకు లాగుతూ, నెత్తిమీది మాసిన, చిరుగుల టోపీ యెగరగొట్టేసి, జుట్టుపట్టుకుంది. ఆమె తిట్టడం,

పిల్లవాడు యేడుస్తూ, అరుస్తూండడం విని, మార్టిన్ తనపని అక్కడే పడేసి, గభుక్కున బైటికి వచ్చేడు. గుమ్మంలో తూలిపోతూ, కళ్ళజోడు ఊడి దారిలో పడిపోయి, వీధిలోకి పరుగెత్తేడు. అప్పటికి ముసిలిది ఆబాలుని జుట్టు గుంజుతూ, తిడుతూ, పోలీసుస్టేషన్‌కి తీసుకెడతానంటూంది; పిల్లవాడు విదిలించుకొంటూ, గదమడానికి యత్నిస్తూ, "నేనేమీ తీయందే. నన్నెందుకు కొడతావు? వుండు, నన్నెళ్ళనీ!" అంటున్నాడు.

మార్టిన్ యిద్దర్నీ విడదీసి, పిల్లవాని చేయి పట్టుకుని "అవ్వా! వాణ్ణి వొదిలెయ్యి. క్రీస్తుకోసం, వాణ్ణి క్షమించు." అన్నాడు. ముసిలిది ఊరుకోడంలేదు.

"వాడిరోగం నే కుదురుస్తా. మళ్ళీ వాడిజీవితంలో మరిచిపోకండా జ్ఞాపకం వుంచుకునేలాచేస్తా వెధవ! చచ్చువెధవా అంటా పోలీసులకి అప్పగిస్తా!"

మార్టిన్, ముసలిదాన్ని బ్రతిమాల నారంభించేడు.

"అవ్వా! వాణ్ణిపోనీ. మళ్ళీ యెప్పుడూ చెయ్యడులే. క్రీస్తుకోసం, వాణ్ణి క్షమించి వొదిలిపెట్టు."

ముసిలిది పిల్లవానిని వొదిలింది. వాడు పారిపోవాలనుకున్నాడు. కాని, మార్టిన్ వాణ్ణి పట్టుకుని ఆపేడు.

"అవ్వను క్షమార్పణవేడుకో! మళ్ళీ యెప్పుడూ యిట్లాంటి పాడుపని చెయ్యకేం. నువ్వు ఆపిల్‌పండు తీస్తూంటే నేను చూసేను."

పిల్లవాడు వెక్కుతూ, యేడ్పు ప్రారంభించేడు. ఆయేడ్పులోనే ముసలమ్మను క్షమార్పణ వేడుకుంటున్నాడు.

"ఆఁ! అంతే. చాల్లే. ఊరుకో, నాయనగాదూ? ఇదిగో, ఈపండు

తీసుకో, తిందువుగాని." అంటూ మార్టిన్ గంపలోంచి ఓమంచి పండు తీసి పిల్లవానికిచ్చేడు. "అవ్వా! దానిఖరీదు నేనిస్తానులే!"

"ఇల్లాచేస్తేనే వాళ్ళు పాడవడం, వెధవలాని! కుఱ్ఱవెధవలూ, కుఱ్ఱచేష్టలూగావు! వీణ్ణి కొరడాతో వీపు చిట్లగొడితే బుద్ధివస్తుందిగాని యిట్లా ఎస్తుందా!" అంటూ మండిపడుతూంది, ముసలమ్మ.

"అవ్వా! అది మన పద్ధతి. ఈశ్వరుని మార్గం మాత్రం అదిగాదు. ఈపిల్లవాణ్ణి, పండు దొంగిలించినందుకు కొరడాతో కొట్టాల్సివుంటే, మనం చేసిన పాపాలకి మనల్ని ఏంచేయాల్సివుంటుంది?"

ముసిలిది ఏమీ మాట్లాడలేదు.

మార్టిన్ ఆమెకి దృష్టాంతంగా బైబిల్ కథ చెప్పనారంభించేడు. ఒక ప్రభువు తన సేవకుని క్షమించి, వాని బాకీ అంతా రద్దుచేసేడు; వాడు వెళ్ళి తనకు బాకీవున్న తోడిసేవకుణ్ణి గొంతు పట్టుకున్నాడట; కథ సాంతంగా వింటూ ముసిలిదీ, బాలుడూకూడా నిల్చునేవున్నారు.

"ఈశ్వరుడు, క్షమించండి! అని మనల్ని ఆజ్ఞాపిస్తున్నాడు. మనం యితరుల్ని క్షమించకపోతే, మన తప్పుల్ని ఈశ్వరుడెట్లా క్షమిస్తాడు? అందరినీ క్షమించాలి; అందులోనూ ముఖ్యంగా, ఊహ తెలియని పిల్లవాళ్లని క్షమించే తీరాలి."

ముసిలిది తలూపుతూ, నిట్టూర్చింది.

"అది నిజమే, నాయనా! కాని, పిల్లగాళ్లు యిప్పుడు మరీ పాడై పోతూన్నారు."

"పెద్దవాళ్లు మంచిమార్గాన్ని వాళ్లకి బోధించాలి, చూపాలి." అన్నాడు, మార్టిన్.

"నేననేదీ అదేనయ్యా. నాకూ ఏడుగురు సంతానం కలిగింది. ఐతేనేం, నాయనా, భగవంతుడికి దయకలగలేదు. అందర్నీ తీసుకు

పోయేడు. ఒక్కనలుసు మిగిలింది. దాన్నే చూసుకుంటూ రోజులు వెళ్ల బుచ్చుతూన్నా." నంటూ తన కథంతా ఏకరువుపెట్ట నారంభించింది. తనకూతురూ, అల్లుడూ యెక్కడ కాపురముంటున్నారో, మనుమలెం దరో చెప్తూంది

"నాయనా! నాకిప్పుడేమీ బలంలేదు. అయితేనేం? రెక్కాడితేనే గాని డొక్కాడదు. ఏంబ్రతుకో? పిల్లల్ని చూసుకుని బ్రతుకుతున్నా నంతే. అనుకోకూడదు కాని, నామనుమలున్నారే. వాళ్ళలాంటి బుద్ధి మంతు లెక్కడా వుండరంటే నమ్ము. నాచిన్న మనమరాలు 'అన్ని' వుందే, నన్ను వొదిలేపెట్టదు. 'అవ్వా! అదిగోనే! అవ్వా! ఇదిగోనే!" అంటూ కూడా కూడానే వుంటుంది. "మనుమరాలి సంగతి చెప్తూంటే, ఆమె మనస్సు ప్రేమతో నిండింది" కోపం అంతా యెగిరిపోయింది. ఆపిల్లవాని నుద్దేశించి, అంది.

"ఏదో, నాయనా! చంటివాడుగాదూ? తెలియక చేసుంటాడు. ఈశ్వరుడు వాణ్ణి రక్షించాలి!"

ఇంటికి పోవాలనుకుంటూ. ముసలమ్మ గోతాం వీపుమీద కెత్తు కుంటూంటే, ఆపిల్లవాడు చటుక్కున ముందరికి వచ్చేడు.

"అమ్మమ్మా! నేను తెస్తానుండు. నేనూ, మీవీధికే వస్తున్నానులే." అంటూ గోతం వీపు కెత్తుకుంటున్నాడు.

ముసిలిది తలపంకిస్తూ; గోతం యెత్తుకోడంలో వానికి సాయం చేసింది. అవ్వా, మనుమడూ కబుర్లు చెప్పుకుంటూ, వీధినే పడిపో తూంటే, మార్టిన్ వాళ్ళనే చూస్తూ కొంతసేపు అక్కడే నిలబడి పోయాడు. ఆపిల్‌పండు ఖరీదు అవ్వ అడగడమే మరిచింది!

వాళ్ళు కనిపించకుండా పోయేక, మార్టిన్ వెనక తిరిగి యింట్లోకి పోయేడు. గుమ్మంలో పడిన కళ్ళజోడు పగులలేదు. అది తీసికొనివెళ్లి,

పనిలో కూర్చున్నాడు. దారం దూర్చలేక తంటాలుపడి. మెల్లిగా కొంచెం పనిచేసేడు. ఇంతలో వీధిదీపాలు వెలిగించే 'మషాల్చీ' నిచ్చెనా ఆడీ పట్టుకుని వెళ్ళడం చూసి. జ్ఞాపకం వచ్చింది, మార్టిన్‌కి. అప్పుడే దీపాలవేళయింది।

"దీపం వెలిగించాలి, పని సరిగా ఆనటమేలేదు." అనుకుంటూ మార్టిన్‌లేచి, దీపం వెలిగించి, మళ్లీ పనిలో కూర్చున్నాడు. ఈసారి త్వరగానే పనిసాగింది. కుడుతూన్న బూటు పూర్తిచేసి, అటూయిటూ త్రిప్పిచూసేడు. బాగానే కుదిరింది, సామానంతా ఓప్రక్కగా సర్ది, ముక్కలన్నీ తుడిచి పోగుచేసి, శుభ్రపరిచేడు.

దీపంతీసి, టేబిల్‌మీదపెట్టి, షెల్ఫ్‌లోంచి బైబిల్ తీసి కుర్చీమీద కూర్చున్నాడు. గతరోజున ఆనవాలుపెట్టినదగ్గర తీసి చదువుదామను కున్నాడు. కాని పుస్తకం మరోచోట తెరుచుకుంది. తెరుస్తూంటే, మార్టిన్‌కి నిన్నటికలంతా జ్ఞాపకం వచ్చింది. గదిలో యెవరో నడుస్తూ న్నట్లు పదధ్వని వినిపించింది. వెనక ఎవరో వున్నట్లై మార్టిన్ తిరిగి చూసేడు. మూలలో యెవరో నిలబడ్డట్టు తోచిందేగాని గుర్తుపట్టడానికి వీల్లేకండా వుంది. మార్టిన్ చెవిదగ్గరనే గుసగుస శబ్దం!

"మార్టిన్! మార్టిన్! నువ్వు నన్నెరగవూ?"

"ఎవరువారు?" గొణిగేడు, మార్టిన్.

"ఎవరూలేరు. నేనే!" అన్నట్లైంది. చీకటి మూలనుంచి స్టెపానిచ్ నడిచివచ్చి, మబ్బులా కరిగి మాయమయేడు!

"ఎవరున్నారు? నేనే!" అంటూ మళ్లీ వినిపించింది. ఈసారి చంటిబిడ్డ నెత్తుకొని, ఆస్త్రీ ముందుకి వచ్చింది. ఆమె చిరునవ్వు; బిడ్డడు నవ్వుతూ కేరింతాలు కొడుతూన్నాడు! వారూ మాయమైపోయేరు!!

"అప్పో! నేనే!" అన్నారెవరో, మళ్లీ ముసిలిదీ, చేతిలో ఆపిల్ పండుతో పిల్లవాడూ ముందుకి వచ్చేరు. ఇద్దరూ చిరునవ్వునవ్వుతూ కొంచెంసేపట్లో అంతర్ధానమై పోయేరు!!!

మార్టిన్ మనస్సు సంతోషంతో నిండిపోయింది. క్రాస్ చేసుకుని కళ్ళజోడు తగిలించుకుని దానంతటే తెరుచుకున్నచోట చదువనారంభించేడు. ఆ పేజీ పైనే యిట్లా వుంది:

"నేనాకలి గొన్నాను, నాకు అన్నమిడితివి; నేను దప్పికగొనగా, దాహము తీర్చితివి: నేను పరదేశినైతిని. నీవు నాకాశ్రయ మిచ్చితివి."

పుట ఆఖరున యిట్లావుంది:

"నాయీ సోదరులలో, కనిష్ఠుడైననూ, నికృష్ఠుడైనవొకనికి నీవు చేసిననూ, అదంతయూ నాకు చేసినట్లే." మాథ్యూ. 25.

తన స్వప్నం నిజమే అయిందని మార్టిన్ గ్రహించేడు. ఆరోజున రక్షకుడు నిజంగానే తన పేదయింటికి వచ్చేడు! తానాతనికి ఆతిథ్య మివ్వగల్గేడు. మార్టిన్ హృదయం ఆనందంతో ఉప్పొంగింది.

(రచన 1885)

# ఎంత భూమి కావాలి?

## 1

అనగనగా ఓపల్లెటూళ్ళో ఓ రైతుండేవాడు. అతనికి యిద్దరు ఆడ బిడ్డలు. పెద్దామెను పట్టణంలోని దుకాణదారుకిచ్చీ, రెండోబిడ్డను ఒక పల్లెటూరు రైతుకిచ్చీ పెండ్లిచేసేడు. వారిద్దరూ అత్తవారిండ్లకుపోయి కాపురం చేస్తున్నారు. ఇట్లా కాలం గడుస్తూంటే ఓరోజున పట్టణవాసి యైన అక్కగారు చెల్లెల్ని చూడ్డానికి ఆగ్రామం వెళ్ళింది. మధ్యాహ్నం అందరూ ఒకచోటచేరి సరదాగా వాతాఖానీవేస్తూ, 'టీ' త్రాగుతున్నారు. పట్నంలో తమజీవితాన్ని వర్ణిస్తూ, అక్కగారు మాట్లాడుతూంది. "జీవితం అంటే పట్టణజీవితమేచెప్పాలి. శుభ్రమైనయిళ్లు. మంచిగాలీ- వెలుతురూను. పొగచూరుతూ, దిక్కుమాలిన కిరోసిన్ దీపాలక్కర్లేదు. మాకు. ఎలక్ట్రిదీపాలు వెలుగుతాయి. బజాళ్లో మంచిరకరకాల గుడ్డలు కొనుక్కుంటూంటాము. చూడూ, మంచిఫేషన్‌గా గౌను కుట్టించుకోవాలంటే పట్నంలోనే కుదురుతుందనుకో, మరి. తిందామన్నా, యీదిక్కుమాలినపల్లెటూళ్ళల్లో ఏమీదొరకదే. పళ్ళుతినాలన్నా, రకరకాల కూరలు కావాలన్నా పట్నంలోఅయితే యీకాలం ఆకాలం అనకండా దొరుకుతాయిగదా! హోటళ్ళలోనా, ఏమి దివ్యంగా వుంటుందనుకున్నావ్? పాలరాతి టేబిల్స్, సోఫాలు, రుచికరంగా ఫలహారాలూ, పానీయాలూను! నాటకాలకుక్కూడా తరుచు వెడుతూవుంటాము. ఈపల్లెటూళ్ళల్లో ఏంలోస్తుందే? శుభ్రమైనతిండీ. గుడ్డా కూడా దొరకదు." అంది.

అక్కగారి స్వాతిశయపుమాటలకి చెల్లెలు మనస్సు నొచ్చింది. ఆమెలోని స్వాభిమానం రేగి, పల్లెటి జీవితంలోని మాధుర్యాన్ని.

రైతుల నిరాడంబరజీవితాన్నీ పొగడుతూ పట్టణవాసుల కృత్రిమ సౌఖ్యాన్నీ, వ్యాపారుల మాయలనూ తెగడుతూ మాట్లాడ నారంభించింది. "కోటిచ్చినా మాకా పట్నవాసజీవితం అక్కర్లేదమ్మా. ఏదో, సామాన్యంగా బ్రతుకుతూన్నా, మాకు జీవితం నిర్విచారంగా గడిచిపోతుంది. మాకంటె ఎక్కువగా ఖర్చుపెట్టుకుంటారేగాని మీకు తృప్తి యెక్కడుంటుంది? అంతకంత కెక్కువగా సంపాదించనైనా సంపాదించాలి. లేదా వున్నదే పూడ్చిపెట్టుకుపోతుంది. ఈ వేళ మేడమిద్దెల్లోవుంటారు. రేపు వీథుల్లో బిచ్చమెత్తుకుంటారు. పట్నవాసుల బండారం యింతేగాదూ? ఏదేలాగున్నా మాపల్లెటూరిరైతుల జీవితంలో అంత ఒడుదుడుకు లుండవు. పెద్ద భాగ్యభోగ్యాలు లేకపోయినా, రైతులు పొట్ట చేతబట్టుకుని పోనక్కర్లేదు. కోటీశ్వరులమై వెండి బంగారాలు తినకపోయినా, కడుపుకేమి కక్కుర్తి పడక్కర్లేదు. మా రైతులు!"

అక్కగారి కీమాటలతో అక్కస్సు కలిగింది. "చాల్లే ఊరుకోవే, చెప్పేవు కబుర్లు. మీకుమాత్రం కడుపుకక్కుర్తి లేదమ్మా. ఔనుమరి. కుక్కలకీ, పందులకీమాత్రం కడుపునిండటం లేదూ? ఏం బతుకమ్మా, ఓసుఖమా, నాగరికతా, సంఘమా? ఏముందనమ్మా మెగిరిపాటు! ద్రాక్షపళ్లు పుల్లగా వున్నాయందిట, నక్క! నీమొగుడెంత కష్టపడి పనిచేసినా యీమురికిబ్రతుకు యింతేకాదూ? పేదలోపుట్టినపురుగు పేదలోనే చచ్చినట్లు, మీరూ యీమట్టిలోపుట్టి యిందులోనే పెరిగి, యిందులోనే అణిగిపోతారు."

"ఏమమ్మా, అయితే?" అంది చెల్లెలు. తనవాదనని బలపరుచుకుంటూ, "మాజీవితం అంతే. మాకెవరిభయమూ లేదు. ఒకరికి లొంగి పడివుండనవసరంలేదు; ఒకరికి సేవ చేయనక్కర్లేదు. మా పల్లెటూళ్ళలో దుర్వ్యసనా లేమీ వుండవు. ఈవేళ నువ్వు బాగానే వున్నా

వనుకో. రేపు నీభర్త యేత్రాగుడో, వ్యభిచారమో, జూదమో-ఏదోదుర్వ్యసనంలో తగులుకొన్నాడంటే సర్వనాశనం సిద్ధం. పట్టణాలే దుర్వ్యసనాలకి పుట్టినిళ్ళు."

చిన్నఆమెభర్త, పోఖోమ్ వీళ్లమాటలు వింటూ, వెచ్చగావున్న నెగడి అరుగు* మీద పండుకొని వున్నాడు. వినగా వినగా అతనికీ ఊరుకో బుద్ధిపుట్టలేదు. "ఔను. అల్లాగేమరి. పుట్టిందిమొదలు గిట్టేవరకూ మట్టిలోనే పనిచేసికొంటూ, చెమటోడ్చి కడుపునింపుకొనే రైతుల బుర్రల్లో కల్లకపటాలకు తావుండదు. అయితే వున్నచిక్కేమిటంటే మాకు దున్నుకోడానికి సరిపడేటంత భూమిలేదు. మారైతుల కందరకీ సరిపడ్డ భూమిగనక వుంటే యింకమాకు ఎవరిప్రేక్ష్యమూ లేదు." అన్నాడు.

ఆడవాళ్ళు అంతటితో యీసంభాషణమాని, మామూలు కుశల ప్రశ్నలూ, ఫేషన్‌లూ మొదలైనవాట్లనిగూర్చి కొంచెం మాట్లాడి, సామాను సర్దుకొని, పొద్దుపోయేక పడుకున్నారు.

ఆరాత్రంతా రైతుకు నిద్రపట్టనేలేదు. అతనిబుర్రలో మాట మాటికీ "కావలసినంత భూమివుంటేనా?" అనేభావం పొడముతూనే వుంది. మాటిమాటికీ నిట్టూరుస్తూ, అల్లాగే పండుకొని. తెల్లవారగట్ల ఒక్కకునుకు పోయేడు. అతనిమనసులో భూమికావాలనేకోరిక అంకురించి, పాదుకొంది.

## 2

ఆగ్రామానికి సమీపంలోనే ఒక ధనికురాలు నివసిస్తూండేది. రైతులభూమికి సరిహద్దుల్లోనే ఆమెకి మూడువందల యెకరాల భూమి

* దీనినే 'ఓవెన్' అంటారు. పెద్దనెగడిమీద యిటుకలతో యీఅరుగును కడతారు. కూర్చోడానికీ, రాత్రులు పండుకోడానికీ కూడ దీన్ని ఉపయోగిస్తారు.

వుంది. ఆమె రైతులను యెన్నడూ యిబ్బందిపెట్టకుండా, వాళ్ళతో మర్యాదగా వ్యవహరిస్తూంటుంది. కొంతకాలం యిట్లా గడిచేక ఆమె దగ్గర మేనేజరుగా ఫించన్ తీసికొన్న సైనికుడు కొలువు కుదిరేడు. అతను వచ్చినప్పటినుంచీ రైతులకు బాధలు ప్రారంభమైనాయి. వాళ్ల మీద తరుచుగా జుల్మానాలు పడుతూండేవి. పోఖోమ్ చాలా జాగ్రత్తగానే ఉండేవాడు. అయినా ఏదో ఒకటి,-పండినచేలో గుర్రంపడి తినడమో, కూరి పెరట్లోకి ఆవు తెంచుకుని వెళ్లి పాడుచేయడమో, లేగదూడలు బీళ్లోపడి మేయడమో, ఏదో జరుగుతూనే వుండేది. అన్నిటికి జుల్మానా లిచ్చుకోవలసి వచ్చేది.

పోఖోమ్ జుల్మానా లిచ్చుకుంటూనే వుండేవాడు. అయినా నిత్యమూ యింటివద్ద తిట్లు, తగున్నలు జరుగుతూనే వుండేవి. పులిమీద పుట్రలా ఆవేసవిలో యితగాడికి తరుచుగా అధికురాలి మేనేజరు మూలంగా యేదో పేచీ తటస్థపడుతూనే వచ్చింది. వేసవి గడిచింది; శీతాకాలం వచ్చింది. మందల్ని కొట్టాముల్లో కట్టివేసి, నిలవ గడ్డితో మేపుతారు, ఈకాలంలో. గడ్డి ఖర్చై పోతుందనే విచారం ఓమూల వున్నా, పోఖోమ్‌కి మనసులో సంతోషంగానేవుంది. శీతకాలంలో దూడాదుడికీ కొట్టాముల్లో వుండడంవల్ల నిత్యం ఏదోఒకటి పొరుగువారి పొలాల్లో పడడం, చీవాట్లు తినడం, జుల్మానా లిచ్చుకోవాల్సిరావడం,- యీ మనస్తాపాలుండవుగదా యని, ఇదిల్లావుండగా అధికురాలు భూమిని విక్రయిస్తుందనీ, ఆగ్రామస్థుడైన 'ద్వార్నిక్' * కొనదలచేడనీ పుకారు బైలుదేరింది. ఈవార్త రైతులమీద పిడుగులా పడింది.

---

* 'ద్వార్నిక్' అంటే రష్యన్‌నగరాల్లో ద్వారపాలకుడని, కాని పల్లెల్లో మరొకఅర్థంలో వాడుతారు 'కమ్యూన్'లను వదలివేసి, ఆశ్రయించో, మోస గించో, కొనో, ఏలాగో కొంత స్వంతభూమిని సంపాదించిన విడిరైతుల నీ పేరుతో పిలుస్తారక్కడ. వీరికీ, రైతుల 'కమ్యూన్'లకూ మధ్య యెప్పుడూ తగువులుంటూనే వుంటాయి.

"ఈభూమికూడా 'ద్వార్నిక్' కొన్నాడంటే మనపాట్లు కుక్కలకి కూడా వుండవు. ఏదో నెపంపెట్టి జుల్మానాలువేసి, మనరక్తమాంసాలు పీల్చేస్తాడు. వాడితో పోలిస్తే దొరసానమ్మే వెయ్యిరెట్లు నయం! భూమి లేకండా మనం బతకలేము. మన కన్నిపైపులా, బతికున్నా చచ్చినా భూమి వుండకతప్పదు, మరి." అంటూ రైతులు చెప్పుకొంటున్నారు.

గ్రామంలోని రైతుపెద్దలంతా సమావేశమై ఆలోచించేరు. ముఖ్యుల్ని కొందర్ని దొరసానమ్మదగ్గరికి రాయబారం పంపేరు. వారు వెళ్లి భూమిని 'ద్వార్నిక్'కి అమ్మవద్దనీ, తమకే విక్రయించమనీ, పోటీగా యెక్కువధర యిస్తామనీ చెప్పేసరికి దొరసానమ్మ అంగీకరించింది. రైతులంతా సదరుభూమిని సమిష్టిగా కొంటానికి తీర్మానించుకున్నారు- కాని దాన్ని యెవరెవరు, యెంతెంత, యెక్కడెక్కడ తీసుకోవాలా? అనేది నిర్ణయించడంకోసం ఎన్నోసార్లు సమావేశాలు జరిపేరుగాని ఏమీతేల్చలేకపోయేరు. ప్రతీమీటింగూ కలహాలతో ముగిసేది. చివరికి ఎవరు కొనగలిగినంతభూమిని వారు వ్యక్తిగతంగా కొనాలని అందరూ ఒప్పుకున్నారు. దొరసానమ్మకూడా అంగీకరించింది. పొరుగురైతొకడు అరవై యెకరాలు కొన్నాడనీ, సగంసొమ్ము వెంటనే యిచ్చి, మిగిలినసగం రెండుసంవత్సరముల వాయిదాల్లో యివ్వడానికి ఒప్పందం అయిందని పోఖోమ్ విన్నాడు. అతనికి అసూయకలిగింది. "భూమంతా వాళ్ళేకొనేస్తారు. చివరికి నాకేమీ మిగలదు." అని సణుక్కున్నాడు. భార్యతో భూమికొనడాన్నిగూర్చి ఆలోచన చేద్దామనుకున్నాడు.

"అంతా కొనేస్తున్నారు. మనమూ ఓముప్ఫై యెకరాలైనాకొనాలి. ఆమాత్రమేనా లేకపోతే మనకు గడవదు. 'ద్వార్నిక్' చేతిలో ఆభూమి పడిందంటే, జుల్మానాలతో మనల్ని నాశనంచేసేస్తాడు." అని భార్యతో అన్నాడు.

ఇద్దరూ ఆలోచనలు సాగించేరు. అప్పుడూ అప్పుడూ జాగ్రత పెట్టినబాపతు వాళ్ళవద్ద ఒకవంద రూబుల్సు తేలింది. గుర్రపుపిల్లని అమ్మేశారు. తేనె పెట్టెల్లో సగంకూడా బేరం యిచ్చేసేరు. కొడుకుని పనికి కుదిర్చేరు, కొంతమొత్తం తీసికొని. కొంత అప్పుతెచ్చేరు. ఎల్లాగైతేనేం కావలసినడబ్బులో సగభాగం జమచేసేరు, కష్టపడి.

డబ్బు జతచేసింతర్వాత పోఖోమ్ వెళ్ళి పొలం-అంతా కలయ తిరిగి ఒక యాభై యకరాలు తీసుకోడానికి నిశ్చయించి గుర్తులుపెట్టుకుని వచ్చేడు. అందులో కొంత అడివికూడా వుంది. తర్వాత దొరసానమ్మదగ్గిరికివెళ్ళి వ్యవహారం మాట్లాడి, నిశ్చయం చేసుకుని కొంత డబ్బు ముందుగా చెల్లించి, రశీదులు తీసికుని వచ్చేడు. ఆమర్నాడు పట్నానికివెళ్ళి క్రయదస్తావేజు వ్రాయించి, రిజిస్ట్రేషన్ చేయించుకున్నారు. రిజిస్ట్రేషన్ కాలంలో క్రయధనం సగంయిచ్చి మిగతాసగం రెండేండ్లలో యివ్వడానికి అంగీకారం అయింది.

ఎల్లాగైతేనేం పోఖోమ్ చివరకి స్వంతభూమి సంపాదించేడు. దాని సాగుకి యేర్పాట్లన్నీ పూర్తయేయి. బావమరదిదగ్గర విత్తులు అప్పుగా తెచ్చేడు; కొత్తపొలం బాగాదున్ని విత్తనాలు చల్లేడు. కాలమానం సరిగావుండి మంచిపంట రాలిందికూడ. ఆయేటిపంటలోనే బావమరదికి విత్తులు బదులుతీర్చి, దొరసానికి మిగతాసగం క్రయధనం బాకీకూడ యిచ్చేసేడు. ఋణవిముక్తుడై పోఖోమ్, పెద్దకమతానికి 'కామందు' అయ్యేడు. తనస్వంతభూమినే దున్ని, విత్తి, నూరుస్తాడు; తనస్వంతబీళ్ళలోనే గుర్రాల్నీ, ఆవుల్నీ, గొర్రెల్నీ మేపుతాడు; వాటిలోనే వేసవిలో గడ్డికోసి శీతాకాలానికై జాగ్రతపెట్టుకుంటాడు; వంటచెరకూ, వ్యవసాయపు పనిముట్లకూ తన అడివిలోని చెట్లనే కొట్టిస్తాడు. తనభూముల్లో మేడిపట్టి దున్నుతూన్నా, బీళ్ళలో కొడవలిపట్టి

కోస్తున్నా, పండి ఒరిగిన బంగరు రంగుచేలు చూస్తున్నా అతనిలో యింతవరకూ అనుభవించియుండనిసంతోషం తరంగాలుగా పెల్లుబికి వచ్చేది. అన్నీ కొత్తగానే కనిపించేవి. వాటన్నిటిలోనూ, ఏవో అనిర్వ చనీయ నూతనత్వం పోఖోమ్‌కి కనిపించసాగింది. గడ్డిపరకలు, పువ్వులు, చెట్లు,- అన్నీ అతడు తనజీవిత మంతలోనూ చూస్తూ వచ్చినవాటికంటె విలక్షణంగానే వుంటున్నాయి. ఇదివర కాపొలాల్లో వెడుతూంటే ప్రతీచెక్కా అన్ని యితరచెక్కలకివలెనే వుండేది. కాని నేడు తనపొలంలోని ప్రతిమడీ, చిన్నచెక్కాకూడ ఒక నవరత్న ఖండంలాగ అతని మనసును ఆకర్షించుతూంది.

## 3

ఈమాదిరిగా సుఖంగా పోఖోమ్ నూతనజీవితాన్ని గడుపు తూన్నాడు. అతనిజీవితం అంతా నిర్విచారంగా గడిచిపోయేదే. కాని, యిప్పు డింకోరకం అవాంతరాలు రా నారంభించేయి. ఏరైతు పశువులో తనచేలో పడి మేసేవి; మరోనాడెవరో బీట్లో గడ్డి కోసుకుపోయేవారు; హఠాత్తుగా ఓరాత్రి గుర్రాలు అతగాడి గోధుమపొలంలో పడి తొక్కి పాడుచేసేవి; ఆవులు తఱచుగా పాదులపెరడంతా నాశనం చేసేవి. పోఖోమ్ ప్రక్కరైతుల్ని రోజూ యెన్నోసార్లు మందలిస్తూన్నా లాభం లేకపోయింది, హద్దుమీరివచ్చిన జంతువుల్ని తరిమివేసి, వాటియజమా నుల్ని మనసులోనే తిట్టుకుని, వాళ్ళని కోర్టులకి లాగకుండా మాటల తోనే మన్నించి వదలేసేవాడు. చివరకి అతనికీ విసుగుబుట్టింది. పట్టణంలోని కోర్టులో దావా పడేశాడు. రైతులు బుద్ధిపూర్వకంగా తన చేలల్లోకి పశువుల్ని కొట్టరని అతనికీ తెలుసు. చుట్టుప్రక్కల రైతాంగా నికి భూమీ బుట్రా లేనందువల్లా, వున్నవాళ్ళకైనా తగినంత బీడూ-

అడివి లేకపోవడంవల్లా, వాళ్ళ పశువులు తన పొలాల్లో పడుతున్నా యని పోఖోమ్ యెరిగేవున్నాడు. "అయితేనేం! ప్రతీసారీ వీళ్ళందర్నీ వదలిపెట్టలేను, మరి. నాపొలం అంతా నాశనంచేసి వదిలిపెడతారు. వాళ్ళకి లోకువ చిక్కితే. వాళ్ళందరికీ ఓపాఠం చెప్పాల్సి వుంది." కోర్టుకు వెళ్లేటపుడు అతనిధోరణి యిది.

ఈవిధంగా కోర్టులో ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు రైతులకు జుల్మానాలు వేసేరు. చాలామంది రైతులకి సమనులు వెడు తూండేవి; వాళ్ళు కోర్టుకివచ్చి జుల్మానాలు చెల్లించుకుని వెడుతూండే వారు. దీనితో రైతులకి కోపంవచ్చి, రెచ్చిపోయేరు. బుద్ధిపూర్వకం గానే బీళ్లోకీ, చేలల్లోకీ పశువుల్నీ, గుర్రాల్నీ కొట్టేవారు. ఓరోజురాత్రి యెవరో అతని అడవిలోపడి మంచియేపుగా పెరుగుతూన్న చెట్లను కొట్టేశారు. కొన్నిటిబెరడు ఒలిచి పట్టుకుపోయేరుకూడాను తర్వాత పోఖోమ్ అడివిలోకి వెళ్ళి చూసేసరికి ఓచోట బాగా యెండపడుతూంది. ఏమిటి చెప్మా! అని వెళ్ళి చూసేసరికి చెట్లన్నీ నరికి పడివున్నాయి. మొదళ్లుమాత్రం రాటల్లా నిలబడివున్నాయి. "ఆనరికినవెధవ, పోనీ, ఒక్కొ్కగుబురులో కొన్నిచెట్లుకొట్టి, మధ్యచెట్లులయినా వుండనిస్తే బాగుండునా!" అనుకున్నాడు. కాని, వాడు అట్లా యెందుకుచేస్తాడు? ఒకచోటే అన్నీ శుభ్రంగా నరికిపారేశాడు, దొంగవెధవ.

పోఖోమ్‌కి చాల కోపంవచ్చింది. "ఛీ ఛీ! అలంజాకొడుకెవడో తెలిస్తేనా, వాడిపని పట్టేవాడిని!" అనుకున్నాడు. ఆలోచించేడు; "ఎవడైవుంటాడు, చెప్మా! ఎంత ఆలోచించినా అంతు పట్టలేదు.

చిట్టచివరకి "ఆ! వాడే, ఆవెధవ, సైమనే అయివుంటాడు." అనుకున్నాడు. "ఇంకెవరూ అయివుండరు!" అని నిశ్చయించేసేడు. అందుచేత సైమన్ పెరట్లోకివెళ్ళి, అంతటా వెదకేడు. ఎక్కడా చెట్ల

పెరడుగాని, మరేఆధారంగాని దొరకలేదు. అయినా ఊరికేనే సైమన్‌తో పోట్లాడి వచ్చేసేడు. అప్పటినుంచీ చెట్లునరికింది సైమనేఅని పోఖోమ్‌కి మరింత నిశ్చయం అయిపోయింది. కోర్టుకివెళ్ళి ఫిర్యాదు పడేశాడు. సైమన్‌ని ముద్దాయిగా విచారణ చేసేరు. చివరకి యేఆధారాలు లేక పోవడంవల్ల, సరియైన సాక్ష్యాలు దొరకనందున సైమన్‌ను కోర్టువారు నిర్దోషియని వదలిపెట్టేశారు. పోఖోమ్‌కి దీనితో మరింత చిర్రయెత్తింది. అన్యాయంగా ముద్దాయితో లాలూచీపడి, వదిలేశారంటూ, పంచాయితీ దార్లనీ, పెద్దల్నీ నిందించి, వాళ్లతో నిష్కారణంగా వైరం పెంచుకున్నాడు, పోఖోమ్.

"మీరు దొంగవెధవల్ని శిక్షించకుండా ఒదిలేశారు. మీరు మర్యాదగా బతికినవాళ్లైతే అల్లాయెప్పుడూ చేయరు." అంటూ పంచాయితీ దార్లను దుంపేశాడు. ఇరుగు పొరుగు వాళ్ళనీ అట్టే పెట్టలేదు. చివరకి పోఖోమ్ తిట్లు భరించలేక పొరుగువాళ్ళల్లో బుద్ధిమంతులు కొంచెరు. ఊరుకోకపోతే కొంపా గోడీ చిచ్చెడతామన్నారు.

పోఖోమ్‌కి పొలం పెరడూ విశాలమైనవే అమరినాయిగాని పాపం, ప్రపంచములో అతని స్థానం యిరకాటంకాజొచ్చింది

ఆరోజుల్లోనే యింకో హడావుడి బైలుదేరింది. దూరంగా మరో ప్రాంతంలో కొత్తభూములు సాగులోకి వస్తున్నాయనీ, చాలమంది అక్కడికి వలసబోతూన్నారనీ అంతా చెప్పుకుంటున్నారు. పోఖోమ్ చెవినీవార్త పడేటప్పటికి, అతనిలో మళ్లీ కొత్త ఆశలు రేకెత్తినాయి. భూమున్న వాణ్ణి యిది ఒదులుకుని యెక్కడికి పోతాను, గాని కొందరైనా పోకతప్పనట్లు కనిపిస్తూంది. రోజురోజుకీ మాచెడ్డ యిరకాటం అయిపోతూంది. ఎవరైనా పోతుంటే వాళ్ళ భూములు అమ్మక తప్పదు గదా. అదాపతేదో కాస్త కొన్నానంటే, నాబాధలన్నీ విరగడైపోతాయి లేద్దూ." ఇదీ అతని భావనాపరంపర.

ఓరోజున పోఖోమ్ భోజనంచేసి, విశ్రాంతిగా కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు. పరదేశి ఒకడు వచ్చి, భోజనం పెట్టమనడిగేడు. అతనికి భోజనం అమర్చి, రాత్రికి వుండి వెళ్లమని మర్యాదచేసేరు. భోజనానంతరం పిచ్చాపాటీ మాట్లాడుకొంటూ, అతని వృత్తాంతం ప్రశ్నించేడు పోఖోమ్. తనది దక్షిణదేశమనీ, వోల్గానదీ తీరస్థుణ్ణనీ, అక్కడే ఏదో పాటుపడి జీవనం వెళ్ళబుచ్చుకుంటున్నాననీ ఆగంతుకు డన్నాడు "మావూరునుంచే ఎందరో రైతులం అక్కడికి వలసబోయేం. ఒక్కొక్కరం ముప్ఫై యెకరాలు భూమితీసికొని, కమ్యూన్ * లో చేరేం. అక్కడిభూమి యెంతమంచి దనుకున్నారు! దున్ని, విత్తులుచల్లు తాము. ఆహాహా! ఎంత ఏపుగా వస్తాయనుకున్నారు. గుర్రంమీద కూర్చున్న మనిషికూడా ఆచేలల్లో దాగుకోవచ్చు! నాలుగు గుప్పిళ్లుకోస్తే మోపు కావాల్సిందే. ఓరైతు, మేం వెళ్లేక వచ్చేడు. వచ్చేటపుడు అత నికి కాళ్లూ చేతులూ తప్ప యింకేమీలేవు. ఇప్పుడు ఆరుగుర్రాలు, రెండు ఆవులు, దూడాదుడికీ అంతా సంపాదించుకున్నాడు."

వింటూంటే పోఖోమ్ హృదయం ఉప్పొంగింది.

"ఈ జనసమ్మర్దంలో పడి చావడం యెందుకూ అక్కడ సుఖంగా బ్రతికడానికి వీలుంటేను? ఇక్కడి భూమీ, యిల్లూ వాకిలీ అమ్మిపారేశి, అక్కడికి పోయి, విశాలంగా భూమీ బుట్రా సంపాదించు కుని, సుఖంగా వుండొచ్చు. ఈ జనసమ్మర్దపుదేశంలో అన్నీ పేచీలూ, తగువులూను. ఎటుపోయినా నుయ్యో, గొయ్యో. నేను స్వయంగానే వెళ్ళి అంతా చూసుకుని వస్తా."

---

* మనదేశంలో పూర్వం గ్రామపంచాయతీలున్నట్లుగానే రష్యాలో యిటీవలి వరకూ రైతులకు కమ్యూన్ లుండేవి. రైతులందరి భూమీ సమిష్ఠిగా వుండి, కుటుంబాలకి యేటా పంచిపెట్టబడుతూండేది. ప్రతి కమ్యూన్‌కీ యెన్నుకోబడిన పెద్ద లుంటారు. ప్రస్తుతపు సోవియట్లుకూడా యిట్టివే.

ఆవేసవిలోనే ప్రయాణమై క్రొత్తప్రదేశాల్ని చూడ్డానికి పోయేడు. వోల్గానదిలో స్టీమరుమీద 'సమారా' పట్టణానికి వెళ్ళి, అక్కడినుంచి కాలినడకను మూడువందల మైళ్ళు ప్రయాణంచేసి, చిట్టచివరకి ఆగ్రామం చేరేడు. అక్కడి పరిస్థితులన్నీ తాను వినినరీతిగానే వున్నాయి. రైతులంతా తలా ఒక ముప్ఫైయెకరాలు చేసుకుంటూ సుఖంగా జీవిస్తూన్నారు. ఎవరు కొత్తగా వచ్చినా సంతోషంగా కమ్యూన్‌లో చేర్చుకుంటున్నారు. ఎవరిదగ్గరేనా హెచ్చుధనం వుంటే, తనకు కావలసినంత భూమిని పైగా కొనుక్కోవచ్చు. అనుభవించవచ్చు! మాంచి పక్కా భూమికూడ యెకరా రెండు రూబుల్సుకి మించదు! ఎంత కావలిస్తే అంతా దొరుకుతుంది కూడాను!

తనకి కావలసిన భోగట్టా అంతా తీసికొని, పోఖోమ్ తిరిగి యింటికి వచ్చేసేడు. తన భూమంతా మంచి క్రయానికే అమ్మేశాడు. ఇల్లూ, దూడ దుడికీకూడ ధర బాగానే వచ్చేయి. గ్రామపంచాయితీలో తనపేరు తీయించేసుకుని, దబ్బంతా చేతబట్టుకుని, ఆమరుసటి వేసవిలో సకుటుంబంగా పోఖోమ్ కొత్తదేశానికి వచ్చి చేరేడు.

## 4

కొత్తదేశం చేరి, అక్కడి పెద్దగ్రామాల్లో ఒకదానిలో తనపేరు నమోదు చేయించుకున్నాడు. విందు యేర్పాటు చేసేడు. తన దస్తావేజులన్నీ పూర్తిచేయించుకుని, గ్రామస్థుల్లో ఒకడైనాడు. అతని కుటుంబంలోని అయిదుగురికీ కలిసి నూటయేభై యెకరాలు భూమి దఖలుపడింది. పైగా కొంత బీడుకూడా తీసుకున్నాడు. ఒక చక్కని చిన్నయిల్లు కట్టుకున్నాడు; దూడా దుడికీ కొనుకున్నాడు. ఇదివరకటికంటె మూడురెట్లు యెక్కువ భూమి వుంది, పోఖోమ్ కిప్పుడు. భూమికూడా మంచిదే.

వెనకటికంటె వైభవంగానే జీవనం గడుపుతూన్నాడు. పంటభూమి, పచ్చికబీళ్ళుకూడా అతనికి కావలసినంతా వసతిగా వేర్పడినాయి. కావలసినన్ని పశువుల్ని పుష్కలంగా మేపుకోడానికి వలసిన బీళ్ళుండడంవల్ల పాడికి కొదువలేదు.

అక్కడికి వెళ్ళిన కొత్తలో యిల్లు కట్టుకొంటూ, పాకలు పందిళ్లూ వేయిస్తూ, తలమునిగే పనిలో వుండడంవల్ల పోఖోమ్‌కి చాల సంపది అనిపించింది. పూర్తిగా స్థిరపడిన తర్వాత అతనికేమిటో యిక్కడా యిరుకుగానే వుంటూందనిపించింది. మొదటి యేడాదే కొంత భూమిలో గోధుమలు చల్లేడు. కాలమానం సరిగావుండి మంచిపంట రాలింది. రెండోయేడు మరికొంత భూమిలో గోధుమపైరు చేద్దామనుకొన్నాడు. కాని, తనకున్న భూమి సరిపడదనుకున్నాడు. ఆదేశంలో గోధుమపంట, బీటిభూమిలోగాని, కొత్తభూమిలోగాని వేస్తుంటారు. ఒకటిరెండు పంటలు గోధుమ పెట్టింతర్వాత మళ్లీ బీడుగా వదలడమో, పంట మార్చడమో రివాజు. గోధుమ వేసేందుకు లాయకైన భూమి తమకు సరిపడా లేదని యెవరికి వారే అనుకొనేవారు.

చివరకి యిక్కడా తగువులు బైలుదేరినాయి. కాస్తవున్న రైతులు తమభూములు తామే సాగుచేసుకుంటున్నా బీదరైతులు పెట్టుబడికోసం షాహుకార్లవద్ద అప్పుచేయడమో, తమ భూమిని కొంత పెద్దరైతులకు కౌలుకీయడమో జరిగేది. పోఖోమ్ హెచ్చుగా గోధుమపంట పెట్టడం కోసమని ఆమరుసటి సంవత్సరం ఓషాహుకారు దగ్గిరికి వెళ్లి కొంతభూమి మక్తాకు తీసుకొన్నాడు. ఆయేడూ పంట బాగానే రాలింది. పదిమైళ్ళలో వున్నపట్ణానికి గోధుమబళ్ళు తోలుకెళ్ళినప్పుడు షాహుకారీరైతుల పెద్దభవంతులూ, వాళ్ళదర్జా జీవితం చూసి పోఖోమ్ భుజా లెగరేసేడు. వాళ్ళు రోజురోజూ ధనికులవుతున్నారు. "అట్లాటి యిళ్ళలో వుండాలి! నాకూ స్వంతభూమి సరిపడినంతా వుంటే బాగుం

డును. ఒక్క భవంతి కట్టుకుంటాను, అంతే. నాకంతకంటె ఏమీ అక్కర్లేదు" అనుకున్నాడు పోఖోమ్. అప్పటినుంచీ మరికొంతభూమి కొందామనే పోఖోమ్ నిరంతరం ఆలోచిస్తూండేవాడు.

ఈరీతిగా మూడేళ్ళు గడిచి పోయినాయి. ప్రతీయేటా కొంత భూమి మక్తాకి తీసికొని, గోధుమ పండిస్తూనే వున్నాడు పోఖోమ్. కాలమానపరిస్థితులు కలిసి రావడంచేత పోఖోమ్ కాస్తకాస్తగా కూడబెట్టగలిగేడు. అతడు యిప్పుడు మాంచి దర్జాగా బతుకుతున్నాడు. ప్రతి యేటా భూమిని మక్తాకి తీసికోడం, అందులో వ్యవసాయం మొదటి నుంచీ ప్రారంభించడం చాల కష్టంగానే వుంటుంది. ఏ ఏడాదికాయేడాదే యేరువాక దగ్గిర్నుంచీ పునఃప్రారంభం! ఎక్కడైనా మంచిభూమి వుందీ అనేసరికి అంతా మూగేవారు. పోటీలో కొంచెం వెనుకబడితే ఆ మేటి కింకేమీ దొరికేదేకాదు. ఓసారి పోఖోమ్ యింకో షావుకారుతో జాయంటుగూడి బీడు కొంత మక్తాకి తీసుకొని, యినుమారు ముమ్మారు దున్ని సిద్ధం చేయించేడు. ఇంతలో మక్తాకిచ్చిన రైతులు పోట్లాడుకుని భూమి మళ్లీ తీసేసుకున్నారు. చేసిన పనంతా బూడిదలో పోసిన పన్నీరైంది. "నాస్వంతభూమి లేకపోతే అంతా యిబ్బందే. అదే వుంటే యీబాధలు లేకపోను గదా!" అనుకున్నాడు, పోఖోమ్.

ఎక్కువ భూమి యెక్కడేనా దొరుకుతుందా? అనే ధ్యాసతో పోఖోమ్‌కి నిద్రాహారాలు రుచించడంలేదు. వాకబు చేయగా చేయగా చివరికి అదును దొరికింది. ఓరైతు చిక్కుల్లోపడి, తనభూమి 1500 యెకరాలూ అయినకాడికి తెగనమ్ముకుంటున్నాడు. అతనితో బేరంఆడి, పీడించి పీడించి మొత్తమీద 1500 రూబుల్సుకి స్థిరపర్చుకున్నాడు. సగం డబ్బు వెంటనే చెల్లించి, మిగిలిన సగం తర్వాత చెల్లిస్తానని ఒప్పందం చేసికొన్నాడు. ఈరీతిగా పోఖోమ్ కోరిక ఫలించబోతోంది.

ఈవ్యవహారం తేలిపోయి, పోఖోమ్ ఓపెద్ద భూఖామందు కాబోతూండే సమయంలోనే గ్రామానికో వర్తకుడు వచ్చేడు. అతని భోజనానికి పోఖోమ్ తన యింట్లోనే యేర్పాటు చేసేడు.

మధ్యాహ్నం భోజనానంతరం టీ త్రాగుతూ, బాతాఖానీ వేస్తున్నారు. ఆవర్తకుడు, తాను సరాసరిగా 'బాష్కీర్ల' దేశాన్నుంచి వస్తున్నానీ, 5000 యెకరాల భూమిని 1000 రూబుల్సుకి కొన్నాననీ మాటల సందర్భంలో వెలిబుచ్చేడు. పోఖోమ్ మనస్సులో మళ్లీ ఆదుర్దాకలిగింది. ఆవర్తకుణ్ణి ప్రశ్నమీద ప్రశ్న వేయడం ఆరంభించేడు. ఆతడు చెప్పిందేమంటే బాష్కీర్ల దేశంలో ప్రజ లమాయకులనీ, అక్కడ కావలసినంత భూమి వుందనీ, వాళ్ళ కులపెద్దల్ని సంతోషపెట్టి, చిన్నవిందు యేర్పాటుచేస్తే చాలుననీ చెప్పేడు. నేను వాళ్ళపెద్దలకి 100 రూబుల్సు పెట్టి అంగీలు కొని యిచ్చేను; తివాచీలూ, ఓపెట్టె తేయాకు, కొంచెం సారాయం కూడా వాళ్ళని బాగా సంతోష పెట్టేయి. నాకు కావలసినంత భూమి యకరం 20 కోపెక్కులు (పావలా) చొప్పున క్రయం వ్రాయించి తీసుకున్నా. అది ఓచిన్న నదీతీరాన్నే వుంది. మంచి గడ్డి పట్టిన బీటిభూమి!" అంటూ క్రయదస్తావేజు తీసి చూపించేడు.

పోఖోమ్ మనస్సులో ఆశ తుపానులా విజృంభించింది. "ఇక్కడ యెక్కువధర యిచ్చి భూమి కొనడం. పైగా అప్పు మెళ్ళో గుదిబండలా మోయడం ఎందుకు? అక్కడికి పోయి ఒకటోరకం భూమి, నాకు కావలసినంత సంపాదించుకుంటా." వర్తకుని దగ్గర నుంచి తనకు కావాల్సిన భోగట్టా అంతా అడిగి తెలుసుకున్నాడు.

## 5

వర్తకుడు తనపని చూచుకుని ఆరోజే వెళ్ళిపోయేడు. మర్నాటి నుంచే పోఖోమ్ ప్రయాణసన్నాహాలు ఆరంభించేడు. డబ్బూ దస్కం

చూచి మూటకట్టుకుని, యింటిపని అంతా భార్యకి వప్పచెప్పి, ఓనౌక రును మాట్లాడుకుని పయనమయేడు. దారిలో పట్నంలో ఓపూట ఆగి, కావలసినవన్నీ కొన్నాడు. అంగీలు, కోట్లు, తలగుడ్డలు, తివాచీలు, తేయాకు, మంచి ఘాటైన సారాయం, అన్నీ కొని భద్రపరచేడు. ఆఖరి రైలుస్టేషన్‌లోదిగి, నాటుదారిని వారంరోజులు నడక సాగించేరు. మూడువందలమైళ్లు ఈరీతి ప్రయాణమైనతర్వాత బాష్కీర్లదేశంచేరారు. అక్కడంతా ఆవర్తకుడు చెప్పినట్లేవుంది. ప్రజలంతా నాలుగు, మూడు చక్రాలబళ్లల్లోనే నివసిస్తారు. ఇళ్ళు, గ్రామాలు వేరేవుండవు. నదీతీరాల్లోనే, పచ్చికమైదానాల్లో నివసిస్తారు.ఆబండ్లమీద తారుగుడ్డకప్పి, వాటికి గుర్రాల్ని పూన్చుతారు. మందల్ని తోలుకొంటూ, నదులవెంబడే మకాములుచేస్తూ, యెప్పుడూ సంచారం చేస్తూండేప్రజలువాళ్ళు. భూమిని దున్నడం, విత్తడం వాళ్లెరుగరు, గోధుమరొట్టెలు ఎరుగనేఎరుగరు! బీళ్ళలో గుర్రాలు, పశువులు, గొర్రెలు మేసివస్తాయి. ఉదయం సాయంత్రం స్త్రీలు పాలుపితికి, వాటితోనే వెన్నా, జున్నూ, 'క్యుమీస్' (ఓరకం సారాయం) తయారుచేస్తారు. ఇవీ, మాంసం వాళ్ళనిత్యాహారం. గొర్రెల బొచ్చుతోనేసిన కంబళ్ళు ధరిస్తారు. పనంతా ఆడవాళ్లిదే. పురుషులు తింటూ, త్రాగుతూ, టీ త్రాగుతూ కాలక్షేపం చేస్తారు. కిక్కిసగొట్టాలతో 'పిల్లనగ్రోవు'లు చేసి, వాటిని ఊదుతూండడం. బాతాఖానీ కొట్టడం తప్ప యింకేమీచేయరు. సంతృప్తిగా, సంతోషంగా వుంటారు, వాళ్లెప్పుడూ. వాళ్ళజీవితాల్లో ఆధీ వ్యాధీ కనిపించవు. వాళ్ళు అమాయకులూ, అనాగరకులూ అయినా సుస్వభావులూ, అతిధిపూజ చేసేవాళ్లూను. వాళ్ళ భాషతప్ప రష్యన్‌భాష మాట్లాడడంకూడా వాళ్ళకి తెలియదు.

పోఖోమ్‌ను చూడ్డంతోటే బిలబిల్లాడుతూ 'బష్కీరులు' తమ తమశకటాలనుంచిదిగి, అతనిచుట్టూ మూగేరు. దుబాసీ ఒకణ్ణి పట్టుకున్నారు. వానిద్వారా పోఖోమ్ అక్కడికి వచ్చినవైనం తెలుసు

కున్నారు. వాళ్ళు చాలసంతోషించేరు. అతణ్ణి కౌగలించుకుని, ఓచక్కని విశాలమైన శకటంలోనికి ఆహ్వానించి, సుందరమైన తివాచీంపై, తూలికాతల్పముపరచి కూర్చుండబెట్టేరు. టీ, క్యూమిస్, అంతా కులా సాగా త్రాగుతూంటే, గొర్రెమాంసం పేల్చి, అతిథిముందుంచేరు. తినడం త్రాగడం అయేక, తానుతెచ్చిన బహుమతులను పైకితీసి పోఖోమ్ ఒక్కొక్కరికే సమర్పించేడు. వాళ్ళకి చాలాసంతోషమైంది. ఏదేదో వాళ్ళల్లోవాళ్ల చాలసేపు మాట్లాడుకుంటూంటే, పోఖోమ్ వింటూ కూచున్నాడు. దుబాసీ, వాళ్ళకోరికను పోఖోమ్‌తో విన్నవించేడు. "మీ బహుమతులకు వాళ్ళు చాల సంతోషిస్తూ, అతిథుల్ని పూర్తిగా తృప్తిపరచి, వారిచ్చే బహుమతులకు ప్రతిగా వారికి తిరిగి బహుమానించడం తమ సనాతనాచారమని, తమతో విన్న వించమని కోరినారు, మీరు వారికి బహూమానము లిచ్చేరుగాన, యిప్పుడు వారివద్దనున్న వస్తువులలో మీకు మనసు వచ్చింది పేర్కొంటే, దానిని సంతోషంగా వారు తమకు సమర్పించగలరు."

"మీ భూమిలో కొంతభాగం నాకిస్తే చాలసంతోషిస్తా. మాదేశం లోనూ భూములున్నాయి. గాని పండించగా పండించగా అవి నిస్సార మైపోయేయి. మీభూములవంటివాటిని నేను చూడలేదు." అన్నాడు పోఖోమ్. దుబాసీ యీమాటల్ని వాళ్ళకి అనువదించి చెప్పినప్పుడు, వాళ్ళు చాల సంతోషించినట్లు పోఖోమ్ గ్రహించేడు. వాళ్ల నవ్వుతూ, బిగ్గరగా అరుస్తూ, చాలసేపు గందరగోళంగా మాట్లాడినదేమీ పోఖో ముకి తెలియకపోయినా, వాళ్ళు తనకోరిక తీర్చుటకు సుముఖులుగా వున్నట్లు గ్రహించడం అతనికి కష్టం కాలేదు. కొంతసేపటికి వాళ్ళంతా ఊరుకున్నారు. దుబాసీ, వాళ్ళ అభిప్రాయాన్ని యిట్లా చెప్పేడు" మీరు ఫలానాభూమి కావాలని చూపిస్తేసరి, అది మీదే అయిపోతుందని వాళ్ళంటున్నారు."

మళ్లీ బష్కీర్లు అంతా ఒక్కసారిగా మాట్లాడ్డం ప్రారంభించేరు. ఈతూరి వాళ్ళలో అభిప్రాయభేదాలున్నాయని, వాళ్ళవైఖరినిబట్టి పోల్చుకున్నాడు, పోఖోమ్. కొందరు వాళ్ళకులపతి అంగీకారంవుంటేగాని భూమి నియ్యడానికి వీలులేదంటున్నారనీ, మరికొందరు తామే భూమిని యివ్వవచ్చంటున్నారనీ దుబాసీ వారి వివాదాంశాన్ని విప్పి చెప్పేడు.

## 6

ఇంతలోనే గంభీరంగా నడుస్తూవచ్చి, ఒకమనిషి వీరిని సమీపించేడు. అతడు నక్కచర్మంతో చేయబడిన కుళ్లాయిని ధరించేడు. బష్కీర్లంతా నిశ్శబ్దంగా, లేచి నిలుచున్నారు, ఒక్కమాటుగా. "ఈయనే మాకులపతి." అన్నాడు, దుబాసీ.

పోఖోమ్, పెద్దకు అభివాదనంచేసి, ఓమంచి అంగీని, అయిదు పౌన్ల తేయాకునూతీసి, ఆయనకు సమర్పించేడు. వాటిని స్వీకరించి గౌరవస్థానంలో కూర్చున్నాడు, కులపతి. బష్కీర్లు చాలామంది ఒక్కమాటే మాట్లాడడం ప్రారంభించేరు, చాలసేపువరకూ వారంతా చెప్పేది ఓపిగ్గావిని, వాళ్ళకి ఊరుకోమని శిరఃకంపపూర్వకంగా సంజ్ఞచేసి, పోఖోమ్‌తో రష్యన్‌బాషలోనే సంభాషణ కుపక్రమించేడు, కులపతి.

"మీరు కోరినట్లే చేయవచ్చు, మావస్తువుల్లో మీకు చిత్తంవచ్చిన దానిని స్వీకరించండి. మాకు భూమికేమీ కొదువలేదు."

పోఖోమ్ ఆలోచించేడు. భూమిని నేను తీసుకోవడం యెల్లాగ; మళ్లీ దస్తావేజులు అక్కర్లేమా? ఈవేళ భూమంతా నాదేనని వాళ్ళు చెప్పవచ్చు? మరోనాడు నాదికాదని వాళ్లే అనరని నమ్మకం యెట్లా?"

కాని పైకిమాత్రం కులపతితో అన్నాడు: "మీదయకు చాల సంతోషం, మీకు కావలసినంత భూమివుంది. నాకు కావలసింది

కూడ కొంచెమే. విశాలమైన యీ ప్రదేశంలో నాభూమికి హద్దులేమిటో తెలిసికోవాలని వుందంతే. నాకిచ్చిన భూమిని కొలిచి, హద్దు లేర్పరచి, దస్తావేజులు వ్రాయించి యిప్పించాలని నాకోరిక. భగవానుడే జీవుల జననమరణాలకి కర్త. ఈశరీరాలన్నీ శాశ్వతాలు కాదుగదా! మీరు నాయందవ్యాజకరుణ చూపించి, నాకీ భూమిని యిస్తున్నారు. కాని ముందు మీబిడ్డలు యీభూమినే నానుంచి తీసుకోరని నమ్మకమేముంది ? ”

“మీరన్నది బాగానేవుంది. అట్లాగే దస్తావేజులు వ్రాసి యివ్వవచ్చు” నన్నాడు కులపతి.

“ఇటీవలనే ఓవర్తకుడు యిక్కడికి వచ్చేడు. అతనికి మీరు భూమినిచ్చి, క్రయదస్తావేజు రిజిస్టరీచేయించి యిచ్చేరుట. నాకూ ఆమాదిరిగానే యివ్వాలని నాఅభిప్రాయము”ని పోఖోమ్ మాటలో మాట కలిపేడు.

కులపతి అంతా గ్రహించేడు.

“అట్లాగే చేయవచ్చు. మనదగ్గిరే ఓవ్రాయసగాడున్నాడులేండి. ఇక్కడన్నీ వ్రాయించి, పట్నానికిపోయి, రిజిస్టరీ చేయించవచ్చును.” అని సమాధానం యిచ్చేడు.

“అయితే ధరనిర్ణయం యెట్లా ?” అనడిగేడు, పోఖోమ్.

“ధరకేముంది. మాది ఒకటేధర. రోజుకి వేయిరూబుల్సు.” అన్నాడు కులపతి.

పోఖోమ్‌కి అర్థంకాలేదు. భూమిని కొలవడానికి ‘రోజు’ మానం యెట్లాగవుతుంది ? అనుకుని—

“రోజు కొలమానం యేమిటి? ఎన్నియెకరాలవుతుంది, రోజుకి?” అనడిగేడు.

"మాకు కొలతలేమీ తెలియవు. భూమిని రోజుల్లెక్కనే అమ్ముతాం. షేము. ఒకదినంలో ఎంత ప్రదేశం చుట్టివస్తారో అంతా మీదవుతుంది, వేయి రూబుల్సు యిస్తే" నన్నాడు.

పోఖోమ్ ఆశ్చర్యపడ్డాడు. "అది చాలా వుంటుంది! ఒకరోజులో చుట్టిరాగల ప్రదేశం అయితే బోలెడంత అవుతుంది" అన్నాడు పోఖోమ్.

కులపతి నవ్వుతూ, "అదంతా మీదే అవుతుంది ఒక్కషరతు మీద; బైలుదేరినరోజు సూర్యాస్తమయం కాకపూర్వమే మీరు బైలుదేరిన చోటికి రాజాలకపోతే భూమిమీది కాజాలదు మీసొమ్ము మాకు చెందుతుంది" అన్నాడు.

"నే వెళ్ళినత్రోవ మీకెట్లా తెలుస్తుంది," అదుర్దాగా అడిగేడు. పోఖోమ్.

"మేము మీరుచెప్పినచోట కూర్చుని చూస్తూంటాము. ఒక చిన్న పారతీసుకునివెళ్ళి మీరువెళ్ళుదారిలో అచ్చటచ్చట రెంకుపారల మట్టి తిరగేస్తూ వెళ్ళండి. తర్వాత ఒగోతినుంచి యింకోగోతికి చాలు గీయవచ్చును. మీబిరిని ఎంతవైశాల్యంగా చేయగలరో చూచుకోండి. సాయంకాలంలోపునే మీరు సరిగ్గా బైలుదేరినచోటికి చేరుకోవాలి. ఎంత స్థలాన్ని చుట్టిరాగల్గితే అంతా మీదవుతుంది.

పోఖోమ్‌కి చాలసంతోషం కలిగింది. తెల్లవారేసరికి బైలుదేరాలని నిశ్చయించుకున్నాడు తనలోనే. మాంసంతింటూ తేనీరు, క్యుమిస్ త్రాగుతూ, బాతాఖానీ కొడుతూ రాత్రి చీకటిపడేవరకూ కాలంగడిపి, ఎవరెవరి మకాములకు వాళ్లు వెళ్ళిపోయేరు. పోఖోమ్‌కి మెత్తనితూలికా తల్పం వేసేరు, పండుకోడానికి. మర్నాడు ఉదయమే పెందలకడే వస్తామనిచెప్పి, అందరూ వెళ్ళిపోయేరు.

## 7

మెత్తనిపరుపూ, దిండ్లమీద పడుకున్నా పోఖోమ్‌కి నిద్రపట్టలేదు. అతని మస్తిష్కమంతా భూమినిగురించిన ఆలోచనలతో నిండి పోయింది. "వీలైనంత హెచ్చుభూమిని చుట్టిరావాలి. రోజులో ముప్పై ఐదుమైళ్ళు నడవగలను. ఇప్పుడు పగళ్లుచాలా పెద్దవికూడాను. ముప్పై ఐదుమైళ్ళ వలయంలో యెన్నియెకరాల భూమివుంటుందో మరి? నాకు తెలియదు. నావంతుకి వచ్చిన భూమిలో చచ్చుభూమి మళ్లీ అమ్మిపారేస్తా. లేదా కౌలుకిస్తా. మంచిభూమిలో నేను వ్యవసాయం చేస్తాను. రెండు కాండ్ల యెడ్లనేనా కొనాలి. యిద్దరు పాలేళ్ళను పెట్టాలనుకుంటా. శుభ్రమైన భూమిచూచి ఓ యాభైయెకరాలు, దున్ని. గోధుమపైరు పెడతా. మిగిలినది పశువులమేతకి బీడుగా వుంటుంది." ఈవరసని వెళ్ళేయి అతగాడి ఆలోచనలు.

రాత్రంతా అతనికి నిద్రపట్టనేలేదు. తెల్లవారుఝామున మాత్రం చిన్న కునుకు వచ్చింది. కన్ను మూసేడో లేదో అప్పుడేకల ! పీడకల! బైట పకపకానవ్వు వినవస్తే యెవరోనని తొంగిచూసేడట పోఖోమ్. కులపతి కడుపు రెండుచేతులా పట్టుకుని, పొట్ట చెక్కలయ్యేట్లా నవ్వుతూన్నాడు, ఎందుకో అడుగుదామని సమీపించగానే కులపతిగాదు. తనకీభూమిసంగతిచెప్పిన వర్తకుడయ్యేడు. అంతలోనే వోల్గా రైతుగానూ, చివరికి చేటచెవులూ, కొమ్ములూ గల పెద్దభూతంగాను మారిపోయేడు. గొంతుక్కూర్చుని, నెత్తిని చేతులు పెట్టుకునివున్న ఆపిశాచం కాళ్ళముంగల ఎవరోపండుకుని వుంటారు. కాళ్ళకి జోడులేదు; చొక్కా పంట్లాంమాత్రం తొడుక్కుని బోర్లా పడివున్నదెవరా అని చూడబోతే అది శవమనీ. అదైనా తనదే అయినట్లూ పోఖోమ్ తెలుసుకుని, చాల భయభ్రాంతుడయ్యేడు. మెలుకువ వచ్చింది.

"అబ్బే, కల. కలలన్నీ తలాతోకా లేనివే." అనుకుని బండితెర తప్పించి బైటికి చూసాడు. చుక్క పొడిచింది. తూర్పు ధూమ్రవర్ణంగా వుంది. తెల్లవారేసమయం. "బైలుదేరడానికి టైమ్ అయింది. వాళ్ళని లేపాలి, యింకాను." అనుకొని. ముందుగా తననౌకరుని లేపేడు. గుర్రానికి జీనువేసి, సిద్ధంచేయమని తాను బష్కీర్లను లేపడానికి పోయేడు.

"బైలుదేరడానికి వేళయింది. లేవండి, లేవండి!" అంటూండ గానే వాళ్ళంతా లేచేరు. కులపతికూడా బైటికి వచ్చేడు. హడావిడిగా తేనీరు తయారుచేసి. త్రాగుతూ, పోఖోమ్‌నికూడా త్రాగమన్నారు. తేనీటా. క్యుమిస్.—యేదీ త్రాగనన్నాడు. పోఖోమ్. "వెళ్లాలంటే టైమయింది. త్వరగా తెమలండి" అంటూ తొందరచేస్తూనే వున్నాడాతదు.

## 8

చివరకి అంతా సిద్ధమయేరు. కొందరు గుర్రాలమీదా, మరి కొందరు బళ్లమీదా బైలుదేరేరు. పోఖోమ్, అతనినౌకరూ ఒకబండి మీద. పారా, పలుగూ పట్టుకుని కూర్చున్నారు. మైదానంమీదకి వచ్చే సరికి వెలుగు వస్తూంది. అక్కడికి దగ్గర్లోవున్న మెట్టదగ్గిర బళ్ళు నిలిపేరు. అంతాదిగి, మెట్టపైకెక్కేరు. మెట్టపైని అంతా గుమిగూడేరు. పోఖోమ్‌ను సమీపించి, కులపతి చెయ్యిజాపి చుట్టూ చూపుతూ,

"ఇదంతా మాదే. నీ కనుచూపుమేరలోని దాంట్లోంచి నీయిష్టం వచ్చినంత తీసుకో." అన్నాడు.

పోఖోమ్ కండ్లు మిలమిల మెరసేయి. మైదానమంతా సమా నంగావుంది; భూమి నల్లరేగడిగడ్డ; మనిషిములిగేలా గడ్డి దుబ్బుపట్టి మెలిగివుంది.

కులపతి టోపీతీసి, నేలమీద వుంచేడు.

"ఇదే గుర్తు. ఇక్కడినుంచే బైలుదేరండి. మళ్లీ యిక్కడికే రాండి. మీరు చుట్టివచ్చి భూమంతా మీదే" అన్నాడు.

డబ్బుమూట పైకితీసి, టోపీమీదవుంచేడు, పోఖోమ్. బరువుగా వుంటుందని పెద్దకోటు విప్పి అక్కడ పడేశాడు. చిన్నసంచీలో రొట్టెలువేసి భుజాన వుంచేడు. బెల్టుబిగించి పెట్టుకుని, దానికి మంచి నీళ్ళతో తాబేటికాయ కట్టేడు. లాంగ్‌బూట్లు తొడుక్కుని, పార భుజాన వేసుకుని బైలుదేరేడు. ఆగిచూచేడు ఎటువెళ్ళడానికి నిశ్చయించుకో లేకపోయేడు, అన్నిపైపులా భూమి పచ్చికతో సారవంతంగానూ, ఆకర్షకంగానూ వుంది. చివర కనుకున్నాడు, పోఖోమ్. "ఎటువెళ్ళినా బాగానేవుంటుంది. కాని, తూర్పుదిక్కుగా వెడతాను, సూర్యభగవానుని కెదురుగా."

ఇట్లా అనుకుని సూర్యుని దిక్కుమొగమై, బద్ధకంతో ఒళ్లు విరుచుకుని, ఒక్కక్షణేకం ఆగేడు. సూర్యబింబం ఉదయాద్రిపైకి రావ డాన్నిచూచి, "ఒక్కక్షణంకూడా ఆలస్యం చేసుకూడదింక. చల్లగా ఉన్నప్పుడైతే నడవడం చాల సులభం" అనుకుంటూ, పార భుజాన పెట్టుకుని, కొండదిగి నడక ప్రారంభించేడు.

ప్రారంభంలో నడక మెల్లిగా సాగించేరు. ఒక అరమైలు వెళ్లేక పారతో మట్టికొట్టి, పెల్ల తిరగేశాదు. చుట్టూ పెల్లగించి, పైమట్టిని పోగుపెట్టి ఆనవాలుగా వుంచేడు. తర్వాత మళ్లీ పయనం సాగించేడు. నడక జోరుచేసి, రెండుమూడు ఫర్లాంగుల కొకచోట యిల్లాగే ఆనవాలు పెడుతూ పోతున్నాడు.

రెండుమైళ్లుదాకాపోయి, వెనకతిరిగిచూస్తే కొండగుట్టమీది జనం స్పష్టంగా కనిపించేరు, బళ్ళచక్రాల పట్టాలు అరిగివున్నాయేమో ప్రాతః

సూర్యుని కిరణాల్లో మిలమిల మెరుస్తూన్నాయి. తాను రెండుమైళ్ళు పైచిలుకు వచ్చివుంటా ననుకున్నాడు. పోఖోమ్. ఎండెక్కుతూంది. నడకవల్ల శరీరం వేడెక్కింది. చొక్కావిప్పి, భుజంమీద వేసుకుని. నడక సాగించేడు. కొంతసేపయేక పొద్దు చూసి, చల్ది తినేవేళయిందని గ్రహించేడు.

"పగటిపూట నాలుగుయాముల్లో ఒకయాము గతించింది. ఇంకా మూడుయామ లుందిలే. అప్పుడే తిరిగిపోనక్కర్లేదు. ఈ దిశలోనే యింకొంచెం దూరంపోతా. బూట్లు బరువుగా వున్నాయి. తీసేసినడుస్తే బాగుంటుందనుకుంటా" నంటూ కూర్చుని బూట్లు విప్పి, నడుం పటకాకి తగిలించుకుని, మళ్లీ వెంటనే బైలుదేరేడు.

ఇప్పుడు నడక తేలికగావుంది. "ఇంకో మూడుమైళ్ళు యీ తిన్నగానే పోతాను. ఆతర్వాత ఎడంవైపు తిరుగుతా. ఈప్రదేశ మంతా చాలాసారవంతంగా కనిపిస్తూంది. వెళ్ళినకొద్దీ భూమి బంగారమే. ఇది వదలాలనిలేదు." అనుకుంటూనే నడకసాగించేడు. కొంత దూరంపోయేక కొండగుట్టవైపు వెనుదిరిగిచూస్తే. కనిపించీ కనిపించకుండా వుంది. మనుష్యులు యేవో చీమలు ప్రాకుతూన్నట్లుగానూ, ఎండలో బండిపట్టాల మిలమిలలు చూచాయగానూ వున్నట్లనిపించింది.

"ఈదిశలో యిక్కడికి ఆపుతాను. ఇంక ఎడమవైపు తిరుగుతా. ఏమిటో అంతా ఉక్కగానూ, దాహంగానూ వుంద"నుకుంటూనే పారతో మరికొంత పెద్దపెల్ల త్రవ్వి, ఆనవాలుపెట్టేడు. తాబేటికాయ భుజాన్నించితీసి, కొంచెం మంచినీళ్ళుత్రాగి, మళ్లీ బైలుదేరేడు. ఈసారి ఎడమవైపుగా పోసాగేడు. గడ్డి చాల యెత్తుగాపెరిగి చొరశక్యంగాకుండావుంది. పోఖోమ్‌కి అలసటనిపించింది. సూర్యుడు నడినెత్తి మీదికి యెక్కేడు మధ్యాహ్నభోజనానికి వేళయింది.

"కొంచెం విశ్రాంతి తీసుకోవా" లనుకుంటూ, పోఖోమ్ కూర్చుని. సంచివిప్పి రొట్టి బైటికితీసేడు. రొట్టెతిని. మంచినీళ్ళు త్రాగేసరికి ప్రాణం కుదుటబడింది, కొంచెంసేపు నడుంవాలిస్తే బాగుండు ననిపించింది. కాని, వాలితే నిద్రాదేవత యెక్కడ ఆవహిస్తుందోనని భయపడి ఊరుకున్నాడు.

కొంతసేపయేక తిరిగి బైలుదేరేడు. ఈసారి నడక బాగానే సాగుతూంది. ఆహారం కొంచెం పుష్టిచేసింది. అయితేనేం ఎండ నిప్పులు చెరుగుతూంది. అలసటా మైకం కమ్ముకొస్తున్నాయి. పోఖోమ్‌కి. ఆగకుండా నడుస్తూనే; "అరగంట కష్టపడితే నాతరం వెళ్ళిపోతుంది. కష్టేఫలే." అనుకున్నాడు.

ఆదిశలోనే చాలాదూరం పోయేడు. ఇక మలుపు తిరుగుదామనుకుంటూండగానే. అక్కడి భూమిపల్లంగా, తేమగా వుండడం కనిపించింది. "ఈపల్లపునేల వదలడం ఏమిటి ? తెలివితక్కువ! నారబహు ప్రశస్తంగా పెరుగుతుందిక్కడ." అంటూ ఆభూమిని కూడ ప్రదక్షిణం చేసి. అవతలికొసను చిన్నగొయ్యితీసి, ఆనవాలువుంచి, మళ్లీ ఎడమకు మలుపుతిరిగేడు.

తిరగడంలో అతనిదృష్టి కొండగుట్టమీద పడింది. వేడిగాడ్పు కొడుతూంది, కళ్ళు మిరిమిట్లు కొంటూన్నాయి. కొండమీద ఏమీ కానరావడంలేదు.

"చాలదూరం వచ్చేసేను, నాభూమికి రెండువైపులు చాల పొడుగై పోయేయి. ఈతూరి తగ్గించేయాలి. లేకపోతే. కష్టం" అనుకుంటూ తొందరగా నడకసాగించేడు, సూర్యుడు అప్పుడే వాలిపోయేడు. మూడోవైపున మైలు సుమారుమాత్రం నడిచేడిప్పటికి. ఇంకా కొండగుట్టకీ, అక్కడికీ తొమ్మిది పదిమైళ్ళుంటుంది,

"ఇంక యెంతోదూరం నడవలేను. సరాసరిగా కొండకేపోతాను. నాభూమి నలుచదరంగా వుండదు. ఏంచేస్తాను? ఉన్నదే చాలునను కుంటా. ఇంక ఆట్టే టైములేదు." అంటూ పారతో ఆనవాలు గొయ్యి తీసి, అక్కడినుంచే తిన్నగా కొండవైపు పయనమయ్యేడు.

## 9

నడక చాలకష్టంగావుంది. ఆపాదమస్తకం చెమటతో తడిసి ముద్దయిపోయింది. పాదాలూ, పిక్కలూ చీరుకుపోయి, ముందుకు పోమంటున్నాయి. కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకుందామనివుంది. గాని సాహసించలేకపోతున్నాడు. కూర్చుంటే, సూర్యాస్తమయానికి ముందుగా కొండ చేరుకోలేనని, అతనికి తెలుసు. సూర్యుడు పోఖోమ్ కోసం అస్తమించకుండా కనిపెట్టుకుని కూర్చుంటాడా! పైగా సూర్యు నికి కోపంవచ్చి, ఎర్రబడి, త్వరత్వరగా దిగిపోతున్నా డనిపించింది, పోఖోమ్‌కి.

"ఆరెండువైపులా అంతదూరం వెళ్ళడంలో తప్పుచేసేను. ఆలస్యం అయితే యేంచేయాలి?" అని పశ్చాత్తాపంతో ఓసారి కొండ వైపూ, మరోసారి సూర్యునివైపూ పరికించి చూస్తున్నాడు. కొండేమో దూరంగానేవుంది; సూర్యుడైతే అస్త్రాద్రిని చేరబోతున్నాడు.

చాలకష్టంమీద ముందుకి భారంగా నడక సాగిస్తున్నాడు. ఈసారి అడుగులు తొందరగా, మరీతొందరగా వేస్తున్నాడు. చివరికి పరుగులోకి దిగింది. కొండ యింకా దూరంగానేవుంది. చిరిగి పేలికలైన చొక్కాను విప్పి పారేశాడు; పటకాను వేళ్ళాడుతూన్న బూట్లు వీపునవున్న తాటేటి కాయ, తలమీది టోపీ, అన్నీ అవతల పారేసేడు. పొడుగాటి పారను మాత్రం ఉంచుకుని, దాన్ని ఊతం తీసికుని, ముందు కెట్లాగో పో సాగేడు.

"అయ్యయ్యో! భూమంతా ఆపోశనపట్టాలని చూసేను ఇప్పుడు అంతా పోయీయెత్తు ఒచ్చింది. దురాశ దుఃఖానికిచేటు. సూర్యాస్తమయంలోపల కొండదగ్గరికి చేరుకో లేను. నాపని అయిపోయింది!" అనుకున్నాడు. భయం ఆవరించింది.

భయంవల్ల ఊపిరితీయడమే కష్టంగావుందిప్పుడు. సరాసరిగా పరుగెత్తుతూన్నాడు, పోఖోమ్. నోరెండి పిడచగడుతూంది. బనియనూ, లాగూ చెమటకి తడిసి శరీరాని కంటుకుపోయినాయి. దమ్ముకి ఊపిరితిత్తులు బ్రద్దలై పోతాయా అనిపిస్తూంది. గుండెలు 'గుభేల్ గుభేల్' సమ్మెటలతో కొడుతూన్నట్లున్నాయి. కాళ్లు దడదడలాడి పోతున్నాయి. భయం అలసటతో చనిపోతానేమో? అనేభయం, పోఖోమ్‌ను పిశాచంలా ఆవహించింది.

పోనీ, అని చావడానికీ భయంగానేవుంది. ఆగడానికీ మనసొప్పడంలేదు. "ఇంతదూరం పరుగెత్తి, చివరకి ఆగితే నన్నంతా చచ్చుదద్దమ్మనరూ? అప్పటికే కొండదగ్గిరకు వచ్చేదేమో. బష్కీర్ల అరుపులూ, కేకలూ వినిపిస్తున్నాయి. వాళ్ళకేకలకి అతనిగుండె మరింత వేగంగా కొట్టుకో నారంభించింది.

సూర్యుడు పశ్చిమాంభోనిధిలో గ్రుంకడానికి తొందరబడుతూన్నాడు. ఆకాశమంతా విలక్షణమైన కాంతిపుంజంతో నిండివుంది. ఎర్రటి రక్తపుముద్దలా అయ్యేడు, సూర్యుడు. ఇకనేక్షణంలోనైనా అస్తమించవచ్చు. కొండకూడా దగ్గిర్లోనేవుంది. తనలోని ఆఖరిశక్తిని వుపయోగించి పరుగెత్తుతున్నాడు, పోఖోమ్. కొండమీదిబష్కీర్లు కేకలువేయడం, చేతులు ఊపడంకూడా అతనికి వినిపిస్తూ కనిపిస్తున్నాయి. బొచ్చుటోపీ, దానిమీది డబ్బుమూటాకూడ చూడగలుగుతున్నాడు. కులపతి, పొట్టమీద చేతులుంచుకుని కూర్చుండడంచూసి, తనకల చటుక్కున జ్ఞాపకం

వచ్చింది. "నాకు చాల భూమేవుంది. కాని దాన్ని అనుభవించటానికి జీవించియుంటేగదా? అయ్యో! నాశనం అయిపోయేను. గడువు లోపల కొండ చేరుకోలేను." అనుకుంటూ సూర్యునివైపు చూసేడు. కడపటిప్రయత్నం చేయడానికి శక్తిని కూడదీసికొని, ముందునకొక్క ఉరుకుని దూకేడు. ఆవేగానికి శక్తిహీనములైన ఆతనికాళ్ళు తట్టుకోలేక పోయినాయి. పర్వతపాదానికి ఒక్క ఉరుకులో వచ్చి పడిపోయేడు. భూమ్యాకాశాలు చీకట్లు క్రమ్మినట్లయింది. ముందుకు చూసేడు. సూర్యాస్తమానం అయింది. అతని గొంతుకలోంచి బాధాసూచకంగా ఘుర్ఘురధ్వని వినవచ్చింది.

"అంతా అయిపోయింద్" అనుకున్నాడు, పోఖోమ్.

ఇంక ఆగిపోదామని ఆతడనుకుంటూంటే, బష్కీర్ల కేకలు, అరపులు వినిపించేయి. పోఖోమ్‌కి స్ఫూర్తి కలిగింది. తనకు కనిపించకపోయినా, కొండమీది బష్కీర్లు యింకా సూర్యుని చూస్తున్నారు. కొండమీదికి ఒక్క పరుగుపుచ్చుకున్నాడు, ఆయాసపడుతూ. అస్తంగత సూర్యునికాంతి రేఖలు యింకా కొండమీద పడుతూనే వున్నాయి. బొచ్చుటోపీ ఎదుట కులపతి కూర్చుని కడుపు రెండుచేతులతో పట్టుకుని పొట్ట చెక్కలయ్యేట్లా నవ్వుతూన్నాడు. పోఖోమ్‌కి, రాత్రి కల కళ్ళకి కట్టినట్లుంది; అతనికంఠంలోంచి ఓమూలుగు వెలువడింది; కాళ్ళుశక్తిహీనములైనాయి. పోఖోమ్ ముందుకు పడిపోతూ, రెండుచేతులతోనూ బొచ్చుటోపీని పొదివి పట్టుకున్నాడు.

"భేష్! నెగ్గేవు. నీకు మహామంచి భూఖండం దక్కింది." అంటున్నాడు, కులపతి.

సాష్టాంగంగా పడిపోయిన పోఖోమ్‌ను లేవనెత్తడానికి అతని సేవకుడు ముందుకు పరుగెత్తేడు. కాని, అప్పటికే సమయంమించిపోయింది. పోఖోమ్ నోటివెంబడి రక్తం కక్కుకుంటున్నాడు.

విచారసూచకంగా బష్కీర్లు తలలూపుతున్నారు.

సేవకుడు పారతీసికొని, పోఖోమ్‌ని సమాధిచేయడానికి గొయ్యి తీస్తున్నాడు.

చివరికి పోఖోమ్‌కి ఎక్కువస్థలం అక్కర్లేకనే పోయింది. కేవలం ఏడుజానల భూమి, ఎంతదేవులాడినా, చివరకి ఏడుజానలే అతను ఆక్రమించుకోగల్గింది, పాపం !

(రచన 1886)

---

# తల పిలుపు

ఫ్రాన్సు, యిటలీ దేశాలమధ్య, మధ్యధరా సముద్రాన్ని ఆనుకొని మొనాకో అనే చిన్నదేశం ఒకటుంది. ఈ రాజ్యం అంతా కలిపినా ఓ మామూలు పట్టణంలో వుండేటంత జనాభా వుండదు. దేశం అంతాపోగు చేసి జనాభా చిన్నా పెద్దా మొత్తం ఏడువేలకిమించదు. వైశాల్యం చూసి నా అంతంత మాత్రమే. అక్కడిభూమి తలకో యెకరంకూడా రాదు. ఆచిన్నదేశాని కోచిన్న రాజున్నాడు. అతనికో రాజభవనం, పరివారం, మంత్రులు, పీఠాధిపతులూ, సేనానాయకులు, సైన్యం, వుండాల్సిన తతంగమంతా వుంది.

సైన్యమంటే ఏమంత పెద్దదిగాదు లేండి. దాంట్లో అంతా కలసి ఓ అరవైమందిదాకా వుంటారు అయినా దాన్ని సైన్యమే అనాలి మరి. ఇతర రాజ్యాల్లో మల్లేనే యిక్కడా పన్నులూ గట్రావున్నాయి. పొగాకు పన్ను, సారాయంమీద పన్ను, తలపన్ను వగైరాలు. అక్కడి ప్రజలు కూడా ప్రపంచంలో అందరికీలాగే పొగాకు తాగుతారు. సారాయి పుచ్చు కుంటారు. వాటికి ఖర్చున్నా మొత్తం జనాభా తక్కువైనందువల్ల వాటి మీది పన్నులమూలంగా వచ్చేదిమాత్రం స్వల్పమే. రాజుగారి సిబ్బందికీ సైన్యానికీ, హవేలీకి అయే ఖర్చుకి యీరాబడి యెంతమాత్రం చాలదు. అదృష్టవశాత్తూ మరోరీతిగావచ్చే రాబడి వుండబట్టిగాని లేకపోతే పాపం రాజుగారూ సిబ్బంది మాడిపోవాల్సి వచ్చేది! ఆ రాబడి దేనిమీద అంటా రా? ఆ రాజ్యంలోని ద్యూత గృహాన్నుంచి వచ్చేదే. దాంట్లో 'రౌలెట్టీ' అనే ఒకరకం జూదం ఆడ్తారు. ఆదేవాళ్ళు ఓడినా గెల్చినా కాచిన పం దెంలో నూటకింతని ఆజూదపుయింటి యజమానికి దర్శించాల్సిందే. ఇట్లా వచ్చిన మొత్తంలో చాలభాగం రాజుగారికి పన్నుకింద మళ్ళీ అత డే చెల్లించాలి. అంత పన్ను చెల్లించుకుంటూ ఆరాజ్యంలో యెవరాడు

తున్నారు? అనే ప్రశ్న రావచ్చు. చెప్తా వినండి. యూరపులో అన్ని యితర దేశాల్లోనూ 'రౌలెట్టీ, అనేయీజూదాన్ని ప్రభుత్వాలు నిషేధించేయి. కొద్దికాలంకిందటివరకూ జర్మనీలోని కొన్ని చిన్న రాష్ట్రాలుకూడా యీ జూదాన్ని ఆడనిచ్చేవి. కాని వీటివల్లకలిగే హానివల్ల వాటిని అక్కడ కూడా నిషేధించాల్సివచ్చింది. ప్రతివాడూ అక్కడకిరావడం దగ్గరున్న తన డబ్బంతా అయిపోయేదాకా ఆడడం, తనది కాని డబ్బునూ, దగ్గర లేని డబ్బునూకూడ ఒడ్డి అదీ పోగొట్టుకోడం, ఆతర్వాత జీవితంమీదే విరక్తికలిగి కాల్చుకొనో, నీళ్ళలోపడో ఆత్మహత్య చేసుకోడం— యివి వాటిల్లో నిత్యకృత్యం అయిపోయింది. జర్మన్ ప్రజలుకూడా యీ దురన్యాయాన్ని భరించలేక పాలకులమీద ఒత్తిడితెచ్చి ఆ జూదగృహాల్ని మూసివేయించారు. కాని మొనాకో రాజుగారిమీద అటువంటి ఒత్తిడి తేగలవాళ్ళు ఆచిన్నరాజ్యంలో లేకపోబట్టి అతడే యీ జూద గృహాలకి ఏకైక గుత్తదారుగా నిలబడ్డాడు. అంచేత యీజూదం ఆడాలనేవాళ్ళంతా మొనాకో రావలసిందే. అక్కడ తమ ధనాన్ని ముడుపు చెల్లించాల్సిందే. ఇదీ దీనిలోని కిటుకు.

అక్కడికి జూదం ఆడ్డానికి వచ్చేవాళ్ళు నెగ్గనీ ఓడనీ రాజుగారు మాత్రం లబ్ధినే పొందేవారు. "చెమటోడ్చి కష్టించి చంద్రశిలా భవనాలెవడు కట్టేడు? అంటూంటారు పెద్దలు వినలేమూ? ఇదిబాడఖా వ్యాపారమని ఆ రాజుగారికీ తెలుసు. కాని అతన్నేంచెయ్యమన్నారో చెప్పండి. అతడు బ్రతకాలి కదా? అందుకు సొమ్మవసరం. జూదం వొదిలిపెట్టి పోనీ షాగాకు, సారామీద రాబడిమాత్రం ఏమంత న్యాయమైనదేమిటి? కంబళిలో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టడంలాగుంటుంది! అందుచేత న్యాయమా? కాదా! అనే శషభిషలేమీ పడకుండా రాజుగారు పన్నులు వసూలు చేయించడం పరిపాలన సాగించడం మామూలుగానే చేసేస్తు

న్నాడు. నిజమైన రాజులందరికిమల్లేనే అతడూ ఠోజా దర్జాగా దర్బారు తీరుస్తూంటాడు కూడాను।

ఈ రాజుగారికే పట్టాభిషేకం అయింది. నజరానాలు గట్రా వసూలుచేసేరు, కేసులూ, కోర్టులూ, శిక్షలూ, అప్పీళ్ళూ దయచూపడం- అన్నీ జరుగుతూన్నాయి. కేసులు పునర్విచారణా, చట్టాలూ, కౌన్సిళ్ళూ, న్యాయస్థానాలూ,-అన్నీ యితరప్రభుత్వాల్లోలాగే వున్నాయి. కాని అన్నీ చిన్నయెత్తునే వుంటాయి యిక్కడ. ఇదీ పూర్వ రంగం.

ఇట్లావుండగా కొద్దిసంవత్సరాలకిందట ఈదేశంలోఒకఖూనీనేరం జరిగింది. అసలు అక్కడి ప్రజలు చాలా శాంతులు. ఆదివరకెప్పుడూ యిట్లాటి ఘోరం ఆ రాజ్యంలో జరగనేలేదు. కేసు విచారణ జరుగుతూంది. జడ్జీలంతా అట్టహాసంగా కోర్టులో కూర్చున్నారు. ధర్మశాస్త్రాలు విధించినరీతిగా విచారణ సాగుతూంది. కోర్టుహాలంతా జడ్జీలు, జ్యూరీలతోనూ, ప్రాసిక్యూటర్లు, బారిస్టర్లతోనూ కిటకిటలాడుతూంది. వాదోపవాదాలు మహా తీవ్రంగా చెలరేగి చివరకి తీర్పు దగ్గరకి వచ్చింది. న్యాయ చట్టాల ప్రకారంగా నేరస్థునికి శిరచ్ఛేద శిక్ష విధించబడింది. అంతవరకు అంతా సవ్యంగానే జరిగింది. ఈ తీర్పును రాజుగారికి పంపించేరు. ఆయనా తీర్పును చదివించుకుని విని 'ఖాయం' చేసేసేరు. "ముద్దాయిని శిరచ్ఛేదం చేయాల్సివుంటే చేసేయడమే మంచిది." అని రాజాజ్ఞ అయిపోయింది.

ఇక్కడికొచ్చేసరికి ఘట్టి చిక్కు ఒకటి వచ్చి వూరుకుంది. ఏమిటంటారా ఆరాజ్యంలో శిరచ్ఛేదంచేసే పరికరాలుగాని, తలారులుగాని లేరు. మంత్రులంతా సమావేశమై యీవిషయాన్నగూర్చి చర్చించి, చివరకి ప్రక్కనే వున్న ఫ్రాన్సు ప్రభుత్వంవారికి యీ విషయంలో వ్రాయడానికి నిర్ణయించేరు. "ఒక నేరస్థుని శిరచ్ఛేదం చేసిపెట్టడానికై

సాధన సామగ్రినీ, ఒక నిపుణుణ్నీ సప్లయి చేయగలరా? సప్లయి చేయ గలిగేటట్లయితే ఎంత ఖరీదవుతుంది?" తెలుపమని జాబు వ్రాసేరు. వారంలో జవాబువచ్చింది. యంత్రమూ, నిపుణుడూ కూడ దొరుకుతారనీ ఖర్చులు వగైరాలు 16000 ల ఫ్రాంకులవుతాయనీ అందులో వ్రాసేరు. యీజాబును రాజుగారి యెదుట పెట్టేరు. రాజుగారు ఆలోచనలో పడ్డారు. పదహారు వేలే! "ఆ దౌర్భాగ్యుడు అందులో వెయ్యోవంతుకూడా ఖరీదు చెయ్యడు". అన్నారు రాజుగారు. ఎల్లాగో యింతకంటె చౌకగా చేయిం చలేమూ? మన రాజ్యంలో అంతా తలో రెండు ఫ్రాంకులూ వేసినా పద హారు వేలు కాదు. ఇంత ఖర్చుకి ప్రజలుఒప్పుకోరు తిరగబడి దొమ్మి చేస్తారేమో కూడాను!"

ఈపరిస్థితుల్లో కర్తవ్యం ఏమిటో ఆలోచించడానికి మంత్రుల సభను సమావేశపరిచేరు. చివరికి ఇటలీరాజుగారికి కూడా యీవిషయం లో జవాబు వ్రాయడానికి నిశ్చయించేరు. ఫ్రాన్సులోది ప్రజాప్రభుత్వం గనుక రాజులంటే దానికేమీ లక్ష్యమే వుండదు. ఇటలీరాజుగారు తోడి రాజుల్లో ఒకరుగదా! అంచేత యెల్లాగైనా యీపనిని కాస్త చౌకగా చేసి పెట్టేటట్లు చూడమని కోరవచ్చు. ఉత్తరం వ్రాసేరు; జవాబూ వచ్చింది.

శిరచ్ఛేదం చేయడానికి యంత్రాన్నీ, నిపుణుణ్నీ, సప్లయి చేయగల మని వ్రాయడానికి సంతోషంగావుందనీ, రాకపోక ఖర్చులతోసహా మొత్తం 12,000 ఫ్రాంకులు అవుతుందనీ. యిటలీ ప్రభుత్వంనుంచి సమాధానం వచ్చింది. ఇది కొంచెం చౌకగానే వుంది! కాని మొత్తంమీద యిదీ పెద్ద మొత్తమే! ఆకిరాతకుడు ఆందులో వెయ్యోవంతు ఖరీదుకూడాచెయ్యడు. ఈమొత్తం ఖర్చుచేయాలన్నా ప్రజలమీద తలో రెండు ఫ్రాంకుల పన్ను అదనంగా వసూలు చెయ్యాల్సిందే. మరోసారి మంత్రులు సమా వేశమై, యీపని ఇంకా చౌకగా చేయడానికి ఉపాయేమి అని చర్చించేరు. సైనికుల్ని కాపాడ్చేపెట్టి మేపుతూన్నాంగదా? వాళ్ళల్లో ఒకనిచేత నాపని

కొస్త కచ్చాపచ్చాగా అయినా, చౌకగా చేయించలేమా? ఈ ఉపాయం తోచేక సేనాపతిని పిలిపించేరు. "ఏమండీ! వీళ్ళు యుద్ధాల్లో మనుష్యుల్ని సునాయాసంగా చంపుతూన్నారుగదా? ఈ వెధవకి, కాస్త తల తీసేయలేరూ? ఇంతకూ వీళ్ళని తరిఫీమచేసింది అందుకే గామా?" అంచేత సైనికుల్ని పిలిచి, యీకాస్తపనీ చెయ్యలేరా? అని అడిగేడు సేనాపతి. వాళ్ళల్లో ఒకడూ అందుకు ఒప్పుకోలేదు. "అహా! మేమాపని చేయలేం. మేం అందుకోసంగాదు యిక్కడవున్నది." అన్నారంతా. కృతఘ్నులు!

ఇంక ఏంచెయ్యాలి? మంత్రిసభ సమావేశమై చర్చించింది; మళ్ళీ చర్చించింది. ఈవిషయంలో కర్తవ్యనిర్ధారణకై ఒక రాయల్‌కమిషన్‌ను వేసి తమబాధ్యత వదుల్చుకున్నారు. వాళ్ళూ ఒకకమిటీని, యింకో సబ్ కమిటీని వేసేరు. పెద్దరాద్ధాంతం చేసి చివరకి నేరస్థునిశిక్షను యావజ్జీవ ఖైదుగా మార్చాలని సిఫార్సుచేసేరు. ఇట్లా చేస్తే, రాజుగారు కరుణ చూపేరనే మాటా దక్కుతుంది; చౌకగా తేలిపోతుంది. ఒక్కదెబ్బకి రెండు పిట్టలు! సెభాష్!

రాజుగారూ దీనికి భేష్! అన్నారు. నిర్ణయమైతే జరిగిపోయింది. కాని, యిక్కడ మళ్ళీ యింకో గుంటచిక్కు వచ్చింది. యావజ్జీవఖైదీలకి ఆదేశపు జైళ్ళల్లో యేర్పాటులేదు. తాత్కాలికంగా ఖైదులో పెట్టాల్సినవాళ్ళకోసం ఒక చిన్న "లాకప్" మాత్రం వుంది. శాశ్వతోపయోగానికి పనికివచ్చే బలమైన బందిఖానా చేనిలోటు యెట్లాగ తీర్చాలి? ఆలోచించి, చివరికి ఒకపనిచేసేరు. దృఢమైన ఓగది ఖాళీ చేయించి, దాంట్లో ఆనేరస్థుణ్ణి పారేసి, బైట ఓసైనికుణ్ణి కాపలాపెట్టేరు. రెండు పూటలా ఆకాపలావాడే రాజుగారి"కందా"లోంచి భోజనంతెచ్చి ఖైదీకిపెట్టేఏర్పాటు చేసి, పీడ వదిలిందనిపించేరు.

నెలమీద నెల గడిచింది, చివరకి ఒకసంవత్సరం పూర్తయింది. రాజుగారు సాలుసరి లెక్కలు చూచేటప్పుడు ఖర్చుల్లో కొత్తపద్దు ఒకటి

నిని చూసేరు. ఖైదీకోసం అవుతూన్న ఖర్చది. అదికూడా తక్కువేం కాదు! ఒక కాపలాదారూ రెండుపూటలా తిండీ, సాలుకి అదంతా కలిపి 600 ఫ్రాంకులైంది. ఇంకా ఆందోళనాకరమైన సంగతేమిటంటే యీ ఖైదీ యింకా యువకుడు. ఆరోగ్యంగావున్నాడు. నల్లరాయిలాగ మరో యాభైయేళ్లేనా బతుకుతాడు. లెక్కలు కడితే వాడికిగ్రింద అయేఖర్చు పాతిక ముప్ఫై వేల ఫ్రాంకులకి తగ్గదు. అమ్మయ్యో! తలుచుకుంటే ఆచిన్న రాజ్యానికి అది పెద్దఖర్చే. ఇదేమీ వుపేక్ష చేసే సంగతి కాదు. అంచేత రాజుగారు మంత్రివర్గాన్ని మళ్ళీ సమావేశ పరచేరు.

"ఈ పోకిరీ వెధవతో మనకన్నీ చిక్కులే వచ్చేయి. ప్రస్తుతం జరుగుతూన్న పద్ధతి చాల వ్యయ సాధ్యమైంది. ఇంతకంటె చౌకగా వీడ్ని వదల్చుకొనే మార్గం ఆలోచించండి!"

మంత్రులు సమావేశమై తీవ్ర చర్చలు సాగించేరు. వాళ్ళల్లో ఓ తెలివైనవానికి ఒక ఉపాయం తోచింది. "కాపలావాణ్ణి తీసేస్తే కొంత ఖర్చు తగ్గుతుంది." వెంటనే మరోమంత్రి అందుకుని "కాపలా తీసేస్తె వాడు పారిపోతేనో?" అన్నాడు. ఉపాయంచెప్పిన మంత్రిసమాధానంతో సిద్ధంగానే వున్నాడు. "పారిపోనీ పీడ వదల్చుకుందామనే కాదుట య్యా మన తాపత్రయమంతాను!" ఈ నిర్ణయమే బాగున్నట్లు తోచింది అందరికీ. రాజుగారికి తమరాలోచించిన వుపాయాన్ని నివేదించేరు. ఆయ నా అంగీకరించేడు. కాపలావాణ్ణి తొలగించేసి. యేం జరుగుతుందోనని ఆతురతగా చూస్తూన్నారంతా. జరిగిందేమిటో తెలుసా? భోజనం వేళ దాకా ఖైదీ లోపలే వున్నాడు. మధ్యాహ్నం భోజనం వేళకి బయటికి వచ్చి కాపలావాడు లేకపోవడం చూసి, తానే బయలుదేరి సరాసరిగా రాజుగారి కంధాలోకివెళ్ళి భోజనం తెచ్చుకునితిని లోపలే కూర్చున్నాడు. పైగా తలుపులుకూడా వేసేసుకున్నాడు! ఆమర్నాడుకూడా యీలాగే జరి

గింది. అతను రోజూ సరిగా వేళకి జైలుదేరివెళ్ళి భోజనం తెచ్చుకునే వాడు. అంతేకాని పారిపోవడం విషయంలో- అతనికావుద్దేశ్యమే వున్నట్లులేదు. ఇంకచేసేదేముంది? ఇట్లాచేసినా వాడిపీడ వదిలేటట్లులేదు. ఏం చేయాలా? అని మళ్లీ మంత్రివర్గం సమావేశమై ఆలోచించింది.

"ఇంక వూరుకోకూడదు. వాడిక్కడ వుండకూడదని మనమే స్పష్టంగా చెప్పేద్దాం." అని నిశ్చయం చేసి న్యాయ శాఖామంత్రి యెదుటకి వాణ్ణి రప్పించి ప్రశ్నించేరు.

"ఏమయ్యా! నువ్వు యెందుచేత పారిపోవడం లేదు?" నీ మీద యెవరినీ కాపలా పెట్టడంలేదు. నీ యిష్టం వచ్చినచోటికి వెళ్ళవచ్చునాయెను. రాజుగారుకూడ చాల మంచివారు. నువ్వు వెళ్ళిపోయినా ఆయనేమీ అనుకోరులే." అన్నారు మంత్రిగారు.

"రాజుగారేమీ అనుకోరని నాకు తెలుసు. కాని నాకు చోటు ఎక్కడ వుంది వెళ్ళడానికి? నన్నింకా ఏంచేయగలరు? నన్ను విచారించి, శిక్షించి, సర్వనాశనం చేసేరు? ప్రజలంతా నన్నసహ్యించుకొనేలాచేసేరు ఇప్పుడు నన్నెవరు దగ్గిరికి రానిస్తారు? పై పెచ్చు యీ సంవత్సరం పైచిలుకునుంచీ యిక్కడే కూచోపెట్టేరు. పనీలేదు, పాటూలేదు. పనిచేసే అలవాటు కూడా తప్పిపోయింది. నన్ను యెంతో అవమానకరంగా చూసేరు. ఇల్లాచెయ్యడం ఏం న్యాయంగా వుంది, మీకు? ఇంతకీ ఒక మాట. నాకు మరణశిక్ష విధించినతర్వాత శిరచ్ఛేదం చేయకుండా యెందుకూరుకున్నారు? ఆతరవాయి కాస్తా తీర్చేయవలసింది. ఆలోపం మీదే. అయినా దానికి నేను మిమ్మల్నేమైనా అన్నానా? మళ్ళీ నన్ను ఖైదులో పెట్టి, కాపలావాణ్ణి యేర్పాటుచేసి. భోజనం కూడా యిక్కడికే పంపుతూన్నారు. పోనీగదాఅని ఊరుకుంటే, ఆకాపలావాణ్ణీ తీసేసేరు. భోజనం

కూడా నేనే తెచ్చుకోవలసివచ్చింది. అప్పటికీ నేనేమీ అననేలేదు చివరికి యిప్పుడు మీరు నన్నే వెళ్ళిపొమ్మంటున్నారు! ఇందుకుమాత్రం నేను ఒప్పుకోను. మీరు ఏమిటి చేయండి, నేను మాత్రం వెళ్ళను!" అని భీష్మించి కూచున్నాడు ఖైదీ.

ఇంకేంచేస్తారు? యీ సమాధానం వినేసరికి మంత్రిగారికి కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. మళ్లీ కౌన్సిలు సమావేశమై యీసమస్యని గూర్చి తీవ్రంగా చర్చించింది. ఇప్పుడు చేయవలసిందేమిటి? ఆదౌర్భాగ్యుడు పోనంటున్నాడు! వాళ్ళు ఆలోచించేరు; తర్కించేరు; చివరికి ఒకటే ఉపాయం కనిపించింది. వాడికి ఏదో కొంచెం "భరణం" ముట్టచెప్తే? సరే యింక చేసేది మాత్రం ఏముంది? ఈనిశ్చయానికి వచ్చి, రాజుగారికి తెలియపరిచేరు. మంత్రులంతా ఏకకంఠంగా అన్నారు :

"మరోదారి లేదు. ఎల్లాగైనా వీణ్ణి వదల్చుకోవాలిగదా" రాజుగారు మాత్రం అనేటందుకేముంది? అంతా ఒప్పుకున్నాక ఖైదీని పిలిచి చెప్పేశారు. "సాలీనా 600 ఫ్రాంకులు భరణంక్రింద యిస్తాం వెళ్ళిపో."

"సరే, అల్లాగే వెళ్ళడానికి నాకేం అభ్యంతరం లేదు. కాని మీరు మాత్రం యీసొమ్ము బకాయిపెట్టడానికి వీల్లేదుసుమండీ! అల్లాఅయితేనే కాని ఒప్పుకోను" అన్నాడు వాడూ.

అంతా పరిష్కారం అయిపోయింది. మూడోవంతు సొమ్ము ముందే యిచ్చేశారు. వాడూ ఆదేశం వదిలి, సరిహద్దులావల ఒకచోట కొద్దిగా పొలం క్రయానికి తీసుకుని, మకాం పెట్టేడు. అక్కడికీ యీ రాజ్యానికీ పావుగంట ప్రయాణం, రైలుమీద! పొలంలో పళ్లూ, కూరగాయలూ పండిస్తూ, సుఖంగా జీవనం గడుపుతున్నా డిప్పుడు. రాజుగారీయవలసినభరణం తెచ్చుకోడానికి వాడెప్పుడూ ఒక్కరోజు కూడా ఆల

స్యం చేయడు. ఆడబ్బు వసూలుచేసుకుని, జూదగృహానికివెళ్ళి సరదాగా రెండుమూడు ఫ్రాంకులు పందెంలో ఒడ్డేవాడు. ఒకప్పుడు నెగ్గేవాడు. మరొకప్పుడు ఓడేవాడు. ఆపళంగా పైలుదేరి రికామీగా చేతు లూపు కుంటూ యింటికి చేరుకునేవాడు. సుఖంగా, ప్రశాంతంగా అతని జీవితం గడిచిపోతూంది!

ఇప్పుడు కూడా మనుష్యులతలలు తీయడానికికాని, బతికున్నంత కాలం జైల్లో పెట్టి మేపడానికిగాని యెంతఖర్చైనా వెనుకదీయని దేశా లెన్నో వున్నాయి. అట్లాంటి దేశంలోనే గనక ఆతడీనేరం చేసివుంటే, పాపం, ఏమయేదో? అదృష్టవంతుడు గనుకే అట్లాంటిదేశాల్లో పుట్టలేదు వాడు!

(ఫ్రెంచిభాషలో మపాసా ననుసరించి రచన 1897)

# కోడిగ్రుడ్డంత గోధుమగింజ.

ఒక రోజున కొందరు పిల్లలు ఒక కొండ లోయలో ఆటలాడుకుంటూ గోధుమ గింజలాంటి ఆకారంతోనున్న వస్తువు నొకదాన్ని చూచేరు. అది కోడిగ్రుడ్డంత పెద్దదిగావుండి నిలువునా మధ్యలో చాలుతో సరిగ్గా గోధుమగింజలాగేవుంది। ఆబాలురుదానితో వినోదంగా ఆడుకుంటూంటే దారినిపోయే బాటసారి ఒకడు చూచి ఆశ్చర్యపడి వాళ్ళ చేతుల్లో ఒక అణా పెట్టి ఆ గింజను తీసుకున్నాడు. ఆ బాటసారి దాన్ని తిన్నగా తీసుకొనివెళ్ళి ఆ దేశపు రాజుగారికి దాన్ని విక్రయించేడు.

అపురూపమైన యీ వస్తువుని చూసి రాజుగారు ఆశ్చర్యపడి తన ఆస్థానంలోని బుద్ధిమంతులనందర్నీ పిలిపించి అదేమిటో కనుక్కోమన్నారు. వాళ్ళంతా బుర్రలుబద్దలుకొట్టుకుని ఆలోచించికూడా దాని తలాతోకా తేల్చలేకపోయేరు. రోజులు గడిచిపోతూన్నాయి. చివరకోరోజున ఆవస్తువు గదిలో వుండగా కిటికీలోంచి పిచిక ఒకటి ఎగిరివచ్చి దాన్ని పొడిచి ఒక చిన్నరంధ్రం చేసింది. అప్పుడది గోధుమగింజని అందరికీ తెలిసిపోయింది. ఆ బుద్ధిమంతులంతా రాజుగారివద్దకుపోయి ధైర్యంగా తమ అభిప్రాయాన్ని చెప్పేసేరు.

"ప్రభూ। అదొక గోధుమగింజ."

ఇదివిని రాజుగారు చాల ఆశ్చర్యపడ్డారు. మళ్లీ తన ఆస్థాన విద్వాంసుల్ని పిలిచి అటువంటి ధాన్యం యెక్కడ యెప్పుడు యేకాలంలో పండేదో తెలుసుకోమని ఆజ్ఞాపించేరు. విద్వాంసులు పుస్తకాలన్నీ తిరగేశారు. తలలు కాచెక్కేలా ఆలోచించేరు. కాని యిటువంటివాన్ని గురించి యెక్కడాయెవరూ వ్రాయనేలేదు. చివరకి రాజుగారిదగ్గరకి వచ్చి చెప్పేశారు.

"అయ్యా! దీనికి సమాధానము మేము చెప్పలేకుండా వున్నాము. మా పుస్తకాల్లోకూడా దీన్నిగురించి యేమీ లేదు. తమరు యీ భోగట్టా రైతున్ని అడుగుతే బాగుంటుంది. వాళ్ళు బహుశా తమ తాత ముత్తాతల వల్ల యిటువంటి గింజనిగూర్చి వినివుండొచ్చు."

అందుచేత రాజుగారు తమ సిబ్బందీని పిలిచి ఆజ్ఞ యిచ్చేరు. "మన రాజ్యంలోకల్లా వృద్ధుడైన రైతునొకణ్ణి పట్టుకురాండి."

వాళ్ళు గ్రామాలన్నీ గాలించి చివరికొక ముసలి రైతును పట్టుకున్నారు. వానికి నడుం వంగింది. పళ్ళు వూడిపోయేయి. తెల్లగా పాలిపోయివున్నాడు. రెండు చంకలక్రిందా రెండు కర్రలు బోటు పెట్టుకుని అతి కష్టంమీద తూలుతూ రాజుగారి యెదుటికి వచ్చి నిలబడ్డాడు.

రాజుగారారైతుకి ఆ గోధుమగింజను చూపించేరు. కాని రైతుకి దృష్టి ఆనటంలేదు. చేతులో వేసుకుని అటూ యిటూ త్రిప్పి తాకి చూసేడు. రైతు యెంతకీ మాట్లాడకపోడంచూసి రాజుగారే అడిగేరు:

"తాతా! ఇటువంటిగోధుమ యెక్కడ పండుతుందో చెప్పగలవా? నువ్వెప్పుడేనా యిటువంటిదాన్ని పండించడంగాని, కొనడంగాని చేసేవా?"

ఆముసలిరైతుకి బ్రహ్మచెముడు కూడాను. రాజుగారు చెప్పింది అసలు అతనికి వినిపించనేలేదు. చాలసేపు తంటాలుపడిచెప్పగా, అసలు సంగతి తెలుసుకున్నాడు తాత.

"అబ్బే లేదు, మహాప్రభో! నే నెప్పుడూ యిట్లాంటిదాన్ని చల్లనూలేదు, కొయ్యనూలేదు, చివరికి కొననూలేదు. నేనెప్పుడు గోధుమలు కొన్నా గింజలు యిప్పుడున్నట్టుగానే ఉండేవి. మానాయన ఒకవేళ ఇటువంటిదాన్ని గూర్చి విని వుండొచ్చు. ఆతన్ని తమరు పిలిపించి, అడగండి!" అని సమాధానం చెప్పేడు.

రాజుగారిభటులు ఆవృద్ధునితండ్రిని వెదకి కనుక్కొని, దర్బారులోకి తీసుకొచ్చేరు. అతడూ ముసలివాడేగాని ఒక్క కర్రసాయంతోనే నడిచి రాగలిగేడు. రాజుగా రాతనికా గోధుమగింజను చూపించేరు. ఆముసలి రైతుకి యింకా దృష్టి బాగానే వుంది. బాగా పరకాయించి గోధుమగింజను చూస్తూంటే రాజుగా రడిగేరు :

"తాతా! ఇట్లాంటి గోధుమ యెక్కడ పండేదో చెప్పకలవా? నువ్వెప్పుడేనా అటువంటిది పండించిగాని, కొనిగాని వున్నావా?"

ఈముసలిరైతుక్కూడా చెవుడేకాని, కొడుకుకంటె బాగానే వినిపిస్తుంది. త్వరలోనే గ్రహించి, సమాధానం యిచ్చేడు :

"లేదండి, నేనెప్పుడూ యిటువంటి గోధుమను పండించలేదు. ఇంక కొనడం అంటారా, ఆపనీ చెయ్యలేదు. మారోజుల్లో అసలు డబ్బే యెరగం! ప్రతీవాళ్లూ అన్నీ పండించుకునేవాళ్ళు. అంతగా యెవరికేనా అవసరమొస్తే యిరుగుపొరుగువాళ్ళు సాయంచేసేవాళ్ళు. అమ్మడం కొనడం. మారోజుల్లో యెరగం. మారోజుల్లో గింజమాత్రం యిప్పటివాటికంటె పెద్దదిగానూ, బరువుగానూ మాత్రం ఉండేది. ఈరకం గోధుమ నేనైతే యెరగను. కాని, మానాయన చెపుతూండేవాడు. తనచిన్నప్పుడు యింతకంటె పెద్దవీ, బరువైనవీ గింజల్ని యిచ్చే గోధుమ పైరుచేసేవాళ్ళమని. కావలిస్తే మీరతన్ని పిలిపించి అడగొచ్చు".

రాజుగారికి ఆశ్చర్యం కలిగింది. భటులకాజ్ఞాపించేరు. వాళ్ళువెళ్ళి ఆముసలివాణ్ణి వెతికి పట్టుకున్నారు. ఆతడు కదురులా ఊతంలేకుండానే నడిచివచ్చేడు. అతనికి చూపు బాగానే ఉంది; చెవుడు లేదు; తొస్సిలేకండా స్పష్టంగానే మాట్లాడుతూన్నాడు. రాజుగారాతనికి గోధుమగింజ చూపించేరు. తాత, దాన్ని చేతుల్లో అటుయిటు వేసుకుంటూ, చూసి అన్నాడు.

"ఇల్లాంటి మంచిదినుసుగింజ చూసి చాలాకాలమైంది, బాబూ!" అంటూనే గింజ కొరికి, కొంచెం ముక్క చప్పరించి, రుచి చూసేడు. కొంచెం ఆగి, "ఇది సరిగ్గా అరకమే!" అన్నాడు.

రాజుగారికి కుతూహలం హెచ్చింది.

"తాతా! ఇట్లాటి గోధుమ యెక్కడేనా కొన్నావా? లేకపోతే మీపొలంలోనే పండేదా?" అనడిగేరు.

ముసలితాత చిరునవ్వునవ్వుతూ, అన్నాడు:

"మారోజుల్లో అన్నవిక్రయం మహాపాపంగా పరిగణించేవాళ్లం. చివరకి ధాన్యాదులు కూడా యెవరూ కొనడంగాని అమ్మడంగాని లేనే లేదు. అసలు మారోజుల్లో డబ్బేలేదు: ప్రతివాళ్ళకీ కావలసినంత పంట ఉండేది."

"తాతా! మీపొలం యెక్కడఉండేది? ఈమాదిరి గోధుమగింజలు పండించేటందుకు మీరేంచేసేవారు?" అనడిగేరు మళ్ళీ, రాజుగారు.

"ప్రభూ! దేవుడు నిర్మించిన యీభూమే నాపంటపొలం. ఎక్కడ నాగలి మోపి దున్నితే అక్కడే నాచేనుగట్టు. భూమి యెవరిదీ గాదు. ఎవరు పడితే వాళ్లు స్వేచ్ఛగా భూమి దున్నుకుని, వ్యవసాయం చేసుకో వచ్చు. "ఈభూమి నాదీ" అనేవాళ్ళు ఆరోజుల్లో యెవరూలేరు. రెక్కల కష్టం ఒక్కటే మానవుని స్వంతం, తనుచేసే కష్టఫలితం మీదే అతనికి హక్కు" అన్నాడు, తాత.

"ఇంకో రెండు ప్రశ్నలకి మాత్రం జవాబియ్యి, తాతా" అన్నారు రాజుగారు.

"ఒకటి; ఆరోజుల్లో భూమి అటువంటిపంటల్ని యిచ్చేది, ఇప్పు డెందుకని అటువంటి దినుసును యివ్వడంలేదు? రెండో ప్రశ్న ఏమి

టంటే; నీమనుమడు రెండు చంకకర్రలతో గాని నడవలేకుండా ఉంటే; నీకొడుకు ఒకకర్రఊతంతో నడుస్తూన్నాడు; నువ్వు యేసాయం అక్కర్లేకుండానే నడవగలుగుతూన్నావే! నీ కళ్ళు చక్కగా కనిపిస్తూన్నాయి, చెవుడు రాలేదు, పళ్లు ఊడలేదు, మాట ఏమీ కొణుగు పోలేదు. నీకూ నీ మనుమడికీ యీ తేడా యెందుకుంది? చెప్పు."

తాత సూటిగా జవాబిచ్చేడు. "ప్రభూ! యిట్లాజరగడానికి కారణం లేకపోలేదు. ఇదివరలో మానవులు తమ శ్రమమీదే ఆధారపడి జీవించేవాళ్ళు. ఇప్పుడో, చాలమంది యితరుల కష్టంమీద ఆధారపడి సోమరులుగా బ్రతుకుతూన్నారు. పూర్వం అంతా ప్రకృతి శాసనాల నతిక్రమించకుండా జీవించేవారు. తను శ్రమపడి ఉత్పత్తి చేసిన వస్తువులతోనే గడుపుకొనేవాళ్ళా రోజుల్లో. ఇతరుల వస్తువులకై మనస్సులోకూడా వాంఛించడం పాపంగా యెంచేవాళ్ళు. ఇప్పుడో కాలుమీదకాలేసుకూర్చుని అందరికంటె బాగా తినడమే గొప్ప సంగతిగా భావిస్తున్నారు. ఇదే తేడా అప్పటికీ యిప్పటికీ. అందువల్లనే పంటలూ క్షీణించేయి; మనుష్యుల జవ సత్వాలు పుడుగుతున్నాయి.

(రచన 1886)

# సూరత్ సత్రంలో.

పశ్చిమ ఇండియాలోని సూరతు నగరంలో ఓ పెద్ద సత్రం వుండేది. దేశదేశాలనుంచి యెందరో ప్రయాణీకులు యాత్రికులు వచ్చి, అక్కడ బస దిగుతూంటారు. సత్రం యెల్లప్పుడూ వచ్చేపోయేవారితో, వాదోపవాదాలతో సందడిగా ఉంటుంది.

ఒకరోజున పెరిష్యాదేశపు వేదాంతి ఒకడు యీ సత్రానికి వచ్చి మకాం చేసేడు. అతడు తన జీవితాన్నంతనీ "ఈశ్వరతత్వ" విచారంలోనే గడిపేడు. ఎన్నోగ్రంథాలు చదివేడు; ఎన్నోపుస్తకాలు స్వయంగా రచించేడుకూడాను. ఈశ్వరతత్త్వాన్నిగూర్చిఎంతోతరచితరచిఆలోచించి, చదివి, వ్రాసినవాడవడంవల్ల కాబోలు చివరకి అతనికి దేవునియందు నమ్మకమేపోయింది. పెరిష్యాచక్రవర్తి "షా"కు యీవిషయం తెలిసి, యీ తాత్త్వికుణ్ణి దేశంనుంచి తరిమేశాడు.

ఈవిధంగా తనజీవితమంతా కారణకారణమైన అన్వయంవ్యక్తిని గూర్చిన విచారంలో గడిపి, యీతడు ఉన్నమతిని కూడా పోగొట్టుకున్నాడు పాపం! తన మతి భ్రమసించదనే విషయాన్ని గుర్తించలేక, యీ జగత్తుకంతకీ మూలకారణం ఒకటున్నదని ఒప్పుకోని స్థితికి వచ్చేడు.

ఇతనికి ఒక నీగ్రోసేవకుడున్నాడు. వాడీతనితో కూడానే ఉంటాడు. ఆవేదాంతి సత్రంలోపలికి వెళ్ళినపుడు, నీగ్రోసేవకుడు బైటనే ద్వారందగ్గరనున్న ఒకరాతిమీద యెండలో కూర్చుని, చుట్టూ ముసురుతూన్న యీగల్ని తోలుకుంటూన్నాడు. వేదాంతి సత్రంలోపల అరుగు మీద కూర్చుని గంజాయితో తయారుచేసిన "భంగు" సేవించ నారంభించేడు. కొంచెంసేపట్లో గంజాయి తన పని ప్రారంభించింది. మెదడు

మరు కెక్కింది. నాలుక పదునైంది. చిలకపలుకులు వస్తున్నాయి. అక్కడ కూర్చునే తెరచియున్న ద్వారంలోంచి సేవకుణ్ణి బిగ్గరగా కేకలు వేస్తున్నాడు.

"ఏరా ! దౌర్భాగ్యుడా ! దేవుడున్నా డంటావా? లేడంటావా?"

"లేకేం బాబయ్యా ! దేవుడు లేకపోతే మనమెల్లా వచ్చామంటా?" అంటూ ఆనీగ్రో సేవకుడు మెల్లిగా అంగీక్రిందినుంచి ఒక చిన్నికఱ్ఱ బొమ్మని పైకి తీసేడు. "చూసేరా, ఇదుగో, యీదేముడే నన్ను పుట్టి నప్పటినుంచీ రక్షిస్తూన్నాడు. మాదేశంలోవాళ్ళందరం ఒక పవిత్ర వృక్షాన్ని కొలుస్తూంటాము. ఆచెట్టుకఱ్ఱతోనే యీబొమ్మని చేసేరు !"

ఈ వేదాంతికీ, నీగ్రోసేవకునికీ జరుగుతూన్న యీసంభాషణను ఆసత్రంలోని వాళ్ళంతా వింటున్నారు. అతనిప్రశ్న విని ఆశ్చర్యపడిన వాళ్లు, సేవకుని జవాబు విని మరీ ఆశ్చర్యపడిపోయేరు.

అక్కడి శ్రోతలలోని బ్రాహ్మణు డొకడు యిదంతా విని, సేవ కునివైపు తిరిగి, వాణ్ణి మందలిస్తూన్నట్లుగా;

"ఓరి మూర్ఖుడా ! నువ్వెక్కడ పుట్టేవురా? దేవుడు నిజంగా నీఅంగిజేబులో దాచుకోడానికి వీలైనవాడేనుట్రా ? విను. దేవుడు ఒక్కడే. అతనినే "బ్రహ్మ" అంటారు. అతడు ప్రపంచాన్నంతనీ సృష్టించినవాడు. అందుకనే అతడు యీబ్రహ్మాండమంతటికంటే స్థూల మైనవాడు. పవిత్రమైన గంగానదీతీరమంతా కూడా ఆబ్రహ్మయొక్క పూజార్థమై నిర్మింపబడిన గొప్ప గొప్ప దేవాలయాలతో నిండివుంది. ఆదేవాలయాల్లో బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు నిత్యం ఆ దేవదేవునిపూజి స్తూంటారు. ఆబ్రాహ్మణులొక్కరే ఆమహాపురుషుని తెలిసినవారు ! వేల కొద్ది సంవత్సరాలు గడిచినాయి. కల్పం తర్వాత కల్పం గడిచినాయి. యింతకాలాన్నుంచీ మాబ్రాహ్మణులు తమ ఆధిక్యతనీ, విజ్ఞానాన్నీ

భద్రంగా కాపాడుకుంటూ వస్తూన్నారు. ఎందుచేతంటే సత్యస్వరూపు డైన దేవుడే మమ్మల్ని కాపాడుతూన్నాడు."

తన మాటలవల్ల అందరూ యదార్ధవిషయాన్ని గ్రహింపుతారనీ తనయందు గురి వుంచుతారనీ ఆ బ్రాహ్మణుని వూహ! అట్లా యెందుకు జరుగుతుంది? అక్కడివారిలో వున్న యూదువర్తకుడొకడు మాట్లాడ నారంభించేడు.

"మీరు చెప్పేదానికి నేను అంగీకరించను. నిజమైన దేవుని ఆల యము హిందూదేశంలోలేదు. ఆదేవుడు ఒక్క బ్రాహ్మణులనే రక్షించడ మసలే సత్యము గాదు. బ్రాహ్మణులు చెప్పే దేవుడు నిజమైన దేవుడు కాదు. అబ్రహాం, ఇస్సాక్, యాకోబ్‌ల దేవుడే నిజమైన దేవుడు. ఈ ప్రపంచం పుట్టినప్పటినుంచీ ఆ దేవుడు మా ప్రజల్ని అభిమానిస్తూ న్నాడు. ఇస్రాయేయులు ఆతనికి ప్రియమైన బిడ్డలు, మమ్మల్నే అతడు ప్రత్యక్షంగా రక్షిస్తూన్నాడు. ఇప్పుడుమేము చెట్టుకి పిట్టగా చెదరిపోయి ప్రపంచమంతా దిమ్మరుతూన్నామంటే, ఆ యెహోవా మమ్మల్ని పరీక్ష చేస్తున్నాడేగాని వేరు గాదు. ఆ దేవుడు ఒకనాటికి మమ్మల్నందర్నీ యెరూషలేమ్‌లో సమకూరుస్తానని వాగ్దానంచేసే వున్నాడు. ప్రాచీన ప్రపంచానికల్లా అత్యద్భుతమైన యెరూషలేమ్ దేవాలయం తిరిగి తన తొల్లిటి వైభవానికి రాగలదు. అప్పుడు ప్రపంచాన్నంతనీ యిస్రాయేలు యేకచ్ఛత్రాధిపత్యం వహించి పరిపాలింపుతాడు."

ఈ మాటలంటూ ఆ యూదు తన్మయత్వంతో ఆనందభాష్పాలు విడుస్తున్నాడు. ఆతడింకాయేదో చెప్పాలనుకుంటున్నాడు. గాని మధ్యలో ఇటలీ దేశస్థుడైన కాథలిక్ మతబోధకుడొకడు మాట్లాడనారంభించేడు.

"నువ్వు చెప్పేదంతా అబద్ధమే. దేవుణ్ణి పక్షపాతం గలవా డంటావే నువ్వు? ఇతర ప్రజలకంటె నీజాతి ప్రజల నాదేవుడు అధి

కంగా యెట్లా ప్రేమిస్తాడు? ఎప్పుడో పూర్వకాలంలో ఆదేవుడు హీబ్రూలపై అభిమానంచూపేడంటే యేమోగాని, పంథొమ్మిదివందల సంవత్సరాలనుంచి వాళ్ళమీద దేవుడికి మహా మంటపుట్టి, వాళ్ళని నాశనంచేసేసి, చిందర వందర చేసేడు. అందుకనే యిపుడు యూదీయ మతంలోకి యితరులను చేర్చుకోడమూ జరగటం లేదు. వున్నవాళ్ళే యితర మతాల్లోకి పోయి అది నామరూపాల్లేకుండా పోతూందికూడాను! దేవుడు ఏ ఒక జాతినీ అభిమానించడు. రక్షించ బడాలని వున్నవాళ్ళ నందర్నీ పరమ పవిత్రమైన రోమన్ కాథలిక్ చర్చి క్రిందికి రమ్మని ప్రభువు పిలుపు నిచ్చేడు. ఈ మతంలో తప్పితే మరెక్కడా మోక్షం దొరకదు."

ఇటాలియను యీ మాటలు చెప్పడంతోనే అక్కడేవున్న ప్రొటెస్టంటు మతస్థునికి వొళ్ళు మండిపోయింది. బిగ్గరగా అరుస్తూ అతన్ని యెదుర్కొన్నాడు.

"ఏమిటి నువ్వు మాట్లాడేది చెత్త! ఒక్క నీమతం పుచ్చుకుంటేనే మోక్షం కలుగుతుందని యెట్లా చెప్పగలవు? దేవుని వాక్యాన్ని త్రికరణాయా యెవరు ఆచరణలో పెడతారో వారే రక్షణ పొందుతారు. మన ప్రభువు ఏసుక్రీస్తు చెప్పినరీతిని నడుచుకున్నవారికే మోక్షం."

సూరత్‌లో కస్టమ్స్ ఆఫీసరుగా పనిచేస్తూన్న ఒక మహమ్మదీయుడుకూడ అక్కడ కూర్చుని హుక్కా త్రాగుతూన్నాడు. ఈమాటలు విని యేదో మహాపొడిచేసినవాడిలా యీయిద్దరు క్రైస్తవులవైపు తిరిగి,

"పాతబడిపోయిన క్రైస్తవమతంలో మీవిశ్వాసం చూస్తే నవ్వొస్తూంది. అప్పుడే పదమూడువందల యేళ్ళక్రిందట ఆమతసిద్ధాంతాన్ని తలదన్ని యింకోటి బైలుదేరింది. అది మహమ్మదు ప్రవక్త బోధన! చూడండయ్యా మామతం యూరోపులో, ఆసియాలో, చివరకి ఎంతో

నాగరికతగల చీనాలోకూడా యెట్లా వ్యాపిస్తూందో! దేవుడు యూదుల్ని త్రోసిపుచ్చేడని మీరే అంటున్నారుగదా. దానికితార్కాణంగా వాళ్ళు దేశ దేశాల చెల్లాచెదరై, వాళ్ళమతం వ్యాప్తి నొందడంలేదని చెప్పేరు. అయినప్పుడు ఇస్లామ్‌యొక్క సత్యాన్ని యెందుకు అంగీకరించరు? అది ప్రతిచోట జనుల్ని తనలోకి స్వీకరిస్తూనేవుంది, మార్చుకుంటూనేవుంది. మహమ్మదు దేవుని దూతల్లో కట్టకడపటివాడు. ఆయన ననుసరించిన వారే మోక్షాన్ని పొందగలరు. అందులోనూ ఓమరును అనుసరించేవాళ్లే సుమీ. ఆలీని అనుసరించినవాళ్ళకి పుట్టగతు లుండవు! ఎందుకంటే వాడు సత్యమైనమతానికి ద్రోహం చేసేడు!" అన్నాడు.

పెరిష్యనువేదాంతి ఆలీతెగకి చెందినవాడు. అంచేత దీనికి సమాధానం యిద్దామనుకుంటూన్నాడు. కాని, అప్పటి కప్పుడే అక్కడ చేరియున్న వివిధమతస్థులలో తీవ్రవాదోపవాదాలు చెలరేగినాయి. అందరూ మాట్లాడేవాళ్ళేగాని వినేవాళ్ళు లేరు. చాల పురాతనమైనదీ సమస్త సౌకర్యాలూ గలదీ అగుటచేత యీసత్రానికి వివిధ దేశాలనుంచి ఎందరెందరో వస్తూంటారు. ఆసమయాని కచ్చట చేరినవాళ్ళల్లో అబిసీనియన్ క్రైస్తవులు, టిబెట్‌లామాలు, ఇస్మాయిలీయులు, అగ్నిని పూజించే పార్శీలూ, యింకా యెన్నో మతాలవాళ్లూ వున్నారు. దేవుని నిజమైన స్వరూప స్వభావా లెల్లాంటివి? అతనిని ఆరాధించవలసిన విధానమేది? ఈవిషయాల్నిగూర్చి యుక్తిప్రయుక్తులు చెలరేగుతున్నాయి. ఎవరికివారే తమ మతంలోనే దేవుని తెలుసుకోడానికి అవకాశా లెక్కువగా వున్నాయనీ, దేవుని పూజించే విధానం కూడ తమదే ఉత్కృష్టమైనదనీ, యితరుల పూజావిధానాలు హీనమైనవీ, అసమగ్రమైనవీ యనీ వాదిస్తున్నారు.

ఎవడూ తీసిపోవడంలేదు. సత్రంకప్పు యెగిరిపోయేటట్లుగా అరుస్తున్నారంతా. కేవలం ఒక్కడుమాత్రం ఆవాదనలో పాల్గొనకుండా

ఓమూల నిశ్శబ్దంగా కూర్చుని వున్నాడు. కన్ఫ్యూషియసు మతావలంబి యగు నా చైనీయుడు, ఒకమూల మౌనంగా కూర్చుని, టీ చప్పరించి త్రాగుతూ, అందరూ చెప్పేమాటలు వింటూన్నాడు. ఆమహమ్మదీయుడు అతన్నీ ఊరుకోనివ్వదలచుకోలేదు..

"ఏమండీ! మీరు తెలిసినవారు. నా వాదనలోని సత్యం మీకే తెలుసు. మీరు మాట్లాడ్డంలేదుగాని, లేకపోతే నన్నే సమర్థిస్తారని యెదు గుదును. మీదేశపువర్తకులు "కస్టమ్సు హౌసు"కు తరుచు వస్తుంటారు. మీదేశంలో యెన్నోమతాలు ప్రవేశించినా, మీరు మహమ్మదీయ మతాన్నే అత్యుత్తమమైనదిగా యెంచుతారనీ, ఆమతాన్ని మనఃపూర్వకంగా స్వీక రిస్తుంటారనీ పెద్దలు చెప్పగా విన్నాను. దయయుంచి నామాటల్ని రూఢి పరచండి. నిజమైన దేవుడు, అతనిప్రవక్త యెట్టివారో సెలవియ్యండి." అన్నాడు. వినయాన్ని నటిస్తూ కస్టమ్స్ ఆఫీసరు.

అందరూ ఔనౌనంటూ, చైనీయుని వైపు తిరిగి "మీ అభిప్రాయ మేమిటో చెప్పాలి, వింటాం," అన్నారు.

కన్ఫ్యూషియస్ శిష్యుడైన ఆ చైనీయు డొక్కనిముషం కళ్ళు మూసికొని ఆలోచిస్తూన్నట్లుండిపోయేడు. కొంచెం సేపటిలో కళ్ళు తెరిచి, అంగరఖా జేబుల్లోంచి చేతులు బయటికి తీసి కట్టుకు నిల్చుని ప్రశాంతంగా నెమ్మదిగా మాట్లాడ నారంభించేడు.

"అయ్యా! మతానికి సంబంధించిన సమస్యలమీద మానవుల్లో పరస్పరాంగీకారం కుదరక పోవడానికి ముఖ్య కారణం వారిలోని అహంభావమేనని నా అభిప్రాయం. ఈసందర్భంలో నేనొక కథ చెపుతా మీరంతా సావధానంగా వినాలని నా ప్రార్థన."

"నేనిక్కడికి ఒక యింగ్లీషు ఓడపై వచ్చేను. ఆఓడ ప్రపంచ మంతా చుట్టి వచ్చినదే. మేమొకసారి సుమత్రా ద్వీపపు తూర్పుతీరంలో

సప్లైయిలకై ఆగేము. అది మధ్యాహ్న సమయం. మాలో చాలమంది తీరానికి వచ్చి కొబ్బరితోపుల్లో నీడని చతికిలబడి, బాతాఖానీ కొడుతూన్నాం. దగ్గరలోనే ఒక చిన్న గ్రామం కనిపిస్తూంది. మాలో అనేక దేశాల వాళ్ళం వున్నాం.

"మేమక్కడ కూర్చుని వుండగానే ఒక అంధుడు మమ్మల్ని సమీపించేడు. సూర్యునిలో యేమున్నదో, అతని తత్వమేమిటో తెలుసుకోవడానికై అతడు అదేపనిగా, తదేకదృష్టితో సూర్యునివైపు చూడడం వల్లనే ఆతనికి దృష్టిహీనత కలిగిందని మాకు ఆతర్వాత తెలిసింది."

"చాలకాలం యీ విధంగా సూర్యునివైపు చూస్తూ, సూర్య రహస్యాన్ని భేదించడానికి యత్నించడంతో అతని కళ్ళు వెలుతురునే చూడజాలక పోయినాయి. అతడు క్రమంగా అంధుడై పోయేడు."

ఆతడీరీతిగా తర్కించ నారంభించేడు. "సూర్య రశ్మి ద్రవ పదార్థం గాదు. ద్రవమే అయితే దానిని నీటికి వలెనే ఒక పాత్రనుంచి మరొక పాత్రలోనికి పొయ్యవచ్చును గదా? అది గాలికి తరంగాలుగా కదలాలి కూడాను. పోనీ అది అగ్ని యందమాఅంటే అదీగాదు. అగ్ని అయితే నీటిచే దానిని ఆర్ప వచ్చును గదా! అది వాయు పదార్థ మంతకంటె గాదు. దీనిని కండ్లతో చూడగలుగుతూన్నాం. కనుక యిది చక్షుర్గోచరంగాని వాయుపదార్థం కాజాలదు. అది ఘనపదార్థమనుటయు సత్యము గాదు. దానిని చేతులతో అటునిటుపట్టి కదలించుట అసాధ్యము గదా? ఏతావాతా! సూర్యరశ్మి ద్రవ, అగ్ని, వాయు, ఘన పదార్థాదుల్లో దేనిక్రిందనూ లెక్కించరానిదని తేలింది. అయితే అదేమిటి? శూన్యం, మిథ్య- గాక మరొకటి గాదు!"

"ఈ రీతిగా అతడు తర్కించుకొని, సూర్యుని చూస్తూ చూస్తూ, చివరకి విచక్షణా శక్తితోపాటు దృష్టినికూడ పోగొట్టుకున్నాడు.

పూర్తిగా కళ్ళుపోయి. అంధకారంలో బడినపుడు, 'సూర్యుడు మిధ్య' అనే సిద్ధాంతం సత్యంగానే అతనికి వర్తించింది!

"ఈ అంధునితో బాటొక సేవకుడుకూడ వచ్చేడు. యజమాని నొక కొబ్బరిచెట్టు నీడను కూర్చుండబెట్టి, అతడొక కొబ్బరికాయను తీసి వొలిచి పగులకొట్టేడు. కొబ్బరి ముక్కను పిండి నూనెను చిప్పలో పోసి, పీచుతో వొత్తిచేసి, నూనెలో నాన బెట్టేడు. సేవకుడీ కార్యక్రమంలో నిమగ్నుడై వుండగా యజమాని అతనిని ప్రశ్నించ నారంభించేడు: "ఏమిరా! సూర్యుడు లేడని నేను చెప్పినది సత్యమేనా? ఎంత చీకటిగానున్నదీ నీవు చూడ్డంలేమా? కాని లోకులంతా సూర్యుడున్నాడంటారు. ........... అదే నిజమైతే, ఆసూర్యుడెట్లా వుంటాడు?" సేవకుడాతనికిట్లా జవాబిచ్చేడు. "స్వామి! సూర్యుడంటే యేమిటో నాకు తెలియదు. అది తెలుసుకోడం నా తలకు మించిన పని. కాని వెలుతురంటే యేమిటో చెప్పగలను, చీకటిలో దేనినైనా తెలుసుకోడానికి, మన యింట్లో వస్తువుల్ని చూడ్డానికీ యిదిగో యిదే యీదివ్వె వుపయోగిస్తుంది. ఇదే నా పాలిటి సూర్యుడు."

"ఆసమీపంలోనే కూర్చునివున్న కుంటివాడొకడీ సంభాషణ విని, అంధునితో యిట్లా అన్నాడు: "నీవు సూర్యుడంటే యేమిటో తెలిసికోలేని పుట్టుగ్రుడ్డిలావున్నావు. సూర్యుడంటే యేమిటో నేను చెపుతా. ప్రతిరోజూ ఉదయమే సముద్రంలోంచి లేచి, మనద్వీపంలోని కొండలమధ్య మాయమైపోయే అగ్నిగోళమే, సూర్యుడు! మేమంతా దినదినం దీన్ని చూస్తూనేవున్నాము. పాపం నీకు నేత్రావరోధమే లేకపోతే, నీవూ యిది తెలిసికోగలిగేవాడవు".

"ఆసమీపంలో చేపలను పడుతూన్న జాలరి ఒకడు, యీ సంభాషణను విని, ఊరుకోలేకపోయేడు: "ఓయీ! నీవు కుంటివాడవు.

ఈచిన్నద్వీపాన్ని వదలి యెక్కడికీ పోలేదని నీమాటలే చెప్తున్నాయి. నాకువలె యీపడవలో సముద్రమంతా తిరిగితే అట్లా ఎప్పుడూ చెప్పివుండవు. సూర్యుడు మనద్వీపంలోని కొండల్లో యెప్పుడూ క్రుంకటంలేదు. సముద్రంలోంచి లేచినట్లే ప్రతీసాయంత్రం తిరిగి సముద్రంలోనే గ్రుంకుతూన్నాడు. ఇది యదార్థం. నేను నిత్యం నాకళ్ళలో యీ విషయాన్ని చూస్తూన్నాను."

"మేమందరం కుతూహలంతో యీసంభాషణను వింటూన్నాము. మాలో ఒక హిందువుడున్నాడు. అతడు వుండబట్టలేక యిట్లా అందుకున్నాడు. "ఇటువంటి విషయాల్ని జ్ఞానవంతులెవరూ అంగీకరించరు. అగ్నిగోళం నీటిలో మునిగితే ఆరిపోకుండా యెట్లా వుంటుంది? సూర్యుడు అగ్నిగోళం కానేకాడు. అతడొక దేవుడు. దినదినమూ తన బంగారు రథము నెక్కి మేరుపర్వతముచుట్టూ పరిభ్రమిస్తూంటాడు. ఒక్కొక్కప్పుడు రాహుకేతువులను రాక్షసులు సూర్యదేవుని కబళిస్తారు. ఆసమయాల్లో లోకాలు అంధకారంలో మునుగుతాయి. అటువంటి సమయాల్లో మాదేశంలోని బ్రాహ్మణులు ప్రార్థనలు చేస్తారు. సూర్యుడు రాక్షసవిముక్తుడౌతాడు. సూర్యుడు సమస్తభూమండలాన్నీ వెలుతురుతో నింపుతూన్నాడు. మీఒక్కదేశాన్నే అనుకోకండి. మీద్వీపంతప్ప, అన్యప్రపంచం ఎరుగని మీబోటివాళ్ళే యిట్లా అజ్ఞానంలో పడతారు!"

"ఈజిప్టుదేశపు నావికు డొకడు మాలోవున్నాడు. అతడూ తన పాండిత్యాన్ని కప్పిపుచ్చుకోలేకపోయేడు. "అబ్బే మీరందరూ చెప్పేదీ పొరబాటే. సూర్యుడు దేవుడే కాదు. హిందూదేశం, దాని పవిత్ర పర్వతాలూమాత్రం చుట్టి తిరిగేవాడసలే కాదు! నల్ల సముద్రం, అరేబియా సముద్రం, ఆఫ్రికాచుట్టునున్న సముద్రం, ఫిలిప్పైను దీవుల వరకూ

హిందూ మహాసముద్రం- యివన్నీ ప్రయాణం చేసేను ఇండియానేగాక యావత్ప్రపంచాన్నీ సూర్యుడు వెలిగిస్తూన్నాడు. సూర్యుడు మేరు పర్వతం చుట్టూ తిరగడు! జపాను దీవులకావల వుదయించి యింగ్లాండు దీవుల కావల అస్తమిస్తున్నాడు. అందుకనే జపానీయిలు తమ దేశాన్ని "నిప్పన్" అంటారు. "సూర్యుని జన్మ స్థానం" అని దీనికర్థము. నే నిదంతా స్వయంగా చూసి తెలుసుకున్నాను. దిగంతాల వరకూ లోక సంచారం చేసిన నా పితామహుడుకూడ యీ విషయాన్ని సమగ్రంగా నాకు చెప్పేడు."

అతనింకా వుపన్యసించేవాడేగాని ఒక యింగ్లీషు నావికుడాతనికి అడ్డు వచ్చేడు, "ఊరుకోండి. సూర్యుణ్ణిగూర్చి మాదేశీయులకు తెలిసినంతగా మరెవరికీతెలిసియుండదు! సూర్యుడు యెక్కడా వుదయించడు, అస్తమించడు. అతడు భూమిచుట్టూ నిరంతరం తిరుగుతూంటాడు. ఇందులో యేమీసందేహమే లేదు. ఇప్పటికి భూమండలమంతా యెన్నో సార్లు ప్రదక్షిణం చేసి వచ్చేము. ఎక్కడా సూర్యుడు మాకు అడ్డు రానే లేదు. ఏప్రదేశానికిబోయినా, ఉదయాన్నే తూర్పునకనిపించి సాయంత్రం పశ్చిమాన మాయమౌతూన్నాడంతే."

"ఇట్లా వాదిస్తూ ఒకకర్రతీసుకొని యిసుకలో సున్నలు చుడుతూ యీ విషయాన్ని విపులీకరించ నారంభించేడు. కంగారు పడి చెప్పలేక చివరకి ఓడతాలూకు సరంగును చూపుతూ, "యిదిగో యితను నాకంటె బాగా చెప్పగలడు;" అని వూరుకున్నాడు. ఓడ సరంగు చాల తెలిసిన వాడు. అందరూచెప్పేవి వింటూ యింతవరకువూరుకున్నాడు. అందరూ తనవైపు ఆతురతగా చూడ్డాన్ని గమనించి అతడన్నాడు:

"మీరందరూ ఒకరినొకరు తప్పుదారిలో వున్నారంటూనే, మీరు తప్పు దారిలో వుంటున్నారు. సూర్యుడు భూమిచుట్టూ తిరగడం లేదు. భూమి తన యిరుసుమీద తాను తిరుగుతూ, సూర్యునిచుట్టూ తిరుగుతూంది. అందుచేతనే ప్రతి యిరవైనాల్గు గంటలలోనూ జపాన్, ఫిలిప్పైన్ సుమత్రాలేగాక ఆఫ్రికా, అమెరికా, యూరోపు ఖండాలు కూడ సూర్యునివైపు తిరుగుతూన్నాయి. సూర్యుడు కేవలం ఒక్క పర్వతానికో, ద్వీపానికో, దేశానికో, సముద్రానికో, లేక మన భూమండలానికో మాత్రమే గాక అనేక యితర మండలాలకి కూడ వెలుతురునిస్తున్నాడు. మీరు క్రింది నేలవైపునకు గాదు, చూడవలసినది. పైకి నక్షత్రమండలంలోనికి చూస్తే యిది తెలుసుకో గలుగుతారు. మీకూ మీ దేశానికీ మాత్రమే గాక సూర్యు డాకాశాన్నంతనూ వెలిగిస్తూన్నాడని తెలుసుకోండి.

"ప్రపంచమంతా పర్యటనం చేసిన ఆ ఓడ సరంగు యీవిధంగా చెప్పి ముగించేడు." అని చెప్పి ఆ చైనీయుడిట్లా అన్నాడు.

"ఈ రీతిగానే మత సమస్యలమీద కూడ దురభిప్రాయాలకి దారి తీస్తూన్నది మనలోని అహంభావమే. అదే మానవుల్లో విద్వేషాన్ని రెచ్చగొడుతూంది. సూర్యుని విషయంలో వలెనే దేవుని విషయంలోనూ జరుగుతూంది. ప్రతివాడూ తన ప్రత్యేక దైవాన్నిగాని, అధవా తన జాతికొక ప్రత్యేక దైవాన్నిగాని సృష్టించుకుంటున్నాడు. విశ్వమంతటికీ మించిన ఈశ్వరుని తమ చిన్న దేవాలయంలో బంధించి వుంచుకోవాలని ప్రతీవారి తాపత్రయం! ఆ విశ్వకర్మ సృష్టించిన యీ విశాల విశ్వము

కంటె మానవ నిర్మితములైన యీ చిన్నచిన్న ప్రత్యేక గుడులు భగవన్మహిమను బోధించ గలవా? ఒకే మతము, ఒకేవిశ్వాసముతో జీవించుమని ఘోషిస్తూన్న ఆ ఈశ్వర ప్రకృతితో వానిని బోల్చరాదు గదా!"

"ఈశ్వర సృష్టినిచూసే మానవులు తమదేవాలయాలను నిర్మించుకొన్నారు. ప్రతి దేవాలయంలోను నీటి కొలనులు, నగిషీ పని చేసిన సరంబీ, దీప గోళాలు. చెక్కడపు విగ్రహాలు, చిత్తరువులు, శిలా శాసనాలు, న్యాయ ధర్మ శాస్త్రాలు. నిత్య నైవేద్యాలు, బలిపీఠాలు, పూజారుల, యీ పటాటోపం అంతా వుంటుంది. కాని ప్రకృతిదేవాలయంలోని వాటితో నివిపోల్చదగినవా? సముద్రంకంటెమించిన నీటికొలనేది? ఆకాశమువంటి చాందినీ యెక్కడుంది? సూర్య చంద్ర తారకలను మించిన దీపగోళా లెక్కడున్నాయి. ప్రవక్తలు, మహర్షులు, మహాత్ములను బోల్చ దగిన విగ్రహముల నేదేవాలయం యిముడ్చుకోగలదు? ఆ మహాపురుషావు లొసంగిన దివ్య సందేశాల్ని బోలిన శాసనాలు యే దేవాలయపు రాళ్ళపై చూడగలము. మానవ జాతి కత్యంత శుభావహములైన వా మహాత్ముల సందేశాలే గదా? మానవ హృదయాల్లో నిరంతరం విని పించే అంతఃకరణ ప్రబోధాలను మించిన ధర్మ గ్రంథము లేవి? పరస్పర ప్రేమతో స్త్రీ పురుష లొనర్చుకొనే ఆత్మ త్యాగాలను మించిన బలుల నెవరీయ గలరు? మానవుల హృదయాలను మించిన బలిపీఠాలేవి? సద్హృదయములపై నుంచబడిన పూజా పుష్పాల్ని ఈశ్వరుడు తప్పక స్వీకరించి తీరుతాడు!"

"ఒకరు ఈశ్వరుని గూర్చి విశాల ఉన్నత భావనను కలిగియున్న కొద్దీ అతడు ఈశ్వరుని మహత్వాన్ని యెక్కువగా గ్రహించ గలుగుతాడు. అతనిజ్ఞానము విశాల మగుచున్న కొలదీ సత్కార్యాచరణకై

అతని దీక్ష హెచ్చు పెరుగుతుంది. అతని ప్రతి చర్యయు త్యాగాన్వితమై విశ్వ కళ్యాణమే ఏకైకాశయముగ్గా కలిగియుంటుంది."

"సూర్యుని అనంత తేజము విశ్వమంతటినీ తన వెలుగుతో నింపుట చూచిన ఆ మనుజుడు, ఆయనంత తేజోకిరణం ఒక్కదాన్ని తన దివ్వెలో చూచు నల్పజ్ఞుని నిందించరాదు; అసహ్యించుట అంతకు ముందే పనికిరాదు. అంధుడై సూర్యుని కాంతి లేశమునైనను చూడ లేక సూర్యుని అస్తిత్వమునే నిరాకరించు నా అవిశ్వాసిని చూసిగూడ శతృత్వమును వహింపరాదు."

కన్ఫ్యూషియస్ మతావలంబియైన ఆ చైనీయుడిట్లా పలికి ఊరుకోగానే ఆ సత్రంలోని వాళ్ళందరూ నిరుత్తరులై ఆలోచనలో పడ్డారు. ఎవరి మతము గొప్పదా? అన్నే తర్కం అంతటితో నిలిచిపోయింది.

(ఫ్రెంచి భాషలో 'బెర్నార్డిన్-డీ-సెయింట్ పీర్రి' ననుసరించి టాల్‌స్టాయ్ రచించింది. 1893.)

---



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA109 B182 |
| పుస్తకం పేరు | [illegible] కథలు |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NA |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Jhasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |